# విషయసూచిక.



పుటలు.





# పీఠిక.

ఉపనిషత్తులు దేనిని "ఆత్మ" అని చెప్పుచున్నవో, దేనిని ఖోరాను "రూహు" అనియు, బైబిలు "సోల్" అనియు, చెప్పుచున్నవో, అట్టి జీవతత్త్వము యొక్క స్వరూప స్వభావములు మనకు ముఖ్యముగఁ దెలియఁదగినవి. ఈశ్వరతత్త్వాంశ సంభూతుఁడును, అణుప్రాయుఁడును, అగు జీవుఁడు సహజముగ శుద్ధుఁడు. ఈశ్వరతత్త్వమును హిందువులు "బ్రహ్మ" "పరమాత్మ" "భగవంతుఁడు" అను నామములతో వ్యవహరించుచున్నారు. ఆ తత్త్వమునే మహమ్మదీయులు "అల్లా" అనుచున్నారు; క్రైస్తవులు "గాడ్" అనుచున్నారు.

ఈశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడు. అయినను మనమతని శక్తులలో మూఁడింటిని మాత్రమే ఎఱిఁగియున్నాము. అందులో మొదటిది "ఆత్మశక్తి" "చిచ్ఛక్తి" లేక "అంతరంగశక్తి" అనునది. ఈశక్తి అతనికి సారభూతమగుచు అతని నిత్యసిద్ధ స్వరూపమందు సదా చూడఁబడుచున్నది. ఈశక్తి చేతనే అతని నిత్యలోకము నిర్మింపఁబడినది. అతని పారిషదులు, లేక, దివ్యపురుషులుకూడ దీనిచేతనే నిర్మింపఁబడుచున్నారు. ఈనిత్యలోకమును మహమ్మదీయులు "బెహిష్త" అనియు, క్రైస్తవులు "హెవెన్" అనియు చెప్పుచున్నారు.

రెండవది "బహిరంగశక్తి" "మాయ" లేక "ప్రకృతి" అనునది. శ్రీభగవద్గీతయందు ఇది ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, మనస్సు, బుద్ధి, అహంకారము అను ఎనిమిది విధములు గలదిగఁ జెప్పబడినది. ఇందులో మొదటి ఐదింటిచే స్థూలజగత్తును, కడపటి మూఁడింటిచే సూక్ష్మజగత్తును, నిర్మింపఁబడినవి. అష్టవిధములగు ఈప్రకృతి "అపరా ప్రకృతి" గఁ జెప్పఁబడినది. ఇదిగాక "పరాప్రకృతి" అని చెప్పఁబడెడి మఱియొకశక్తి అతనికిఁ గలదు. ఇదియే మన మెఱిఁగియున్న అతని మూఁడవశక్తి. దీనిని "జీవశక్తి" అందురు. ఈశక్తి చిచ్ఛక్తివలె ఈశ్వరతత్త్వమునకు సారభూతమే అగుచున్నది.

ఈమూఁడు శక్తులును ఈశ్వరతత్త్వముతో సంబంధము గలవే. ఆత్మశక్తిచేఁ జిన్మయజగత్తు, లేక, నిత్యలోకమును, మాయాశక్తిచే సగుణ భువనాత్మకమగు సమస్త విశ్వమును, నిర్మింపఁబడినవి. మాయాశక్తి ఆత్మశక్తి యొక్క ఛాయామాత్రమనియే చెప్పఁబడినది.

అగ్నికంటె భిన్నముగ దాహకశక్తి యుండఁజాలనట్లు శక్తులేవియును శక్తిమంతునికంటె భిన్నములుగ నుండఁజాలవు. కనుక సర్వశక్తిమంతమగు ఈశ్వరతత్త్వము "అద్వయ" తత్త్వమని చెప్పఁబడుచున్నది. శక్తిమంతుఁడు తనశక్తుల నన్నిఁటిని తెలిసికొని యున్నవాఁడగుటచే ఈశ్వరుఁడు "జ్ఞాన" తత్త్వమనికూడఁ జెప్పఁబడుచున్నాఁడు.

ఈ "అద్వయజ్ఞానతత్త్వము" నకు "చిత్తు" సాగభూతమని యింతకు ముందే చెప్పఁబడినది. బ్రహ్మాండములను నిర్మించు మాయాశక్తిని సంబంధించెడి దేశకాల కారణత్వములచేఁ దనకెట్టి బాధయు లేకుండుట వలన ఆతత్త్వము "సత్తు" అను లక్షణము, అనఁగా నిత్యవర్తమాన లక్షణము గలదిగఁ జెప్పఁబడుచున్నది. తనశక్తి ప్రకటనము "క్రీడార్థం సృష్టిరితి" అని ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడినట్లు తనకు విలాసమాత్రమగుటచే ఆతత్త్వము ఆనందలక్షణము గలదిగఁ గూడఁ జెప్పఁబడినది. ఈవిధముగ అద్వయజ్ఞాన తత్త్వమునకు "సచ్చిదానంద" లక్షణమేర్పడుచున్నది.

ఈ అద్వయజ్ఞానతత్త్వము "జ్యోతిషామపి తజ్జ్యోతిః" అని శ్రీభగవద్గీతయందు చెప్పినట్లు స్వయంప్రకాశవంత మగునదియే కాక జీవతత్త్వమునకు అంతర్యామి అగుచున్నదనియు, జీవజగత్తుల సంబంధముచే బాధింపఁబడక మఱలఁబ్రత్యేక పూర్ణావస్థయందే ఉండుననియుగూడ అంతర్యామి బ్రాహ్మణమునందుఁ జెప్పఁబడినది. హిందువులలో ఈతత్త్వమును పైని జెప్పినట్లు "వెలుఁగులకు వెలుఁగు" గ భావించువారు దీనిని "బ్రహ్మ" అనుచున్నారు. జీవాంతర్యామిగ భావించువారు దీనిని "పర

మాత్మ" అనుచున్నారు. పూర్ణావస్థయందున్నదానిగ భావించువారు దీనిని "భగవంతుఁడు" అనుచున్నారు.

జీవుఁడును, జగత్తును ఈశ్వరశక్తి నిర్గతములని ఇంతకుముందే చెప్పఁబడినవి. శక్తి శక్తిమంతునికంటె భిన్నముకాదనికూడఁ జెప్పఁబడినది. కావున శక్తినిర్గతములగు జీవజగత్తులకు ఈశ్వరునితో ఈవిధముగ "అభేదము" ఏర్పడుచున్నది. కాని జీవుఁడు అణుప్రాయుఁడగుటయు, ఈశ్వరుఁడు మహద్విషయమగుటయు, బరిశీలించినపుడును, అనృత జడదుఃఖమయమగు ఈనశ్వర జగత్తును, సచ్చిదానంద మయమగు ఈశ్వర తత్త్వమును బరిశీలించినపుడును, జీవజగత్తులకు ఈశ్వరునితో "భేదము" చూపట్టుచున్నది. కాని ఈనశ్వరజగత్తునందు "భేదము" "అభేదము" మున్నగు విరుద్ధవిషయములు ఒకేకాలమందు సత్యత్వము నొందుటకు ఎట్టి అవకాశమును లేదు. కాని ఈశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడగుటచేఁ బరస్పరవిరుద్ధ విషయము లన్నియును అతనియందే సమంజసత నొందుచున్నవి. కాని యిట్టి విరుద్ధధర్మ సామంజస్యమును మానవబుద్ధి గ్రహింపనేరదు గనుక ఇది అచింత్య భేదాభేదతత్త్వముగఁ జెప్పఁబడినది. ఈ అచింత్య భేదాభేద తత్త్వమే సర్వవేదాంతసార రూపమగు ఉపదేశముగఁ దత్త్వజ్ఞులు చెప్పుచున్నారు. ఇది తెలియఁబడెనేని సర్వము తెలియఁబడినట్లే. "యేనైకేన జ్ఞాతేన సర్వమిదం జ్ఞాతం భవతి" అనునది ఉపనిషద్వాక్యము.

ఇట్లు తెలిసికొనక జీవజగత్తులకు ఈశ్వరునితో "కేవల అభేద" మే చెప్పి ఈరెంటికిని మిథ్యాత్వము నాపాదించువారు "బ్రహ్మవాదు" లనఁబడుచున్నారు. తక్కినవారు "ఈశ్వరవాదు" లనఁబడుచున్నారు. ఏమన, వీరికిఁగల సత్యగ్రహణము బ్రహ్మవాదుల సత్యగ్రహణమును మించియుండును. బ్రహ్మవాదులు తర్కమూలమున అనాత్మనుండి ఆత్మను వేఱుపఱతురు గనుక వారు "తర్కపథగాములు" గఁ జెప్పఁబడుచున్నారు. ఈశ్వరవాదులు ఆత్మకు అనాత్మయందు అను ప్రవేశము

భావించువారు గనుక వీరు శ్రోత్రపంథ (Way of aural reception) కు సంబంధించినవారును, "తర్కాతీత వేదాంతులు" ను అని చెప్పఁబడుచున్నారు.

జీవేశ్వర జగత్తులకు సంబంధించిన జ్ఞానము క్రమముగ బోధింపఁబడినపుడే అందఱకును సులభముగఁ దెలియుచున్నది. జీవుఁడు భగవంతుని అంశమనియు, చిన్మయుఁడనియు, స్వేచ్ఛామయుఁడనియు, స్వాతంత్ర్యము గల ప్రత్యేక వ్యక్తియనియు, చిన్మయములగు ఇంద్రియములతో ఒప్పువాఁడనియు, బోధించుట మాని ప్రకృతి నిర్మితుఁడనియు, పరతంత్రుఁడనియు, బ్రహ్మప్రతిబింబమాత్రుఁడనియు, బోధించుటవలన సర్వోత్తమమైన మానవ జన్మయందు సోపాన మార్గముగ ఎవ్వరికిని జ్ఞానశిక్ష లభింపఁజాలదు. ప్రపంచజ్ఞానముతోపాటు ప్రపంచమందు వ్యవహరించుచున్న తానెవ్వఁడో, ప్రపంచమును సృష్టించిన యతఁడెవ్వఁడో అను జ్ఞానముకూడ సులభపద్ధతిని తెలియనప్పుడు ప్రపంచముతోడను, ఈశ్వరునితోడను దనకుఁ గల సంబంధ మెన్నఁటికైనఁ దెలియఁబడునా? అట్టి సంబంధము సరియగు విధమునఁ దెలియకుండ లోకహితముగను, ఈశ్వర ప్రీతిగను జీవించుటకెవ్వరికైన సాధ్యపడునా? ప్రజలును, భగవంతుఁడును సంతోషించని బ్రతుకొక బ్రతుకా? స్వార్థపరత్వముతోఁ గూడుకొన్న నిరంకుశ జీవనము నింద్య జీవనమని జీవునికిఁ దెలియుటెట్లు? కావున జీవజగత్తులతో మనకుఁ గల సంబంధము సక్రమ పద్ధతిని మనము తెలిసికొనకున్నచోఁ బశుజీవనమే మనకుఁ బ్రాప్తించును. ఇట్టి జ్ఞానము మనకు ఉగ్గుపాలతో లభింపవలసినదే.

శైశవమునఁ దల్లిదండ్రుల లాలన పాలనములు మనకు లభించు కాలమందే దేవుఁడు, జీవుఁడు, ప్రేమ, మైత్రి, కృప మున్నగునవి మనకుఁ బరిచితములు కావలసి యుండును. తదుపరి విద్య నేర్చికొను కాలమందు ఈ పదములకు ఉపాధ్యాయులు సరియగు నర్థము చెప్పి మన జీవనము నిరర్థకమును, నిరంకుశమును గాకుండఁ గాపాడవలెను. ఇట్టి శిక్షమాని యితర శిక్షయెంత

యోసంగినను చుక్కానులేని నావవలె మన జీవితము సంసార సముద్రమునం
బ్రమాద రహితముగా నడపబడ నేరదు. దేవుఁడెవఁడో, వానికేదైన రూప
మున్నదో లేదో, వానిని దెలిసికొను టెట్లో, ప్రేమించు టెట్లో, స్మరించు
టెట్లో, అను విషయములును, జీవుఁడెవఁడో, అతనికీ ప్రపంచముతో
ఎట్టి సంబంధము గలదో, అతఁడు ఇతరులకు ఎట్టి మేలు చేయవలెనో, నిజ
మగు శాంతి అతనికెట్లు కలుగునో, స్వార్థత్యాగమన నెట్టిదో, ఏయే భావము
లతో దేవుని సేవింపనగునో అను విషయములును, చిన్ననాఁటనుండియే
సులభమార్గమునఁ దెలిసికొనఁ దగినవి. పాఠశాలలలో వేదాంతము చెప్పఁ
గూడదనునది దీనికన్వయించునది కాదు.

సులభమార్గము విడిచి సర్వము బ్రహ్మమనియు, బ్రహ్మకంటె
వేఱొక్కటియు నితరము లేదనియు, జీవుఁడు జగత్తు అనునవి మిథ్యాభూతము
లనియు, మాయాధ్యాసచే బ్రహ్మమందు ఇవి తోఁచుచున్నవనియు, ఆ ధ్యాస
తొలఁగినను బ్రహ్మమే మిగులుననియు, ఆ బ్రహ్మమే నీవనియు, నీవే
నారాయణుఁడవు, కృష్ణుఁడవు, శివుఁడవనియు, సమస్తలోకములును
నీయందే పుట్టి మఱల నీయందే అణఁగి పోవుచున్నవనియు, మున్నగు
ధోరణిలో చేయు బోధకే పైనఁజెప్పిన "వేదాంత" శబ్దము నన్వయించును.
ఇట్టి బోధ సరియగునది కాదని నేను చెప్పువాఁడను కాను. కాని యిది
విద్యార్థులకు ఉపయోగించునది కాదు. కొందఱు విద్యాధికులకుఁ గూడ
ఇది తలకెక్కునట్టి బోధకాదు.

పైనుదహరించిన విధమున దేవుని విషయమును, జీవుని విషయమును,
చిన్నలకుపయోగించు విధమునఁ బది అధ్యాయములలో ఈ గ్రంథము వ్రాసి
తిని. ఏవ్యసనములను గూర్చి పిన్నలు జాగరూకులై యుండవలెనో, అట్టి
వ్యసనములు మున్నగునవి పదునొకండవ అధ్యాయమునందు వివరింపఁబడినవి.

హైందవ మహమ్మదీయ క్రైస్తవమతములు ప్రపంచమునందుఁ జాల
భాగము వ్యాపించియున్నవి. వానికి సంబంధించిన మతగ్రంథములందు

దేవుఁడు, జీవుఁడు, జగత్తు అనువాని విచారముకలదు. ఈ విచారమునకు సంబంధించిన సాదృశ్య నిరూపణమే ఈగ్రంథముయొక్క ముఖ్యాభిప్రాయము. ఇది అంత సులభమగు పనికాదని చదువరి ఊహింపవలెను. వివిధ మత సామరస్య నిరూపణములేని గ్రంథము ఎల్లరచేఁ బఠనీయముకాదు. పిన్నలగు విద్యార్థులలో ఈమూఁడు మతములవారును ఉందురుకదా? కావున ఇట్టి సామరస్య నిరూపణములేని గ్రంథమునందు వారికి ఆదరబుద్ధి కలుగుట కష్టము.

ధర్మబోధనము విద్యార్థులకు ఆవశ్యకమను నభిప్రాయము ఎందఱో విద్యాధికులు అనేకపర్యాయములు వెలిబుచ్చియున్నారు. అట్టి విద్యార్థులకు ఉపకరించుట కొఱకే ఈ గ్రంథము వ్రాయఁబడినది. దొరతనము వారి యొక్కయు, విశ్వవిద్యాలయములవారి యొక్కయు, ఆమోదము లభింపఁ గలదేని సోపానమయమార్గమున ధర్మబోధ చేయుటకు ఉపయోగించు విధమున మిక్కిలి తేలికభాషలో ధర్మబోధ వాచకములు వ్రాయనున్నాను.

ఈగ్రంథమునందలి విషయములన్నియును నాకుఁ దెలిసినంత మట్టుకు సప్రమాణముగనే వ్రాసినాను. అయినను ప్రమాదవశమున భిన్నాభిప్రాయములు లిఖింపఁబడెనేని వానిని రెండవ ముద్రణమునందు సవరించి కొందును. ఇందుకు హైందవ మహమ్మదీయ క్రైస్తవ సోదరులు నన్ను మన్నింతురుగాక.

ఈగ్రంథమునందుఁ గననగు కఠినములును, అపరిచితములును అగు కొన్ని పదములకు సరళార్థములు సూచించుచు అర్థసూచిక ఒకటి ఇందుఁ జేర్చినాను. ఇది యెల్లరకు నుపయోగించునని తలఁచుచున్నాను.

ఇట్టిరచనలను ఎల్లరును ఆమోదించి రచయితలకుఁ దగిన ప్రోత్సాహ మొసంగుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

యల్లాప్రంతుల జగన్నాథం, బి. ఏ.,

# ప్రేమధర్మము.

## దేవుఁడెవఁడు?

సచ్చిదానంద లక్షణముగల ఏకానేక అద్వయజ్ఞాన తత్త్వము సర్వమునకు మూలకారణముగ వేదములును, ఋషులునుగూడ అంగీకరించియున్నారు. కాని ఈ అద్వయజ్ఞాన తత్త్వమును వేదాంతులందఱును ఒక్కే విధముగ భావించుచున్నారనుట సరికాదు. తెలిసినవారు వేదాంతులలో రెండు తెగలుకలవని చెప్పుదురు. అందులో ఒక తెగవారు ఈశ్వరవాది వేదాంతులు. వీరు అద్వయజ్ఞాన తత్త్వమును "భగవంతుఁ"డని చెప్పుదురు. వీరు భగవంతునిఁదప్ప ఏ ఇతర తత్త్వమును బూజింపరు. వీరికి భగవంతుఁడు చిన్మయవిగ్రహుఁడు. రెండవ తెగవారు బ్రహ్మవాది వేదాంతులు. అద్వయజ్ఞానతత్త్వమును వీరు "బ్రహ్మ"అని చెప్పుదురు. మొదటి తెగ వేదాంతులకు ఈ అద్వయజ్ఞానతత్త్వము సాకారమగుచుండ, రెండవ తెగవారికి ఇది నిరాకారతత్త్వ మగుచున్నది. నిరాకార బ్రహ్మతత్త్వముతో జీవునికి ఐక్యానుసంధానముకలుగుటకు తత్త్వము నిశ్చలముకావలసివచ్చెను. చిత్తైకాగ్రతచేఁగాని నిశ్చలతత్త్వమునకు

అవకాశము లేదు. నిరాకార బ్రహ్మతత్త్వముపైఁ జిత్తము ఒక్కమాఱుగా నిలువఁజాలదు. కనుక ప్రతీకస్వరూపులగు గణేశ, శివ, శక్తి, సూర్య, విష్ణువు లను ఐదుగురు దేవతలలో ఎవ్వరిపైనైనను జిత్తైకాగ్రత ముందుగ అభ్యసింపఁబడినచోఁ గ్రమముగఁ జిత్తముయొక్క లక్ష్యమును బ్రహ్మతత్త్వముపైఁ జేర్పవచ్చును. కావున వీరు దేవతామూర్తుల నాదరించు వేదాంతులు (Henotheists). ఈశ్వరవాది వేదాంతులు భగవంతునిఁగప్ప వేఱొక దేవతను గొలువని వేదాంతు (Monotheists) లని ఇంతకుముందే చెప్పఁబడినది. బ్రహ్మవాది వేదాంతులు దృశ్యవర్గవిచారముచేసి దర్భపోఁచనుండి యీనుల వలె (ముంజాదిషీకామివ) సద్వ్యయజ్ఞాన తత్త్వమును దాని నుండి వేఱుపఱుతురు. నామరూపములుగల ప్రపంచము నుండి వేఱుపడుటచే ఆతత్త్వము నామరూపములు లేని తత్త్వమనియే వారి అభిప్రాయము. అదియే బ్రహ్మతత్త్వము. విచారజనితమగు ఈతత్త్వమునకు వ్యతిరేక చింతయం దైనను బ్రకృతి గోచరించు చుండును. నామరూప రహితమగు బ్రహ్మనుండియే నామరూప సహితమగు భగవత్తత్త్వము ఉదయించుచున్నదని ఈ వేదాంతుల అభిప్రాయము. కావున వారికి ఈశ్వరుఁడు మాయోపాధికుఁడగుచున్నాడు. భగవంతుఁడు కల్పితనామరూప విశిష్టుఁడు కాక అప్రాకృత నామరూప విశిష్టుఁడగు నిత్యతత్త్వమనియు,

అతఁడు సర్వశక్తిమంతుఁడు గనుక అతని యిచ్ఛననుసరించి అతఁడు నిరాకారుఁడు కావచ్చుననియు, అప్పుడతని నిరాకారిత్వము అతని యనంత గుణములలో నేక గుణముగఁ జెప్పవలెననియు, "ఈశ్వరవాది" వేదాంతుల అభిప్రాయము.

అమెరికాఖండమునకుఁ బోయి అచ్చట చికాగో నగరమునఁ బూర్వము జరిగిన సర్వమత సమ్మేళన సభయందు అద్వయజ్ఞానతత్త్వమును గూర్చి సంభాషించిన వివేకానంద స్వామి బ్రహ్మవాది వేదాంతులలో నివాఁడు. అతఁడా ఖండమందు వేదాంతప్రచార మొనర్చి దానికచట నమితగౌరవము కలిగించెననుట నిజమేకాని సర్వాంకషముగ వేదాంత మచటఁ బ్రచారితము కాలేదు. మేధాబలముచే నివేచింపఁ బడిన బ్రహ్మతత్త్వముతో స్వయంబ్రహ్మ యగు జీవుని కభేదము చెప్పినంత నే వేదాంతవిచారము పూర్తి కాలేదు. జీవేశ్వరులకుఁ గేవలభేదముగాని, కేవలఅభేదముగాని చెప్పుట వేదమున కిష్టము లేనందున వేదమునందు దీనింగూర్చి పరస్పరవిరుద్ధవాక్యములే తోఁచుచున్నవనియు, భేదము, అభేదములను సిద్ధాంతములు యుగపద్ధర్మమున సత్యత్వము నొందుచున్నవనియు, పరస్పర విరుద్ధ విషయములన్నియు ఏ ఈశ్వరతత్త్వమందు సమంజసతాలాభము నొందుచున్నవో అట్టి ఈశ్వరతత్త్వమందే భేదాభేద తత్త్వములు గూడ సమంజసత నొందుచున్నవనియు, ఈ యౌగపద్యము మానవబుద్ధికి అచింత్యా

మగుటచే అది అచింత్యభేదాభేదతత్త్వ మని చెప్పఁబడు చున్నదనియు, ఈ అచింత్యభేదాభేదతత్త్వము ఎపుడు విచారింపఁబడుచున్నదో అపుడు వేదాంతవిచారము పూర్తియగు చున్నదనియు, మనము ముఖ్యముగఁ దెలిసికొనవలసియున్నది. కావున బ్రహ్మవాదులది తర్కమయ వేదాంతమగుచుండ ఈశ్వరవాదులది తర్కాతీత వేదాంత మగుచున్నది. తర్కాతీతవేదాంతులు అద్వయజ్ఞాన తత్త్వమును, నిర్గుణుఁడును అగు భగవంతు నొక్కనినే కొలుచుచుండఁ దర్కమయ వేదాంతులు తుదకొక్కటియగు బ్రహ్మవస్తువునే పొందు చున్నామని చెప్పినను బంచదేవతారాధనము చేసి ఒకప్పు సగుణోపాసకులే అగుచున్నారు.

పంచదేవతోపాసనాపద్ధతి గల వేదాంతమందు జ్ఞాన జ్ఞాతృజ్ఞేయములను త్రిపుటియొక్క నాశనము చెప్పఁబడుటచే భగవంతుఁడు, భక్తుఁడు అను వివక్షత కవకాశ ముండదు. భాగవతధర్మము ఒక శాఖామతమని చాలమందికిఁ దప్పు అభిప్రాయముగలదు. హిందూధర్మమనునది కేవలము ఒక హైందవజాతికే సంబంధించిన దగుటచే అది యథార్థముగ శాఖామతమే కాని విశ్వసమ్మత మతముకాదు. భాగవతధర్మమందు నిత్యులును, చిన్మయులును అగు జీవులు విశ్వమయుఁడును, విభుఁడును అగు భగవంతుని సేవించుటగూర్చియే చెప్పఁబడుటచే అది కేవలము హిందువులకే సంబంధించిన

ధర్మముకాదు. అవి సృష్టియందుఁగల సమస్త చరాచరముల కును సంబంధించిన విశ్వసమ్మత మతముగాని శాఖామతము కాదు. ఇది హిందువులకే కాక క్రైస్తవులు, మహమ్మదీయులు మున్నగువారికిఁగూడ సంబంధించినదే. క్రీస్తుప్రభువు ఏతత్త్వమును 'గాడ్' (God) అనియు, మహమ్మదు 'అల్లా' (Allah) అనియుఁ జెప్పుచున్నారో, ఆతత్వము భగవంతునికి సంబంధించినదే అగుచున్నది. సర్వాదియు, సర్వాంశియునగు వాస్తవవస్తువే భగవన్నామ మగుటచే భగవదంశను నిరూపించునట్టి గాడ్, అల్లా అనునామములు భగవన్నామమునందు అంతర్భూతములే అగుచున్నవి. భగవంతునిఁ బ్రత్యక్షముగ దర్శనముచేయుటకు అధికారము సంపాదించినవారు పూర్ణపురుషుని సే దర్శించుచున్నారు. కాని భగవంతునిఁ బ్రత్యక్షముగఁ జూడనివారలకు భగవత్తత్త్వము సుస్పష్టము కాఁజాలదు. ఆతత్త్వమును సాధ్యమైనంత సుస్పష్టముగ నిరూపించు నుద్దేశముతో వారుదానిని అల్లా, గాడ్ అను నామములతో వ్యవహరించిరి. కాని ఏవిధముగఁజూచినను అవి భగవన్నామముకంటె భిన్నములుగాని, స్వతంత్రమైనవి కాని కావు. క్రీస్తుప్రభువుకాని, మహమ్మదుకాని భగవంతునిఁ బ్రత్యక్షముగఁ జూచినట్లును ప్రత్యక్షముగ వినినట్లును, గనఁబడదు. "తెరచాటుననుండి తప్ప దేవునితో సంభాషించినవారు ఎవ్వరును లేరు." * అని

* "వమకాన, లిబషరిజ్, ఇల్లా, అయియు కల్లిముల్లాహా మిన్ వరాయిల్ హుజ్ రాతీ"

ఖొరానునందు చెప్పబడినది. క్రీస్తు ప్రభువుకూడ మహమ్మదు వలెనే "నబీ" (ప్రవక్త-Prophet) లలో ఒకరినిగ ఖొరాను చెప్పుచున్నది. వారిరువురును ఏకాంతిక సాధనమును అభ్యాసము చేసికొని దాని మూలమున భగవంతునితో మాట్లాడిరి. భగవంతుడు క్రీస్తుప్రభువుతో మాట్లాడిన సాధనమునకుంబరిశుద్ధాత్మ (Holy Ghost) అని పేరు ☩. భగవంతుడు మహమ్మదుతో మాట్లాడినసాధనము జిబ్రయీల్ (Zebrail) అను దేవదూత. జిబ్రయీల్ అనునతడు అల్లావద్దనుంచి ప్రవక్తలకువార్తలు దెచ్చెడి దేవదూత. అతడు మహమ్మదును బురాక్ అనెడి సత్వముయొక్క వీపుపై నెక్కించుకొనిపోయి తన స్థానమును "షజరతుల్ మున్తేహా" వద్ద విడిచెను. ఇదియొక మహా వృక్ష విశేషము. అచ్చటినుండిమహమ్మదు "హజాబున్నూర్" వఱకుంబోయెను. ఇవి దేవునిస్థానమువద్దనున్న రెండుకమానులు (Arches). అప్పుడు మహమ్మదుకు "నూర్ ఇలాహి" (భగవత్ప్రకాశము) యొక్క దర్శనమయ్యెను. అప్పుడు అల్లాకును, మహమ్మదునకును నడుమ డెబ్బది తెరలున్నవని "రూహుల్ బయాన్" అను వ్యాఖ్యాన గ్రంథమునం జెప్పబడినది. కావునం దెరచాటున నుండియే అతనికిని, భగవంతునికిని,

☩ And the Holy Ghost descended in a bodily shape like a dove upon him & a voice came from heaven which said, "Thou art my beloved son; in thee I am well pleased."

— St. Luke III—22

అప్పుడు సంభాషణ జరిగినది. కావున భగవత్ప్రకాశ దర్శన మతనికిఁ గలిగినది. ఈ ప్రకాశమునడుమ నుండువాఁడు భగవంతుఁడని హిందూశాస్త్రములు చెప్పుచున్నవి. సవితృమండల మధ్యవర్తి అనినఁ బరమపురుషుఁడే. ఆత్మసమర్పణ బుద్ధి సహితముగ సర్వభావములతోఁ దన్నుసదా సేవించునట్టి తనకు మిక్కిలి కూర్చెడి భక్తజనుల ప్రేమనేత్రములకు మాత్రము అతఁడు గోచరించును. చిన్మయ స్వరూపుఁడగు భగవంతుని సేవించుటయందు ఏరసముగలదో, అది నిరాకారుఁడును, అవ్యక్తుఁడును అగు దేవుని సేవించుటచేఁ గలుగదు. ఏది సమస్త ధర్మములలో సర్వోత్తమ ధర్మమని చెప్పఁబడుచున్నదో అట్టి భగవత్ప్రేమ జీవులయొక్క భగవద్దాస్యరూపమగు నిత్యస్వరూప ధర్మాచరణమునుండి ఉదయించుచున్నది. భగవద్దాస్యము తమ స్వధర్మము అనువిషయమై క్రైస్తవులును మహమ్మదీయులును, భిన్నాభిప్రాయములు లేనివారు గనుక వారు భాగవత ధర్మపరునితో సోదరభావము కలిగియుండుట యుక్తము కాని అతనితో ద్వేషించుట యుక్తము కాదు; ఏమనిన, క్రైస్తవుఁడే కాని, మహమ్మదీయుఁడే కాని, హిందువుఁడే కాని, మగవాఁడే కాని, ఆఁడుది కాని, చెట్టు కాని, గాడిద కాని - వేయేల సమస్త సత్వములును భగవత్కళా సంపన్నములే. వాస్తవచిన్మయ విగ్రహుండగు పరమపురుషునియందు తమకుఁగల ప్రేమానుబంధము

నందలి తారతమ్యము ననుసరించి ఒక జీవుఁడు వేఱొక జీవుని కంటె భిన్నుఁడుగఁ గనఁబడు చున్నాఁడు. కాని అది వాస్తవముగ భేదమే కాదు. కావున యథార్థభాగవత ధర్మసంపన్నునితో ఎవ్వరును ద్వేషించుటకు అవకాశము లేదు. లోకమునందుఁగల సమస్తమతములందును కనఁబడునట్టి పరస్పరభేదము లన్నియును భాగవత ధర్మమందు లీనమగు చున్నవి. వాస్తవ మహాత్మ్మదీయులు ఖొరానునందును, వాస్తవక్రైస్తవులు బైబిలునందును ఏధర్మములు తెలిసికొను చున్నారో, ఆధర్మములన్నియును, భాగవత ధర్మములందు అంతర్భూతము లగుచున్నవి. అప్రాచీనము లయ్యును, ఈ మతములన్నియును శ్రీమద్భాగవతమందుఁ జెప్పఁబడిన సంపూర్ణమగు ప్రాచీన ధర్మమునే ఇంచుమించుగ అనుసరించు చున్నవనియు, అవి ఆధర్మముయొక్క రూపాంతరము లేఅనియు, మనము నేఁడు కానిచో రేపయినను అంగీకరింపక తీఱదు. భగవంతునితో సాక్షాద్వ్యాపారము చేయుటచే హైందవ ఋషులకు మాత్రము మహమ్మదీయ క్రైస్తవ ధర్మప్రవర్తకులకంటె ఒకింత అవస్థాభేదము కలదని చెప్పిన చెప్పవచ్చును.

ఏ అద్వయజ్ఞాన తత్త్వముయొక్క అంశవైభవమును తమహృదయ కుహరమ లయందు దర్శించిన యోగులు పరమాత్మ యని దేసిని జెప్పుచున్నారో, ఏ అద్వయ జ్ఞానతత్త్వము యొక్క చిత్ప్రకాశమును దమలోఁ జూచిన

జ్ఞానులు బ్రహ్మయని దేనినిఁ జెప్పుచున్నారో, ఏ అద్వయజ్ఞాన తత్త్వముయొక్క నామరూపగుణ లీలాదికమును సంపూర్ణముగఁ దమమనోవీథియందు దర్శించినభక్తులు భగవంతుఁడని దేనినిఁ జెప్పుచున్నారో, ఆ అద్వయజ్ఞాన తత్త్వమునే క్రైస్తవులు దేవుఁడనియు, మహమ్మదీయులు అల్లా అనియు, హిందువులు ఈశ్వరుఁడు, పరమపురుషుఁడనియు చెప్పుచున్నారు. ఇతఁడే జగత్కర్త్రియగు మాయకుఁ బ్రభువు. బ్రహ్మ, శక్తి మున్నగు ఇతర దేవ దేవీగణమంతయు జగత్తునకు సంబంధించినవారే. వారినిఁ బ్రత్యేకముగఁ గొలుచుట నిరర్థకము. కష్టకాలమందు మనకు సాయము చేయువాఁడు భగవంతుఁడు కాని దేవతలుకారు. "నేను ఉండఁగా ఇతర దేవతలను మీరు కొలువరాదు." అని బైబిలునందు దేవుఁడు చెప్పుచున్నాఁడు. (Exodus, xx-3). "నీవు వారి (దేవతల) యెదుట మొఱపెట్టినను వారు నీ మొఱను వినరు. ఒకవేళ వినినను, వారు నీకెట్టి ఉపకారమును జేయరు." అని ఖోరాను చెప్పుచున్నది. "విశ్వమయత లేమి వినియు నూరకయుండి, రంబుజాసనాదు లడ్డపడక" అని భాగవతము చెప్పుచున్నది.

వృక్షమూలమున నీరుపోయుటచే దాని కొమ్మలును రెమ్మలును ఎట్లు పుష్టివంతములగుచున్నవో, ప్రాణశక్తి కాహారమిడుటచే అన్నియింద్రియములును ఎట్లు వికాసము

నొందుచున్నవో. అట్లు పరమపురుషు నొక్కని సేవించుటచే సమస్త చరాచరమును సేవింపఁబడుచున్నది.

శ్లో॥ యథాతరోర్మూల నిషేచనేన,
తృప్యంతి తత్స్కంధ భుజోపశాఖాః
ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణాం
తథైవసర్వార్హణ మచ్యుతేజ్యా.

ఈ విషయమే గీతయందుఁగూడఁ జెప్పఁబడినది. సమస్త యజ్ఞములకును, భగవంతుఁడే భోక్తయుఁ, ప్రభువును.

శ్లో॥ అహంహి సర్వయజ్ఞానాం, భోక్తాచ ప్రభురేవచ. (గీ. 9-24)

ఇతర దేవతల నతనితో సమానులుగను, అతని కంటె స్వతంత్రులుగను. జెప్పువారు భగవత్ జ్ఞానములేని వారగుచు అతనియెడ నపరాధమునే జేయుచున్నారు. ఇతర దేవదేవీ పూజన మొనర్చువారుగూడ అవిధిపూర్వకముగ భగవత్పూజన మొనర్చువారే అగుచున్నారు.

శ్లో॥ యేప్యన్యదేవతాభక్తా, యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపిమామేవ కౌంతేయ ! యజంత్యవిధిపూర్వకమ్.
(గీ. 9-23)

అట్టి దేవదేవీ పూజనము చేయువారు ఆయాదేవతలకు సంబంధించిన అనిత్య లోకములకే పోవుదురుగాని చిన్మయలక్షణముగల నిత్యలోకమునకు మాత్రముపోఁజాలరు.

శ్లో॥ యాంతిదేవవ్రతాదేవాన్, పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతిభూతేజ్యా, యాంతి మద్యాజినోఽపిమాం.
(గీ. 9-25)

"ఆకాశమునఁ దోఁచెడి సూర్యునివలె స్వయంప్రకాశమానుఁడగు భగవంతుని బండితులు సదాచూచుచున్నారు" అనుచు ఋగ్వేదము చెప్పుచున్నది.

"తద్విష్ణోః పరమంపదం, సదాపశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతం"

భగవంతుఁడే సర్వమునకు ప్రభువనియు, అతనిస్వరూపము సచ్చిదానంద మయమనియు, అతఁడు సర్వకారణములకును మూలకారణమనియు, బ్రహ్మసంహిత చెప్పుచున్నది.

శ్లో॥ ఈశ్వరః పరమః కృష్ణస్సచ్చిదానంద విగ్రహః
అనాదిరాది గోవింద స్సర్వకారణ కారణమ్॥

భగవంతుఁడే సర్వమునకుఁ బ్రభువనుటకు ఇట్టి ప్రమాణములు అన్ని శాస్త్రములనుండియు నెత్తి చూపవచ్చును. క్రైస్తవ మతమునందుఁ గుమారుఁడు, పవిత్రాత్మ, దివ్యపురుషగణము అను వారింగూర్చి చెప్పఁబడినను నిత్యలోకమునందుండెడి తండ్రి యొక్కఁడే సర్వేశ్వరుఁడని ఆమతమెట్లంగీకరించుచున్నదో, మఱియు నబీలు (ప్రవక్తలు) జిబ్రయీల్, హూర్ (దేవతాస్త్రీలు) ఫరిష్త (దివ్యపురుష) గణము అనువారిం గూర్చి మహామ్మదీయ మతమునందుఁ జెప్పఁబడినను బెహిష్త (స్వర్గము లేక నిత్యలోకము) అందుండెడి

అల్లా ఒక్కఁడే సర్వేశ్వరుఁడని ఆమత మెట్లంగీకరించు చున్నదో, అట్లే వాస్తవ వేదాంత మగు భాగవత ధర్మమునందు దేవ దేవీ గణముగూర్చి చెప్పఁబడినను పరమపురుషు డొక్కఁడే సర్వేశ్వరుఁడని ఆధర్మ మంగీకరించుచున్నది.

భగవత్సేవ ఏయేయుగములందు ఏయేవిధముగఁ జేయ బడెనో ఆవివరణము మనకు శాస్త్రములందు లభించుచున్నది. శాస్త్రమందుఁ గల్పమునకు నాలుగు యుగములు చెప్పఁ బడినవి. సత్యయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అని వానికి పేర్లు. మనమిపుడున్నది కలియుగము. సత్యయుగమున మానవగణమందు న్యూనతాధికతా భేదము లు లేకుండుటచే ఆ గణము "హంస"యను పేరితో వ్యవహరింపఁబడెను. వీరు భగవంతు నొక్కని నేఆరాధించుచుండెడివారు. వీరి గురువునకు "పరమహంస" అని పేరు. ఈ యుగము యొక్క కడపటి భాగమందు భగవదారాధన విషయమై ప్రజలయందు భేదబుద్ధి కలిగెను. భోగైశ్వర్య ప్రసక్తి గల కొందఱు పరమపురుషు నారాధించుట మాని ఇతర దేవదేవీ గణమును బూజించుట కారంభించిరి. కావున హంసగణము దిపుడు దైవగణమనియు, ఆసురగణమనియు, రెండుగణము లేర్పడినవి. భగవంతుని నారాధించువారు దైవగణమనియు భగవదారాధనము చేయనివారు ఆసురగణమనియుఁ జెప్పఁ బడిరి. కావుననే అసురుఁడగు హిరణ్యకశ్యపునకుఁ బుట్టినను

బ్రహ్లాదుఁడు భగవద్భక్తి కలవాఁడగుటచే దైవసంపత్తి గలవాఁడుగా నెన్నఁబడి సురశబ్ద వాచ్యుఁడయ్యెను. తండ్రి భగవద్ ద్వేషిగాన అసురుఁ డయ్యెను.

త్రేతాయుగమునందు భగవదారాధనా విషయమైన భేదబుద్ధి మఱింత అధికమై చాతుర్వర్ణ్య వ్యవస్థ ప్రబల మయ్యెను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను ఈనాలుగు వర్ణములందును బ్రాహ్మణులు మాత్రము పరమ పురుషు నారాధించు వారుగ నుండిరి. తక్కిన మూఁడువర్ణ ములవారియందును ఎవరికైనను భగవద్భక్తి కలిగిన చో వారు బ్రాహ్మణ వర్ణమందే చేర్చఁబడిరి. క్షత్రియుఁడగు విశ్వామిత్రునియందు బ్రాహ్మణ లక్షణములు కనఁబడినంతనే వశిష్ఠమహర్షి వానిని బ్రాహ్మణవర్ణమందుఁ జేర్చుకొనెను. సత్యయుగ సంబంధమగు సుర లేక దైవశబ్దము ఈయుగ మున బ్రాహ్మణులకు మాత్ర మన్వయించెను.

ద్వాపరయుగమునను ఈ భేదబుద్ధి యింకను ప్రబల మగుటచే బ్రాహ్మణవర్గమందుఁగూడ అంతశ్శాఖలేర్పడి వారిలోఁ గొందఱికి అసురశబ్దముగూడ ప్రయోగింపఁబడెను. చార్వాకుఁడను నతఁడు జాతికి బ్రాహ్మణుఁడే అయినను భగవద్భక్తి లేకుండుటచే అతనిని ఇతరబ్రాహ్మణులు నాస్తి కుఁడనియు, రాక్షసుఁ (అసురు) డనియు బిలుచుచుండిరి. త్రేతాయుగమందు ఈరాక్షస శబ్దము శ్రీరామచంద్రునితో

విరోధించిన బ్రాహ్మణుఁడగు రావణుని విషయమైకూడఁ బ్రయోగింపఁ బడెను. ఈవిధముగ బ్రాహ్మణజాతికి అధఃపతనము సంభవించుటచే భాగవత ధర్మ ప్రవర్తకులగు ఆకాలపు బ్రాహ్మణులయందు సత్యయుగ సంబంధమగు హంసలక్షణము గలవారు మిక్కిలి అరుదైరి. బ్రాహ్మణులయందు భాగవత ధర్మము నశించుటచే తద్ధర్మబోధనమందు బ్రాహ్మణులకు హక్కు తొలఁగి పోయినది. కావుననే జాతిచే బ్రాహ్మణులు కానట్టి రోమహర్షణుఁడును, అతని కుమారుఁడగు సూతుఁడును బ్రాహ్మణులకే భాగవత ధర్మముబోధించవలసివచ్చెను. వంశానుక్రమముగ భక్తులగువారి కుటుంబములకు సంబంధించిన వారమనియు, సచ్చిదానంద విగ్రహుఁడును, వాస్తవ వస్తువును, అద్వయజ్ఞాన తత్త్వమును అగు భగవంతుఁడే సర్వేశ్వరుఁడను విశ్వాసము గలవారమనియు, జెప్పుకొనునట్టి భక్తనామధారులు ఇపుడు మన దేశమం దంతటనుఁ గోట్లకొలఁది ఉన్నారు. కాని సత్యయుగ సంబంధమగు 'హంస' లక్షణములతో నొప్పు వాస్తవ వేదాంతి యగు భాగవత ధర్మ ప్రవర్తకుఁడు మాత్రము ఎచ్చట వెదకినను మచ్చునకైనను గానరాఁడు.

# దేవుఁడు సాకారుఁడా? నిరాకారుఁడా?



ప్రపంచమునందు ప్రసిద్ధమతము లని చెప్పఁబడు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతములు మూఁడును భగవత్తత్త్వమే సర్వోత్కృష్టమును నిర్వివాదమునునగు సత్య పదార్థమని చెప్పుచున్నవి. ఈ మతముల ననుసరించువారు సాకార పరమతత్త్వమగు భగవంతుఁడొకఁ డున్నాఁడని చెప్పుచు అతఁడే ఈ లోకమును సృష్టించువాఁడును, రక్షించువాఁడును, సంహరించువాఁడును, అని చెప్పుదురు. హిందూ మతమునకును, మహమ్మదీయ క్రైస్తవమతములకును భేదమెచ్చటనున్నదనిన హిందువులు భగవంతుని సాకారునిగఁ బూజింతురు; మహమ్మదీయులు, క్రైస్తవులు అట్లు పూజింపరు. ఇట్లనుటచే వారల మతగ్రంథములగు ఖొరాను, బైబిలు మున్నగువానియందు నిరాకారుఁడగు దేవునిఁ గూర్చి చెప్పఁబడియున్నదని మాత్రము మనము భావింపరాదు. ఈ రెండు మతముల వారును దమతమ మతగ్రంథములయందుఁ గననగు విషయమును ఉన్నది ఉన్నట్లు తెలిసికొనక సాకారుఁడగు భగవంతునిఁ బూజించెడి హిందువులు విగ్రహారాధకులనియు, హిందూమతము విగ్రహారాధనకు సంబంధించిన మతమనియు జెప్పుచు, హిందువులను అపహసించుచున్నారు.

ఇట్టి అపహాస్యములు బహిర్దృష్టితో మతవిచారముచేయువా రొనర్చునవేకాని మతముయొక్క యథార్థతత్త్వ మెఱింగిన వా రొనర్చునవికావు. ఇట్టి బహిర్దృష్టి కలవడిన వారికి ఆ యా మతములయందలి విషయములయొక్క రమణీయతను ఎఱింగెడిశక్తి బొత్తుగ నశించుచున్నది. ఇట్టి వారలయొక్క మనస్సులు సత్యాన్వేషణము వంకకుఁ బోఁజాలవు. చెప్పినది వినుటకైన ఇష్టములేక కాదని యెదిరించుటయు, దప్పులు పట్టుటయు, దూషించుటయు మాత్రమే తమపనిగాఁ బెట్టుకొన్నవారితో వాదించుటకంటె బుద్ధిహీనత వేఱొండు లేదు. వారిని మనము అట్లే విడువవలెను. చెప్పినది వినుటకు ఓపికఁ గలవా రున్నయెడల వారలను ఈ మూఁడు మతములకు సంబంధించిన శాస్త్ర గ్రంథములను నిష్పక్షపాతబుద్ధితో విమర్శింపుమని మనము ప్రార్థించవచ్చును. ఈ మూఁడు మతములకును ఎట్టి తాత్త్వికభేదమును లేద నియు, సర్వలోకమాన్యమగు ఒక విశేష ధర్మముయొక్క రూపాంతరములే ఈ మూఁడు మతములనియు, వారికపుడు తెలియుటయే కాక ఈ మూఁడింటి యందును అంతర్భూత ముగ నున్న సర్వోత్కృష్టమగు సత్యవిషయమునుగూడ వారు తెలిసికొనఁగలిగి యుందురు. అప్పుడు హిందూ మతమును గూర్చిన అధిక్షేపణలకు మఱి అవకాశము కలుగదు.

కాని హిందువులలోఁగూడ బాహ్య విగ్రహారాధనము చేసెడు కొన్ని తెగలున్నవనియే చెప్పవలసియున్నది. వారలు

శ్రుతిమార్గము ననుసరించిన వారు కానంతమున వారిని గూర్చిన విచారణతో మనకుఁ బని లేదు. వేదములందును, బురాణము లందును జెప్పఁబడిన భాగవత ధర్మమునకు వీనితో ఎట్టిసంబంధమును లేదు. భాగవతధర్మము ఆత్మకు సంబంధించిన దగుచు ఆత్మచేతనే గ్రాహ్యమును, ఆచరణీయమును అగుచున్నది. యుక్తితో దానికెట్టి సంబంధమును లేదు. అది శరీరమునకును మనస్సునకును అతీతమగు ధర్మము. అద్వితీయుఁడగు పరమపురుషునికి భక్తి సేయుటయే దీని లక్షణము. భగవంతుఁడు అద్వితీయుఁడని ఖొరాను, బైబిలుకూడ అంగీకరించుచున్నవి (Deuteronomy V—39). హిందువులు ఆ పరమపురుషుని భగవంతుఁడని కాని, ఈశ్వరుఁడని గాని అందురు. భగవంతునిఁ బూజించువాఁడే భక్తుఁడనఁబడుచున్నాఁడు. భగవంతుఁడు నిత్యలోకమందే సదా విరాజమానుఁడై యుండును. కాని అప్పుడప్పుడు అతఁడీ లోకమునం దవతరించును. అప్పుడతనిని అందఱును జూతురుగాని అతని భక్తులు తప్ప ఇతరులెవ్వరును అతనిని భగవంతునిగ నెఱుంగఁజాలరు. తన భక్తులకు మాత్రము అతఁడు సదా దర్శనమిచ్చుచునే యుండును. లోకమునందలి ప్రజలు విషయలంపటులుగనే ఉన్నారు. సమస్తపదార్థములు కూడ దేశకాల కారణ (Time, space and causation) త్వా వచ్ఛిన్నము లగుటచే వారలదృష్టికి నిరోధము కలుగుచున్నది.

కాని భగవంతుని సంబంధమగు చిన్మయ జ్ఞానముగల అతని భక్తులకు మాత్రము అట్టి దృష్టి నిరోధము లేదు. భాగవత ధర్మముయొక్క సూక్ష్మపరిజ్ఞానము తగినంత లేనట్టి సాధారణ ప్రజలు అనుకొనునట్లు ఆధర్మమునందు మతాంతరభేదములు లేశమైన లేవు. అదివిశ్వమందలి సర్వజనులకును సంబంధించిన ధర్మము. భగవంతునిఁ గూర్చి బోధించు ఇతరమతము లన్నియును ఈ ధర్మములో నంతర్భూతములే. ఏ మతమందు అద్వితీయుఁడగు భగవంతుని సేవించుటఁ గూర్చి ముఖ్యముగ జెప్పబడు చున్నదో ఆమతము భాగవత ధర్మమునే బోధించు చున్నది. భాగవత ధర్మమే సకలమతములకును ఏక వాక్యతఁ గలిగించుచున్నది. సకలమతములును భాగవత ధర్మమందే సమంజసత నొందుచున్నవి. భిన్న భిన్న విషయములను బోధించుచున్నట్లు పైకిఁగనఁబడు మన మతము లన్నియును భాగవతధర్మము ఏవిషయమును సమగ్రముగ నిరూపించు చున్నదో ఆ విషయము యొక్క భిన్న దృక్పథములను మాత్రమే నిరూపించుచున్నవిగాని విషయాంతరమును నిరూపించుట లేదని తెలియవలెను. శాస్త్రీయమును ఉన్నదున్నట్లు బోధింపఁగల మహాశక్తిమంతులగు భక్తాచార్యులు శాస్త్రములు విపరీతార్థముల పాలఁబడకుండ వానిని రక్షించి యున్నారు. వారి యథార్థశిష్యుల సాంగత్యము మనకు లభించి వారి శిష్యప్రణాళికను వారివలన మనము గ్రహింపఁగలుగుదు

మేని వారల ఉపదేశమే కేవల సత్యబోధకమనియు, భాగవత ధర్మమే సర్వజన గ్రాహ్యమగు అద్వితీయ ధర్మమనియు, మనకు సులభముగఁ దెలియఁగలదు. భాగవత ధర్మప్రవర్తకులకు ఈవిషయము గురుముఖమునుండి తెలియుటయే కాక గురుపరంపరా మూలమునఁ గూడ ఇది లోకమున నిత్యవర్తమాన మగుచున్నది.

హిందూమతములోని వని చెప్పనట్టియు, అవాన్తర శాఖా మతములని మాత్రము చెప్పఁదగినట్టియు, భిన్నభిన్నమతము లన్నియును సత్యాన్వేషణముకొఱకు లేశమైనను భగవదనుగ్రహముపై ఆధారపడక తమమేధాబలముపై ఆధారపడి భుక్తివాంఛాపరులు కల్పించిన వనియే చెప్పవలసియున్నది. ఎంతటి మేధావంతుఁడైనను దర్కమూలమున భగవంతునిఁ బొందజాలఁడను విషయము అందఱికిని తెలిసినదే. ఏమన: భగవంతుఁడు మన మేధాబలమునకు లోఁబడువాఁడు కాకుండుటచే మనకు ఆవిధముగ నగమ్యగోచరుఁడే అగుచున్నాఁడు. సూక్ష్మాతిసూక్ష్మములను గమనించు బుద్ధికూడ సత్యపదార్థమునుగూర్చి ఇదమిత్థమను సిద్ధాంతమెన్నటికిని చేయఁజాలదు. సత్యనిర్ధారణము చేయుపని ఆత్మది కాని మనస్సుదికాదు. ఈ విషయమై హిందూ మహమ్మదీయ క్రైస్తవ మతములకు ఎట్టి భిన్నాభిప్రాయమును లేదు. సత్యపదార్థము అప్రాకృతమును, శాశ్వతమును, సనాతనమును అగు నిత్యతత్త్వము.

మేధావులగు భుక్తివాంఛాపరులు భగవత్తత్త్వ విషయమై చెప్పఁగలిగిన వన్నియును బాలభాషితములకంటె హెచ్చు విలువ కలిగినవి కావు. భగవంతుఁడు తానెట్లుండునో అట్లే యుండునుగాని వారు వర్ణించిన విధముగ నుండవలసిన ఆవశ్యకత అతనికి లేదు. తనకు సంపూర్ణానుగ్రహము కలుగుటచే అతఁడెవ్వనికైన దర్శనమిచ్చినచో అట్టి దర్శనభాగ్యము నొందిన మహనీయుని కొక్కనికే భగవత్స్వరూపము తెలియగలదుకాని యితరులకది యెంతమాత్రమును తెలియునది కాదు. భుక్తివాంఛాపరుల సిద్ధాంతము లన్నియును అన్నిమతములందును ఒకే రీతిగ నుండును.

భుక్తివాంఛాపరులు యథార్థముగ విగ్రహారాధకులే. మనోనిర్మితమగు ప్రతివిషయముగూడఁబౌత్తళికత (Idolatry) యేకాని వేఱొండుకాదు. కాని భాగవతధర్మము పౌత్తళికతకు సంబంధించినధర్మముకాదు. ఎందుచేతఁగాదో చెప్పుచున్నాను. మహమ్మదవతరింపకముందు అరేబియాలోను, క్రీస్తుప్రభు వవతరింపకముందు పాలెస్తీనులోను జేయఁబడుచున్న విగ్రహారాధనము విషయమై మనమొకింత విచారించినచో భాగవతధర్మము పౌత్తళికతాధర్మమనుట ఎంతటి అన్యాయమో స్పష్టపడఁగలదు. మెక్కాయందు కాబా (Kaaba) లో లాత్, మనాత్, గోరా అనుపేళ్లుగల మూఁడువిగ్రహములు మొదటఁ బూజింపఁబడుచుండెడివి. ఈమూఁడును వేల్పులనే అక్కడివారి

భావము. రాను రాను ఈముగ్గురు వేల్పులును మున్నూట అరువదిమంది వేల్పులుగఁ బెరిగిరి. ఈ వేల్పులందఱును మనుష్యులచేత నిర్మింపఁబడినవారే. మఱియు వారి ఆరాధనము అపుడు వారికిఁగల యే మతగ్రంథమునందును చెప్పఁబడి యుండలేదు. కావున మహమ్మదు ఈమున్నూట అరువదిమంది వేల్పులపైఁ గూడ దండెత్తవలసి వచ్చినది. ఈవిగ్రహములు అరేబియా వాసులచేఁ దమ కులదేవతలుగ భావింపఁబడు చుండెడివి. ఈవిగ్రహములకు ఎట్టి అంగవైకల్యము కలిగినను దేశమునందలి ప్రజలందఱును ఏ దేకదృష్టికలిగి విచారసాగరమున మునిఁగియుండెడివారు. అంతేకాక, అంగవైకల్యము నొందిన ఆవిగ్రహమును అట్లేయుంచిరిగాని దానిస్థలమున వేఱొక నూతనవిగ్రహమును నిలుపుటలేదు. ఈవిధముగ ప్రకృతి తత్త్వము ఆత్మతత్త్వముక్రిందఁ జలామణి యగుచుండెను. ఇట్లు బహుకాలము జరిగిన వెనుక మహమ్మదనతరించి విగ్రహారాధనము దూష్యమగు పనియని యతఁడు బోధించెను. మహమ్మదుచేసిన బోధలు అరేబియావాసులకు అమిత కోపము గలిగించినవి. కావున వారితో మహమ్మదు హోరాహోరిగఁ బోరాడవలసివచ్చెను. ఆయుద్ధములలో మహమ్మదు విజయుఁడై వారికిఁగల దేహబలముతోపాటు వారల పిచ్చినమ్మకములను గూడ నశింపఁజేసెను. రానురాను మహమ్మదుకు అనేకులు శిష్యులేర్పడఁగా వారలకు విగ్రహా

సాధనము నెడలఁ గలిగిన అమిత ద్వేషముచే ఇతరులను హిం సించియైనఁ దమసిద్ధాంతములు వార లంగీకరించునట్లు చేయవలెనని వారుపట్టుపట్టిరి. ఇంతేకాక ఇంకనువిషయమై జీవహింస చేసినవారికి నిత్యలోకమే కలుగుచున్నదనికూడ వారల యభిప్రాయము. మహమ్మదీయులు నిత్యలోకమునే బెహిస్టు అందురు. హిందూమతమందుఁగూడ విగ్రహారాధనమే వారలకుఁగనఁబడినందున హిందువులనుగూడ వారలు హింసించిరి. ఇంచుమించుగ ఇదేవిధమగు విగ్రహారాధనమే పాలెస్టీను నందుఁగూడ వ్యాపించియుండెను. దీనినిఁ గ్రీస్తుప్రభువు ప్రేమచేత రూపుమాపెనుగాని హింసామూలకముగ రూపుమాపలేదు.

కాని భాగవతధర్మము ప్రకృతితత్త్వమును ఆత్మతత్త్వముగ భావింపదు. ఆత్మతత్త్వము నిరాకారమని కూడ అదిచెప్పదు. మీఁదుమిక్కిలి తత్త్వమునకును, దాని రూపమునకును అభేదమే చెప్పుచున్నది. ఈ ప్రాకృత ప్రపంచమందు ఆత్మతత్త్వమునకును, దానికి శరీరరూపమగు ఆవరణగ ఏర్పడుచున్న ప్రకృతి తత్త్వమునకును విశేషభేదము గలదు. కాని చిన్మయప్రపంచమందు ఆత్మకిట్టి ప్రకృతిమయదేహము లేదు. ఈ లోకమునందువలె ఆలోకమందలి వస్తుతత్త్వమందు గొంతి చిన్మయభాగమును, గొంతప్రకృతిమయ భాగమును గానరాదు. అచ్చటి వస్తువును, దానిరూపమును గూడ ఒక్క

చిత్పదార్థముయొక్క సంస్థానభేదములే. నిత్యలోక స్థితియందు జీవాత్మ తనకు సహజసిద్ధమగు శుద్ధావస్థ యందే ఉండును. అచ్చట అతనికిఁగల రూపము కేవల చిన్మయరూపమే. బద్ధావస్థయందు మాత్రము అతని శుద్ధ చిన్మయరూపము ప్రకృతిమయ రూపముతోఁ గప్పఁబడుచున్నది.

ముందుగ భగవంతునిఁ గూర్చి విచారింతము. భగవంతుఁడు సాకారుఁడా? నిరాకారుఁడా ? పైనిఁ జెప్పిన మూఁడు మతములుగూడ భగవంతుఁడు నిరాకారుఁడని చెప్పవు. మహమ్మదీయుఁడు, "లా ఇలా ఇల్లల్లాహు ముహమ్మదున్ రసూలుల్లాహి" (దేవునికంటెఁ బ్రభువు లేఁడు; మహమ్మదు కంటె దేవునివాక్యములు పలుకువాఁడు లేఁడు.) అని చెప్పునప్పుడు అతఁడు సాకారుఁడగు భగవంతునిఁ గూర్చియే చెప్పుచున్నాఁడు. క్రీస్తుప్రభువు తనశిష్యులతో, "నన్నాదరించునతఁడు నన్నుఁ బంపిన యతని నాదరించినట్లే" అని చెప్పినపుడు అతఁడుకూడ సాకారుఁడగు భగవంతునిఁ గూర్చియే చెప్పుచున్నాఁడు. వంగభాషయందు "జీవేర్ స్వరూపహోయ్ కృష్ణేర్ నిత్యదాస" అని చెప్పినపుడు జీవుఁడు ఎవనికి నిత్యదాసుఁడో అట్టి సాకారుఁడగు భగవంతునిఁ గూర్చియే చెప్పఁబడుచున్నది.

"భగవంతునికి ఏదైన నిత్యసిద్ధమగు రూపము కలదా ?" అనునది రెండవ ప్రశ్నయగుచున్నది. భగవంతుని

కట్టిరూపము కలదనియే దీని కుత్తరము. కాని యిది వివాదాస్పదమగు విషయమే. కేవల మనుభవజ్ఞానమందు విశ్వాసము గలవారిలోఁ గొందఱు భగవంతుని కెట్టి యాకారమును లేదనియు, అతఁడీలోకమం దవతరించవలసి వచ్చినపుడు ఏదేనొక రూపముదాల్చి యవతరించుచున్నాఁడనియుఁ జెప్పుదురు. అవతారకాలమందు భగవంతుఁడు ధరించెడి రూపము మాయికమును, నశ్వరమును అనియే వారల అభిప్రాయము. ఇందులకుఁ బ్రమాణముగ వేదవాక్యములనే వారు చూపింతురు. కాని వారుచూపు వేదవాక్యములకు విపరీతార్థము కల్పించినఁగాని వారి సిద్ధాంతమును అవి పోషింపజాలవు. ఇట్టివారు మహమ్మదీయ మతమందును, క్రైస్తవ మతమందును గూడఁ గలరు. కాని వీరికంటె వారలు ఒక యాకు ఎక్కువ చదివినవారలగుటచే దేవుఁడు నిరాకారుఁడని చెప్పుటయేకాక, అతఁడెట్టిరూపమును ధరింపఁజాలఁడని కూడఁ జెప్పుదురు. ఇట్లు చెప్పుటచే వారలు సర్వశక్తిమంతుఁడగు భగవంతునికి ఒక శక్తిలోపముగూడఁ గల్పించుచున్నారు. భగవంతుఁడు సదా ఒకేవిధముగ నుండునుగాని మనము అనుకొన్న విధముగ నతఁడుండఁడు గదా? అతనికి ఆకారము లేనప్పుడు అతనికెట్టి ఆకారమును మనము గల్పింపజాలము. అతఁడు సాకారుఁడైనపుడు అతని ఆకారమును మనము తీసివేయజాలము.

ఇందు విషయమై మత గ్రంథములు ఏమి చెప్పు చున్నవో విచారింతము. మొదట బైబిలు నెత్తికొందము. భగవంతుని ఆకారము గూర్చి క్రీస్తుప్రభు వేమి చెప్పి యున్నాఁడు? క్రైస్తవ సిద్ధాంతములందు దేవునికి నిత్య సిద్ధ రూపమే చెప్పఁబడియున్నది. నికొడెమను (Nicodemus) తోఁ గ్రీస్తుప్రభు విట్లు చెప్పియున్నాఁడు. "మానవునకు రెండవ జన్మ వచ్చినఁగాని అతఁడు దేవుని రాజ్యమును జూడఁజాలఁడు. రెండవజన్మ యన నేమి యని యతని నడుగఁగా, "జలతత్త్వము యొక్కయు, ఆత్మతత్త్వము యొక్కయు సమ్మేళనముచే మానవుఁ డుద్భవించినఁ గాని అతఁడు దేవుని రాజ్యమునఁ బ్రవేశింపఁజాలఁడు. మాంసమునకు బుట్టినది మాంసమే అగు చున్నది; ఆత్మకుఁబుట్టినది ఆత్మయేఅగుచున్నది" అనిచెప్పెను. (St. John III—5 & 6.) మనుష్యునియం దేభాగము మాంస మయము? ఏభాగమాత్మమయము? అని యిచ్చట ప్రశ్నకలుగు చున్నది. మన శరీరమే మాంసమయము; మన ఆత్మయే ఆత్మమయమనిదీనికుత్తరము. ఆత్మకు ఆత్మదర్శనము చేయుటకు శక్తియు సాక్ష్యను గూడఁగలవు. అట్టిశక్తి యుండుటచేతనే మనమందఱమును దేవుని బిడ్డలమని మనకుఁ దెలియుచున్నది (Romans VIII—16). కావునమనుష్యుఁడుమాంసతత్త్వమును విడిచి స్వకీయమగు ఆత్మతత్త్వమును మఱలఁ జేరుకొననిచో దేవునిరాజ్యమునందలి వైభవములు అతనికిఅనుభవనీయములు

కాఁజాలవు. బద్ధావస్థయందుండి స్వకీయమగు ఆత్మతత్త్వమును మఱచినజీవుఁడు మఱలఁదన ఆత్మతత్త్వమును బొందుటయే మానవుని రెండవజన్మయని క్రీస్తుప్రభువుచెప్పెను. హిందువులు చెప్పినదికూడ ఇదియే. భగవదంశమును, అణుప్రాయమును అగు ఆత్మతత్త్వము మానవశరీరమందుఁ బ్రవేశించినపుడు అతఁడు మనుష్యుఁడనఁబడుచున్నాడు. అట్టి శుద్ధచిన్మయుఁడగు జీవుఁడు ఎంతవఱకుఁదన స్థూలశరీరముతోఁ దాదాత్మ్యము వహించుచుండునో అంతవఱకు అతఁడు తననేకాక తనతండ్రి యగు భగవంతునిఁగూడ మఱచియుండును. కాని ఎప్పుడతఁడు తన్నుఁదాను దెలిసికొనుచున్నాఁడో, అప్పుడతఁడు భగవంతునిఁ గూడఁ దెలిసికొనుచున్నాఁడు. ఇదే అతనికి రెండవ జన్మము.

రెండవజన్మమనఁగా: తాను ఆత్మోపలబ్ధిఁబొంది తన స్థూలశరీరమును విడుచుచున్నాఁడనికాని, స్థూలవిషయములను గ్రహించుటలేదనికాని, అర్థముకాదు. అతఁడు ఈ శరీరము నందే ఉండవచ్చును. స్థూలవిషయములనుగూడ గ్రహించుచు నుండవచ్చును. కాని తనప్రకృతిమనోేంద్రియములన్నియును దనచిన్మయేంద్రియములకు స్వాధీనమందుండుటచేఁదనకు దేహ యాత్ర యథాప్రకారముగ సాగుచున్నట్లును, దాను యథా ప్రకారముగ లోకవిషయములు గ్రహించు చున్నట్లును లోకులకుఁ గన్పట్టుచున్నను మునుపటివలెనే తాను దేహ యాత్ర నిర్వహించు చున్నాఁడనియు, మునుపటివలెనే తాను

విషయగ్రహణము చేయుచున్నాఁడనియు చెప్పుటకవకాశము లేదు. తాను ఈ లోకమందుండఁగనే తన వైకుంఠజీవనము (Transcendental life) లేక దివ్యపురుష జీవనము (Angelic life) ప్రారంభమగుచున్నది. శరీరపతనముచే ఆ జీవనమునకు భంగము కలుగక పోవుటయేగాక, అది మఱింత జాజ్వల్యమానముకూడ నగుచున్నది. శరీరపతనమునకుఁ బూర్వమును, శరీర పతనానంతరమును గూడ నతఁడు దివ్యపురుషుఁడనియే చెప్పఁబడుచున్నాఁడు. ఈ దివ్యపురుషు లందఱును భిన్నభిన్న జీవాత్మలగుచు భిన్నభిన్న చిన్మయ రూపములతో నొప్పుచుందురు. భగవంతుని చిన్మయ స్వరూపము జీవస్వరూపములకంటెఁ బ్రత్యేకాకారము గలదిగ నున్నది. "నా స్వరూపమువంటి స్వరూపము ఎవరికిని లేదు" అని ఖొరానునందును జెప్పఁబడినది*. భగవంతునికి అట్టిప్రత్యేకాకారము లేనిచో అతని యంశములగు శుద్ధజీవులు అతనికంటె భిన్నరూపములు కలవారుగఁ దెలిసికొనుటకు అవకాశము లేకపోవును. అప్పుడు ఒక్క చిన్మయతత్త్వమే అవస్థాభేదములనొంది తండ్రి (Father) అనియు, కుమారుఁడు (Son) అనియు, పరిశుద్ధాత్మ (Holy Ghost) అనియు, దివ్యపురుషులనియుఁ జెప్పబడుట అసంభవమగుచున్నది. కావున, ఈ నిత్యలోకవాసుల కందఱకును భిన్న భిన్నములగు ఆత్మమయ రూపములే కలిగి.

* లయిస, కమస్, లిహీ. షయ్యున్ — ఖొరాన్

యుండవలెను. నిత్యలోకవాసులయొక్క రూపములకును, భూలోకవాసుల యొక్క రూపములకును, భేదము ఎచ్చట నున్నదనిన, భూలోకవాసుల బహిరాకారములు మాయికము లును, అనిత్యములును అగుచుండ నిత్యలోకవాసుల రూప ములు అప్రాకృతములును, నిత్యములును అగుచున్నవి.

అట్లుగానిచో నిత్యలోకవాసులు భూలోకమున కవ తరించినపుడు మనకు ఏరూపములతోఁ గనఁబడుచున్నారో ఆరూపము లెట్టివి? వారు తమచిన్మయరూపములతోనే అవత రించుచున్నారా? లేక భూలోకవాసులవలె రక్తమాంసమయ ములగు అనిత్య రూపములు ధరించి వచ్చుచున్నారా? దీని కుత్తరమేమనిన: అట్టి అనిత్యరూపములు వారు ధరించివచ్చుట లేదు. ఇందువిషయమై నికొదెమసుతోఁ క్రీస్తుప్రభువు ఈ విధముగ జెప్పియున్నారు:—"నేను నీకిపుడు లౌక్యవిషయ ములను జెప్పితిని. వానినే నీవు విశ్వసించలేదు. ఇపుడు నేను ఆత్మసంబంధములగు విషయములను జెప్పినచో నీ వెట్లువానిని విశ్వసింపఁ గలవు? ఏమన, నిత్యలోకముదాఁక పోయిన మానవుఁడే లేఁడు. నిత్యలోకమునుండి అవతరించి మనుష్య పుత్రుఁడనగుచు నేను మఱల అట్లే దేవలోకమందుంటిని. (St. John III-12 & 13). ఇచ్చట క్రీస్తుప్రభువు మనుష్య పుత్రునివలెనే నిత్యలోకమునందుఁగూడ ఉంటినని తన్ను గూర్చియే చెప్పుచుఁ దాను దేవునిపుత్రుఁడుగా ఉన్నప్పుడు

తనకుఁగల రూపముకంటె భిన్నమగు రూపముతోఁ దాను దేవిద్ (David) పుత్రుఁడై అవతరించలేదని చెప్పెను. ఇట్లనుటచే తాను ఒకేరూపముతో నిత్యలోకమందును, భూలోకమందును ఉండెనని అర్థము.

ప్రజలందఱును క్రీస్తు ప్రభువును దేవిద్ పుత్రుఁడని చెప్పుకొనుచున్నప్పుడు క్రీస్తుప్రభు విట్లనెను:—"అట్లయినచో ఆత్మరూపుఁడగు దేవిద్ తనను ప్రభువని పిలుచుచుఁ బ్రభువు (దేవుఁడు) ప్రభువు (క్రీస్తువు)తో, 'నీశత్రువులు నీకుఁ బాదాక్రాంతు లగువఱకును నీవునాకుడిచేతివైపు గూర్చుండుము' మని యెట్లు చెప్పఁగలిగియుండును?" (Psalm cx—I) క్రీస్తు ప్రభువు యథార్థముగ నిత్యలోకమునందే పుట్టియున్నవాఁ డగుటచే ఏస్పురుషుల కైనను ఈలోకమందు మాంసరూపమునఁ బుట్టఁ జాలఁడు. వానిని మానవపుత్రునిగ భావించుటనగా: వాని చిన్మయస్వరూపమును మనము పూర్తిగమఱచినట్లే. అతఁడు భూలోకమునకు అవతరించినంత మాత్రమున అతని చిన్మయత్వమునకుఁ జెఱుపుగాని, మార్పుగాని ఎన్నఁడైనఁ గలుగునా? అతఁడు మానవలోకమందు మానవుఁడుగఁ గనఁబడినను అతఁడు చిన్మయుఁడగుటచే సదా చిన్మయావస్థ యందే ఉండెను. అతని యథార్థరూపమును జూచుటకు అందఱికిని సాధ్యమగు పనికాదు. చిన్మయదృష్టి గలవారికే అతని రూపము ఉన్నదున్నట్లు గోచరించుచున్నది. క్రీస్తు ప్రభువు,

ఒకప్పుడు జెరూసలము (Jerusalem) నకుం బోంగా అచ్చటి యూదు (Jews) లను తెగవారు వానినిజూచి, "ఇట్టి అద్భుత కార్యములు చేయంగల సమర్థత నీకున్నటుల నీవు ఏ నిదర్శనమునూ మాకుం జూపంగలవు ?" అని యడిగిరి. క్రీస్తుప్రభువు వారలతో, "ఈ దేవళము (శరీరము) ను నశింపంజేయుండు. నేను దానిని మరల మూండునాళ్లలో మీకుం జూపుచున్నాను" అని చెప్పెను (St. John II—19). అటులనే క్రీస్తుప్రభువు మూండవదినమున ప్రేతలోకమునుండి లేచివచ్చి సమాధిలో అతని శరీరమును గానక వెక్కి వెక్కి యేడ్చు చున్న మేరీమేగ్డలీను (Mary Magdalene) అను స్త్రీ యెదుటం గనపడెను. ఈసందర్భమునందే మహమ్మదీయమతమునకుసంబంధించిన "సునన్ బైహాఖీ" అను గ్రంథమునందు నబీ (ప్రవక్త) లలో ఎవ్వరి శరీరమునైన భూమి తినంజాలదని చెప్పంబడినది. ఇదే విధముగ అతండు తనశిష్యులలోం బదునొకండుమందికగపడెను. పండ్రెండవ శిష్యుండగు టామసు (Thomas) అను వాండు అపుడు లేనందున ఇతర శిష్యులు తనతోం జెప్పిన మాటలను అతండు విశ్వసింపలేదు. అతనిని ప్రత్యక్షముగం దాను దాకినంగాని విశ్వసింపనని యతండు జెప్పెను. ఒక నాండు పండ్రెండుగురు శిష్యులును ఒక యింట్లో తలుపులు మూసికొని సభదీర్చి యుండగాం గ్రీస్తుప్రభువు వారలనడుమం బ్రత్యక్షమై తాను నిలువంబడి టామసుతో, "నీ వ్రేలిటు

దెమ్ము. నా రెండు చేతులను జూడుము. నీ హస్తమిటు దెమ్ము. నన్ను ఈ ప్రక్క బొడుము. విశ్వాస రహితుఁడవు కాకుము. ఇప్పుడైనను విశ్వాసము కలిగియుండుము" అని చెప్పెను. (St. John XX-27.) అప్పుడుతోమాసు క్రీస్తు ప్రభువునుజూచి తన స్నేహితులు చెప్పిన మాటల నమ్మెను. అప్పుడు క్రీస్తుప్రభువు మరల వానినిఁ జూచి, "ఓయీ! తోమసూ! నీవు నన్నుఁ ప్రత్యక్షముగఁ జూచితివి గనుక నమ్మితివి. కాని అట్లు చూడ కుండ నమ్మినవారలే ధన్యులు సుమా!" అని చెప్పెను. (St. John XX – 29.) ఈ శిష్యులు క్రీస్తుప్రభుదర్శనభాగ్యము నొందిన సమాచారము అట్లుండనిండు. గురువుగాని, ధర్మ ప్రచారకుఁడు గాని, చెప్పినరీతి నడచుకొనుచు ఎవఁడు భగ వంతునియందు విశ్వాసముంచి భగవదాజ్ఞలను నెఱవేర్చు చుండునో, అట్టి వానికిఁ గ్రమముగఁ జిన్మయదృష్టి యేర్ప డుటచే అతఁడు క్రీస్తు ప్రభువునేకాక దేవుని సైతము నిత్య లోకవైభవముతో సహా దర్శింపగలిగి యుండును. ఇట్టిదృష్టి క్రీస్తుప్రభువుయొక్క శిష్యులకు లేకుండుటచేఁ క్రీస్తు ప్రభుని శరీరము భౌతికమనియే వారలూహించిరి. అంతకుఁబూర్వము క్రీస్తుదర్శనము చేసినప్పుడు వారిదృష్టి యెట్లుండెనో, ఇపుడు సమాధినుండి లేచి ప్రత్యక్షమైనప్పుడుకూడ వారిదృష్టి అట్లే ఉం డెను. అతనినిఁజూచిరి. అతఁడేఅనినమ్మిరి. అంతకు మించి వార లెఱుఁగరు. కాని మనమిపుడు తెలిసికొనవలసిన విషయమొద్ది

యనిన, అతని శిష్యులు అతనినిఁ జూచుటయు, దాఁకుటయు, అతఁడే యని తెలిసికొనుటయు, అనునవి. క్రీస్తుప్రభువు ఈ ప్రపంచరంగమున ఏరూపముతో విహరించెనో ఆరూపమునే అతని శిష్యులు అపుడు చూచిరి. కాఁబట్టి క్రీస్తుప్రభువు ప్రపంచరంగమును విడిచిన వెనుక అతనికిఁ గలిగినరూపము అతఁడు ప్రపంచమందున్నపుడు కలిగియున్న రూపముతో సరిపోలి నపుడును, జన్మింపకముం దతనికిఁగలరూపమును, జచ్చిన వెనుక నతనికిఁగల రూపమును ఒక్కటేయైనప్పుడును, అతనికి జనన మఁగాని, మరణముగాని లేదనియే భావింపవలసి యుండును గదా? జననమరణములతో సంబంధము లేని ఒకే రూపముఁగల వ్యక్తియే అతఁడగుచున్నాఁడు. క్రీస్తుప్రభువు నిత్యుఁడును, వృద్ధిక్షయాది పరిణామరహితుఁడును. నిత్యలోకసంబంధముగల ప్రతివ్యక్తికిని ఇదే స్వభావము. మనుష్యమాత్రునికిఁ గలిగెడి జననమరణములు అతనికిఁగలుగవు. "మీరు క్రిందినుండివచ్చితిరి; నేను పైనుండివచ్చితిని. మీరు ఈ లోకమునకు సంబంధించిన వారు. నేను ఈలోకమునకు సంబంధించినవాఁడను కాను" అని క్రీస్తుప్రభువుస్పష్టముగఁ జెప్పియుండెను. (St. John VIII – 23.) అతఁడు కేవలము అప్రాకృతుఁడు. ఆత్మయు, జీవుఁడును, దేహమునుగూడ అతఁడే. అతఁడు పుట్టినట్లును, మరణించినట్లును గనఁబడునట్లు చేయునది మన దృష్టిదోషమే. ప్రకృతిమయ మగు నేత్రేంద్రియము దాని యెదుటఁబడెడి ప్రతివస్తువును

దనకు స్వకీయమగు సూక్ష్మరూపమును దాచియుంచి ఆపాదించియే దానినిఁ జూడఁగలిగి యుండునుగాని ఏవస్తువునైనను ఉన్నదున్నట్లు చూచుట దానికి స్వభావవిరుద్ధమగు కార్యము. కాని బద్ధజీవులమగు మనకిది ఒకవిధముచేత మిక్కిలి మేలగు కార్యమే అగుచున్నది. ఏమన, ధర్మబోధకుఁడగు గురువు మనుష్యరూపముతో ధర్మప్రచారముచేసినప్పుడే, తనశిష్యుల హృదయమందు భగవత్ప్రేమ అంకురించుచున్నది. కావుననే ఖొరానులో ఇట్లు చెప్పఁబడెను. "ఓప్రవక్తా! ఇట్లు చెప్పుకొనుము. 'నేను నీవంటి మానవుఁడను. కాని నావద్దకు దేవుని ఆజ్ఞ వచ్చుచున్నది*' ". గురువుయొక్క అద్భుత ప్రభావముచే ఆకర్షింపఁబడినవారై శిష్యులు అతని యుపదేశములను మనములం దిడికొని తదనుసారముగఁ దమ జీవితములను సవరించి కొందురు. గురువు మనుష్యరూపము వహించుటచేతనే తన శిష్యులతోఁ గలసిమెలసి యుండుటకును వారలకు ధర్మబోధసేయుటకును, అతనికి సంపూర్ణమగు అవకాశము కలుగుచున్నది.

భూలోకమందుఁ బుట్టినవారు కూడ నిత్యలోకమందు మొదట దివ్యరూపములతోనే ఉందురు. ఆ దివ్యరూపములు రక్తమాంసమయములగు శరీరములచే ఈలోకమున నావ

* ఖుల్, ఇన్నమా, అనబరుషమ్, మిస్లుకుమ్, యూహా, ఇలయ్యా. (ఖొరాన్)

రింపఁ బడుచున్నవి. కావుననే క్రీస్తుప్రభువు తనయందు విశ్వాసముగలవారిని ఆక్షేపింపవలదని శిష్యులకుఁ జెప్పుచుఁ దా నిట్లనెను. "ఈ చిన్నవాండ్ర నెవ్వరినైనను నీవు తృణీకరింపరాదు. ఏమన, ఒకప్పుడు వీరందఱును దమ దివ్యరూపములతో నిత్యలోకమందున్న నా తండ్రియొక్క ముఖమును సదా చూచుచుండెడివారు సుమా."

క్రీస్తుప్రభువును దమ నబీలలో నొకరినిగా భావించెడి ఖోరానుకూడ బైబిలులోని సిద్ధాంతములను అంగీకరించుచున్నది. మహమ్మదు తన నిత్యలోకారోహణ (మేరాజ్) దినమునఁ దనశిష్యులను బిలిచి, ధర్మప్రచారము కొఱకు భగవంతునిచేఁ బంపఁబడిన వాని నోటచే ఏ భగవత్సంకల్ప సూచక వాక్యములు పలుకఁబడినవో ఆ వాక్యములను బరిపాలించువారందఱు భగవంతుని దర్శింపగలరని చెప్పెను. ప్రపంచ రంగమునఁ దాను జేయవలసిన పని పూర్తియైన వెంటనే మహమ్మదు బెహిష్టు (నిత్యలోకమున) కే పోయెనుగాని ఇతర మృతజీవులతోపాటు విచారణ దినము (ఖియామత్) వఱకు అతఁడు నిరీక్షించలేదు. విచారణదినమందు మహమ్మదు తనను నమ్మకొన్నవారి పక్షమున దేవునియెదుట వాదింపవలసి యుండును. కావున మహమ్మదుకూడ క్రీస్తుప్రభువు వలెనే ప్రత్యేకదివ్యరూపముగల చిన్మయవ్యక్తి యనియే చెప్పవలసియున్నది. తనను భూలోకమునకుఁ బంపిన దేవుని

రూపముకంటె భిన్నమగు రూపము అతనికిఁ గలదని నూఁడఁ జెప్పవలసి యున్నది. ఇంతేకాక బహిస్తులో నుండునట్టి ఫరిష్త (దివ్యపురుషు) లందఱికిని భిన్నభిన్న దివ్యరూపములు గలవనియు, అవి యన్నియుఁ గూడ దేవుని రూపముకంటె భిన్నరూపము లగుచున్న వనియు జెప్పవలసి యున్నది. కాని మహమ్మదీయులు తమ ప్రవక్తకును, క్రైస్తవులు తమ రక్షకునకును చిన్మయరూపము లున్నట్లు ఏమాత్రము అంగీకరింపరు. భగవద్ధర్మ ప్రవర్తకులగు హిందువులు రాముగురువును సాక్షాద్భగవంతునిగను, చిన్మయునిగను భావింతురు గాని వానియందు మానవబుద్ధిసేయరు. "నేను, నా తండ్రియు ఒక్కటే" అనునది క్రీస్తుప్రభుని వాక్యము. (St. John X—30) "ఆచార్యం మాం విజానీయాత్" అనునది భగవంతుని వాక్యము.

ఇప్పుడు మఱియొక ప్రశ్న కలుగుచున్నది. "భగవంతునికి ఎట్టిరూపముగలదు? అది మనుష్యరూపము వంటిదా?" అనునది. మనుష్యరూపమువంటిదే అనిదీని కుత్తరము. భగవంతుఁడు తనరూపము వంటిరూపముతోనే మనుష్యుని పుట్టించెనని బైబిలునందుఁ జెప్పఁబడియున్నది (Genesis II-27) . మహమ్మదీయ మతగ్రంథమగు ఖొరాను నందుఁగూడ భగవంతుఁడు కరచరణములతోఁ గూడుకొన్న మానవుఁడుగనే వర్ణింపఁబడినాఁడు. "(విచారణ దినమునందు) తన మోకాలు

చాఁచి, 'రండు, నాపాదమునకు మ్రొక్కుఁడు' అని భగవంతుఁడు చెప్పెను" అని సూరేఖ్లాలమునందుఁ జెప్పియున్నది *. "నేను (ప్రజలను) రెండుచేతులనుండి పుట్టించితిని" అని సూరే బఖరునందుఁ జెప్పియున్నది ♦. కావున దేవుని రూపము మనుష్య రూపమునిరు తేలుచున్నది. దేవుఁడు తనకు ఇచ్ఛవచ్చిన రూపము ధరింపఁగలఁడనుట నిజమేకాని మానవరూపమే అతని యథార్థమగు రూపము.

మహామ్మదీయ మతగ్రంథములందును, క్రైస్తవమత గ్రంథములందును జెప్పఁబడిన విషయములకు మనము ఇప్పుడు చెప్పిన అర్థము సరియైనదైనచో — సరియైనదనియే మా అభిప్రాయము—తమ హిందూసోదరులు భగవంతుఁడు సాకార పరమతత్త్వమని (Job XIII-8) చెప్పినప్పుడు వారలతో ఈ రెండుమతములవారికిని ద్వేషము అనునది ఉండఁగూడదుకదా? భగవంతుఁడు తమ్మునుద్ధరించుటకొఱకుఁదన పుత్రుని పంపెనని క్రైస్తవులును, తమ్మునుద్ధరించుటకుఁ దన పారిషదుని పంపెనని మహామ్మదీయులును, భగవంతుని మెచ్చుకొనుచున్నపుడు నిజస్వరూపముతో భగవంతుఁడే అవతరించెనని హిందువులు ఏలచెప్పఁగూడదు? ఏల అతనిని మెచ్చుకొనఁ

---

* యౌమయుక్షఫు, అన్ సాఖిన్, వయుద ఊన ఇలా సుజూది — సూరేఖ్లాలమ్ (ఖొరాన్)

♦ ఖ్లాలఖ్ తహూ, బి యదయొహి — సూరేబఖర్ (ఖొరాన్).

గూడదు? స్వస్వరూపములో భగవంతుఁడు డవతరించుటకూడ యుక్తమనియే చెప్పవలెను. తనపుత్రుఁడు ఈలోకమం దవతరింపఁగలిగినప్పుడు తండ్రియగు తాను అవతరింపఁగలుగుటలో ఏమివింతగలదు? భగవత్పారిషదుఁడు మనకన్నుల యెదుటఁ గనిపింపఁగలిగినపుడు అతనినిఁ బంపిన భగవంతుఁడు మనకు ఏల అక్షిగోచరుఁడు కాఁజాలఁడు? తన భక్తులు తనను జూడఁగోరునప్పుడును, వారలసేవను దా నంగీకరించవలసి వచ్చినప్పుడును, భగవంతుఁడు ఈలోకమందు సాక్షాత్తుగ నవతరించుట అనివార్యమే అయిఉన్నది. ఇదియే భగవంతుఁ డిచ్చిన వరము. ఇట్టివరమును దేవుని పుత్రుఁడుగాని, దేవుని పారిషదుఁడుగాని, ఇయ్యఁజాలఁడు.

దేవుఁడు మన చర్మచక్షువులకుఁ గనఁబడఁడని చాల మంది చెప్పుదురు. కాని అతఁడు సర్వశక్తిమంతుఁడనుమాట వీరు మఱచియే ఇట్లనుచున్నారు. దేవుఁడు ఈపని చేయఁ గలఁడు; ఆపని చేయఁజాలఁడు అనుట దేవుని శక్తికిఁ గొంత లోప మాపాదించుటయే కదా ? భగవంతుఁడు ఇట్టి లోపము లతోఁ గూడుకొన్నవాఁడని చెప్పుట అతనిని అపహాసించుటయే కదా ? ఇట్లు చెప్పువారు దేవునిఁ దిరస్కరించినవారే కాని పూజించువారు కారు. కాని ఆ దేవునివలనఁ దా మేమైన లాభములు పొందవలసి వచ్చినప్పుడు అట్టివారు కూడ దేవుని ఆశ్రయింతురు; పూజింతురు; ప్రార్థింతురు. కాని అట్టి

భగవత్సేవనముచే వారు ముక్తి నెట్లు సాధింపఁగలుగుదురో తెలియఁజేయుచున్నది.

భగవంతుఁడు మనకన్నులకుఁ గనఁబడఁ గలఁడు. అతఁడు తనంతటఁదానే మనకు సాక్షాత్కరించును. ఇంతకు ముందు అతఁడు సాక్షాత్కరించినాఁడు; ఇటుపైనిఁ గూడ అతఁడు ఎన్నిపర్యాయములైనను సాక్షాత్కరింపగలఁడు. అతఁడు సర్వమునకును ప్రభువు. "ఇహపరలోకములందుఁగల సమస్తవస్తువులును భగవంతునివే. అవిమఱల అతనినే సేవించుచున్నవి" అని ఖోరాను చెప్పుచున్నది. భగవంతునితో సమానులులేరు. అతనికంటె అధికులును లేరు. "నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః" అనెడు గీతావాక్యము (గీ11-43). భగవంతుని ప్రభావమునే సర్వశాస్త్రములును ఘోషించుచున్నవి. ఈలోకమునందు రామకృష్ణాది రూపములతో అవతరించిన పరమపురుషుఁడే భగవంతుఁడు. క్రీస్తుప్రభువు అతనినే 'తండ్రి' అని చెప్పుచున్నాఁడు. అతనినే మహమ్మదు 'అల్లా' అని చెప్పుచున్నాఁడు. వారు అల్లాను దర్శింపగలిగినపుడు భగవంతునినే దర్శించుచున్నారు. తండ్రివాక్యములను వినుచున్నపుడు భగవంతుని వాక్యములనే వినుచున్నారు. కాని వారు స్వశిష్యులకు ఆపరమపురుషుఁడగు భగవంతునిగూర్చి ఏలవివరణముగఁ జెప్పలేదని అడుగవచ్చును. కారణమేమనిన, దాము బోధింపవలసినప్రజలకు భగవత్తత్త్వముయొక్క సూక్ష్మాతిసూక్ష్మము

లగు సిద్ధాంతములను దెలిసికొనుటకుఁ దగినంత ఆత్మవికాసము లేకుండుటయే. భగవంతుఁడు సాకారుఁడనియు, స్వరూపతత్త్వ మనియు వారుబోధించుటకు మొదలిడినచో దమప్రజలు అప్పుడు పూజించుచుండిన వందలకొలఁది విగ్రహములలో భగవంతుని రూపమునుచు ముఖ్యవిగ్రహమును చేర్చుకొందురు. అందు వలన దమ ధర్మప్రచారము సర్వనాశనమగును. ఇంతేకాక, ఏవిషయమైనను మనము ప్రత్యక్షముగ గమనించినంత సమ గ్రముగ మనము దానిని వర్ణింపఁజాలము. అప్రాకృత విషయ మైనచో దానిని సమగ్రముగ వివరించుట ఎవ్వరికిని దరము కాదు. ఏమన వాక్కునకు అందనివిషయమును వాక్కు వివ రింపఁబూనుట అతిసాహసముగదా! కావున మనుష్యభాషలో భగవంతుని వర్ణించుచున్నప్పుడు భగవంతునికి మానవలక్షణ ములు వచ్చుటయును, నిస్సీమమగు భగవత్తత్త్వము ససీమ మగు నరయుక్తిచే గుంఠితమగుటయు, అనివార్యముగ సంభవించును. ఇదియే భగవద్వర్ణనమందుఁగల మహాలోప మును, మహాప్రమాదమును. వర్ణనకు మించినవిధముగ భగవ త్తత్త్వము ఉండనేరదని ప్రజ లభిప్రాయపడుటకు ఆరంభిం చినచో ఇఁక అవర్ణనవలన ఎంతటి ప్రమాదము తటస్థించు చున్నదో వేఱే చెప్పవలసిన పనిలేదు. కావుననే మతగ్రంథ ములందు భగవంతుని వర్ణించిన స్థలములందు వర్ణనాతీతుఁడగు భగవంతుని వర్ణింపసాహసించినందులకు భగవంతుఁడు తన్ను

మన్నింపవలసినదని ఆ వర్ణించినయతఁడు రచించిన క్షమాపణ వాక్యములు చూపట్టుచునేఉండును. భక్తాచార్యులు ఈమహా ప్రమాదము నెఱిఁగినవారగుటచే వాస్తవగురుని సాయము లేకుండ సిద్ధాంతవిషయములు ఎవ్వరును బఠించరాదని తమ శిష్యులను కఠినముగ శాసించియున్నారు. కావున దేవుని రాజ్యమందుఁ బ్రవేశించుటకుఁ గోరికగలవాఁడు దాని ప్రవేశద్వారమగు నిత్యలోక ద్వారమును దెఱచుటకు ఎవ్వనివద్ద బీగముకలదో అట్టి గురుదేవుని నాశ్రయించినచో అతఁడా ద్వారమును దెఱచి తన్నులోనికిఁ బంపఁగలఁడు. భగవంతుని దర్శించుటకు ఇది యొక్కటే ప్రమాద రహితమగు మార్గము. క్రీస్తుప్రభువును, మహమ్మదును దేవుని వర్ణించుట మాని ఈప్రమాదమును దప్పించుకొనిరి. "భూమిపై పెరిగెడి వృక్షజాలమును కలములుగను, సప్త సముద్రములందలినీటిని సిరాగను భగవంతుఁడొనర్చియున్నను భగవద్వర్ణనము లిఖించుట పూర్తికానేరదు." అనిమాత్రము ఖోరానులో చెప్పఁబడి యున్నది. తమ శిష్యులకు దేవుని యందు విశ్వాసము కల్గించుట ఒక్కటే తమ అవతార ప్రయోజనమగుటచే భగవద్వర్ణనము సేయకుండ వారలు ఈ పనిని సాధింపఁగలిగిరి. కాని హిందూమతోద్ధారకులగు ఋషులకును; మహాజనులకును దమ శిష్యుల హృదయము లందు భగవంతునియెడల విశ్వాసము పుట్టించుటేకాక ఉజ్జ్వల

మగు ప్రేమగూడఁ బుట్టించుట తమ ప్రయోజన మగుటచే భగవంతుని వర్ణించుట వారికిఁ దప్పినది కాదు. భగవంతుని ప్రేమించుటకును, లాలించుటకును, సేవించుటకును దహతహ పడుచున్న అట్టి ప్రజలకు జగన్మోహనమును, మందహాస సుందరమును, అభయాది హస్తశోభితమును అగు పరమ పురుషుని అవతార రూపమే సర్వాకర్షణీయ మగుచున్నది. మహమ్మదుయొక్కయు, క్రీస్తుప్రభునియొక్కయు శిష్య ప్రశిష్యులు తాము గొలుచు దేవుని దూరమునుండియే నమస్కరించుచుఁ దమ పాపములను క్షమింపుమని వేడుకొనుచుండ, హైందవ ఋషుల శిష్య ప్రశిష్యులు దేవుని నాలింగనము చేసియు, ముద్దాడియు, దమ ప్రాణ ధనముగు నతని నెడఁ బాసి ఇంతవఱకు ఎట్లుండఁ గలిగితిమని తమ్ముఁ దాము నిందించుకొను చుండియు, దమ జీవితములు గడపు చుందురు. ఇట్టివారల హృదయములు భగవద్వర్ణనముచే ఆకర్షింపబడి, క్రమముగ వికాసమునొంది, సదా భగవంతుని వంకకే పరువెత్తుచుండును. ప్రజలయందుఁగల ఆత్మవికాసము ననుసరించి వారలకు ఎంతవఱకు అవసరమో అంతవఱకే శ్రుతివాక్యములు బోధింపవలెను. అట్లుకానిచో ఆ శ్రుతిబోధలచే వారల కొక విధమగు ఆత్మక్లమ (Spiritual langour) మేర్పడి క్రమముగ వారునాస్తికులలోఁ గలియుదురు. హిందూమత సిద్ధాంతమునకును, మహమ్మదీయ

క్రైస్తవ మత సిద్ధాంతములకును, గల విశేష భేదమునకు ఇదియే కారణము. మనలను ఎట్లుద్ధరించవలెనో భగవంతునికిఁ దెలియును. కావున అతఁడేమి యొనర్చినను అది మన పారమార్థిక క్షేమము కొఱకే అగుచున్నది. అతని మార్గములు దుర్జ్ఞేయములు. మనబుద్ధి వానిని విమర్శింపఁజాలదు. కాని అట్లని మనమూరకుందుమా? ఊరకుండక వాని మార్గముల యందు దప్పులుకూడ నెన్నుచుందుము. భగవద్వాక్యముల యందుఁ మనకుఁగల విశ్వాసము ఒక్కొక్కప్పుడు అతిమూఢ విశ్వాసముగఁ బరిణమించి ఇతర మతవాక్యములు వినుటకుఁ గాని, విమర్శించుటకుఁగాని అవకాశమీయక, పరమత దూషణమే పరమార్థ సాధనమను నికృష్టపు స్థితికి మనలనుఁ దెచ్చుచున్నది. భగవంతుఁడు సమస్తమునకును సృష్టికర్త కాని, అతని నెవ్వరును సృష్టించలేదు. భగవంతునిఁగూర్చి మనము పలుకు నిందావాక్యములన్నియును మనకే తుదకు ముప్పు దెచ్చునుగాని అతని స్వరూప స్వభావములను అవి ఎంత మాత్రమును మార్చఁజాలవు. "కృష్ణస్తు భగవాన్ స్వయం" మ్మనునది ఋషివాక్యము. కృష్ణుఁడు తాను భగవంతుఁ డనియే చెప్పెను; భగవంతునిగనే అతఁడు వ్యవహరించెను. ఈ భౌమ జగత్తునకు రాకపూర్వమును అతఁడు పరమపురుషుఁడే; వచ్చి యిచ్చట వ్యవహరించుచున్నపుడు కూడ అతఁడు పరమపురుషుఁడే; ఈ ప్రపంచరంగమును విడిచినవెనుకఁగూడ.

అతడు పరమపురుషుడే. అవతరించినంతమాత్రమున బరమ పురుషునకు దేశకాలబంధము కలుగనేరదు. అతని దేశకాలానవచ్ఛిన్నముగు నతని నిత్యసనాతనస్థితియందాతని యవతరణ లీల ఒక భాగమైయున్నది. ఇట్లనుటచే దేశకాలకారణాత్వములు అతనికి లోబడియే ఉన్నవనికాని అతని నతిక్రమించి యుండజాలవని అర్థము. అతడు సర్వాత్ముడు; సర్వాతీతుడు; ఆద్యంతరహితుడు; శాశ్వతుడు; సత్యస్వరూపుడు.

బ్రహ్మసంహితయందు అతడు సర్వమునకు బ్రభువనియు, సచ్చిదానంద లక్షణముగల అప్రాకృతరూపము గల వాడనియు, వర్ణింపబడినది.

"శ్లో. ఈశ్వరః పరమః కృష్ణః, సచ్చిదానంద విగ్రహః
అనాదిరాది గోవింద, స్సర్వకారణ కారణమ్."

అతడవతరించుటకు గారణము శ్రీమద్భాగవతమందు జెప్పబడినది. తన భక్తులగు వసుదేవుడు మున్నగువారు కంసాదులగు అసురులచే బీడింపబడు చున్నపుడు చిన్మయ ప్రకృతి మయలోకములకు బ్రభువైన అతడు, పుట్టుకలేనివాడైనను వారలయందు దనకుగల అనుగ్రహముచే గర్భమునందవతరించి యుద్భవించెనని అందు జెప్పబడినది.

"శ్లో. స్వశాంతరూపే ష్వితరై స్స్వరూపై
రభ్యర్థమానే ష్వను కంపితాత్మా
పరావరేశో మహదంశయుక్తో
హ్యజోఽపి జాతో భగవాన్ యథాగ్నిః"

దీనిఁబట్టి అతఁడు మొదట నిరాకారుఁడై యుండి, అవతరించవలసి వచ్చినపుడు ప్రాకృతమును, నశ్వరమును అగు రూపమును ధరించినాఁడని మనము అనుకొనరాదు. తానెన్నఁడు జన్మించలేదని అర్జునునకుఁ గృష్ణుఁడు గీతయందు స్పష్టముగఁ జెప్పెను. "నేను వాస్తవముగ నిరాకారుఁడ ననియు, అవసరమునుబట్టి నేను మాయిక రూపముతో అవతరించుచున్నాననియు, భావించువారు మూఢులే. నేను ఎల్లప్పుడును నిత్యమును, సర్వోత్తమమును అగు ఈ రూపముతోనే ఉందునని వారరెఱుంగరు."

"శ్లో. అవ్యక్తం వ్యక్తిమాపన్నం, మన్యంతే మా మబుద్ధయః
పరంభావ మజానంతో, మమావ్యయ మనుత్తమమ్." (గీ 7-24)

కృష్ణుఁడు ఆ రూపముతోడనే నిత్యవర్తమానుఁడై యున్నచో మనము ఆ రూపముతో అతనినేలఁ జూడఁజాలమని యెవరైన నడుగవచ్చును. దీనికిఁ గృష్ణుఁడు ఇట్లుత్తరము చెప్పెను. "నేను ఈ రూపముతో నిత్యవర్తమానుఁడ నగుటయు, నిత్యదర్శనీయుఁడ నగుటయు నిజమే. కాని యోగమాయఅను నా శక్తి ఒకటి కలదు. అది మానవనేత్రముల

నావరించుటచే నేను వారికిఁ గనఁబడను. కావున నేను ఈ రూపముతో నుండియును, బుట్టుక లేనివాఁడననియు, నాశరహితుఁడననియు, వార లెఱుంగరు.

"శ్లో. నాహం ప్రకాశః సర్వస్య, యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతి, లోకో మా మజమవ్యయమ్." (గీ7-25)

దీనికి ఉదాహరణము ఇట్లు చెప్పవచ్చును. సూర్యుని మేఘము ఆవరించినదను కొందము. సూర్యుఁడు ఆకాశమందు సదా ఉండువాఁడే. అతనికిని, మన కనులకును, నడుమ మేఘ మొకటి అడ్డువచ్చుటచే సూర్యుఁడు మనకన్నులకుఁ గానరా లేడు. దీనినిఁబట్టి మేఘము సూర్యుని దాఁచివేసినదని మనము భావింపరాదు. ఏమనఁగా: అతిస్వల్ప పరిమాణముగల మేఘము సూర్యునంతటి మహత్తరమగు వస్తువును ఆవరించిన దనుట సరికాదు. ఆమేఘము మన కన్నులనేకప్పి మనకు సూర్యుఁడు కనఁబడకుండఁ జేసినది. ఈ మేఘమే మాయ. మేఘము తొలఁగిపోయినచో సూర్యుఁడు ప్రత్యక్షమగు చున్నాఁడు. అట్లేమాయ తొలఁగిపోయినచో పరమపురుషుఁడు ప్రత్యక్షమగు చున్నాఁడు.

కాని ఈమాయ తొలఁగుట ఎట్లు ? కృష్ణుఁడిట్లనెను:— "నా మాయ ప్రాకృత గుణములు కలదగుటచే దానిని జయించుట అసాధ్యము. కాని నన్ను శరణుజొచ్చిన వారికి మాత్రము ఈ మాయ తొలఁగిపోవుచున్నది.

"శ్లో॥ దైవీహ్యేషాగుణమయీ। మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే। మాయామేతాం తరంతి తే." (గీ7-14)

ఈ మాయా ప్రభావమునకు అధీనులై యున్నవారు మాత్రము కృష్ణుఁడు మానవుఁడనియే భావింతురు. అతఁడు ఎట్లు భగవంతుఁడగుననికూడ అడుగుదురు. ఇందు విషయమై కృష్ణుఁడు అర్జునునితో ఇట్లనుచున్నాఁడు. "వీరు మిక్కిలి మూఢులు. ఈ భౌమజగత్తునందుఁగూడ నాస్వరూపమును బ్రకటింపఁగలశక్తి నాకుఁగలదని వీరెఱుఁగరు. మఱియు నేను ఈరూపముతోడనే సమస్త సృష్టికిని బ్రభువునగు చున్నాననికూడ వీరెఱుఁగరు."

"శ్లో. అవజానంతి మాంమూఢా। మానుషీం తనుమాశ్రితం
పరంభావ మజానంతో। మమభూత మహేశ్వరమ్." (గీ9-11)

కృష్ణుని విశ్వరూపునిగఁ జూడవలెనని అర్జునుఁడు కోరినపుడు తనకుఁగల నేత్రములు ఆరూపమును జూడజాలవనియు ఆరూపమును జూచుటకు దివ్యదృష్టి నిచ్చెదననియు, గృష్ణుఁడు చెప్పెను.

"శ్లో. నతుమాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్." (గీ 11—8)

దివ్యదృష్టి నొందినవాఁడై అర్జునుఁడు కృష్ణునియందు మొదట రుద్రరూపమును, తదుపరి విశ్వరూపమును, దరువాత చతుర్భుజ నారాయణ రూపమును, జివరకు "స్వకం

రూప"మ్మని కృష్ణుని చేతనే చెప్పబడినట్టి కృష్ణరూపమును జూచెను. తన కృష్ణరూపమునందు అర్జునునకు మఱల నగపడి నపుడు అతనితో, "ఓ అర్జునా! ఇప్పుడు నీవు చూచుచున్నటువంటి ఈ సుందర రూపముతో నున్న నన్ను జూచుటకు దేవతలు గూడ సదా కోరుచుందురు" రని చెప్పెను.

"శ్లో. ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా
సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః." (గీ 11—50,52)

కాని ఈ కృష్ణరూపము ఇంతకుముందు అర్జునుడు చూడలేదనియా? అని ప్రశ్నించవచ్చును. అర్జునుడు గూడ కేమి? అర్జునుడే కాదు. కృష్ణునికి గర్భశత్రువులగు కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు మున్నగు వారుగూడ అతనిని ఆరూపముతోనే చూచిరి. ఇట్లుండగా, ఈరూపముతోనున్న తనను దేవతలుగూడ సదా జూడగోరుచున్నారని చెప్పుటకు గారణమేమి? ఇంతకుముందు దేవతలు ఈరూపమును జూడ లేదనియేకదా అర్థము? దీనికి గారణము ఇంతకుముందు చెప్పినదే ఇప్పుడుకూడ అనువర్తించుచున్నది. అర్జునుని మాంస నేత్రములకే గాక సమస్తమైనవారి మాంస నేత్రములకు గూడ అతడు రక్తమాంస నిర్మితమగు

రూపము గలవాఁడుగనే అగపడెను. ఇపుడు అర్జునుఁడు దివ్య దృష్టి కలవాఁడగుటచే "గోలోక" వాసి కృష్ణరూప మతఁడు చూడఁగలిగెను.

భగవంతుఁడు ప్రకృతిరంగమునకు అవతరించినపుడు ప్రకృతిప్రభావమున కతఁడు బద్ధుఁడగుటయు, మర్త్యునికిఁగల దోషములన్నియును అతనియం దగపడుటయు, దప్పదని కొందఱు పండితులకే అభిప్రాయముగలదు. కాని భగ వంతుఁడు ప్రకృతిసీమయందు అవతరించినను బ్రకృతిచే ఎంత మాత్రమును బాధింపఁబడఁడని శ్రీమద్భాగవతము చెప్పు చున్నది.

శ్లో. ఏతదీశాన మీశస్య ప్రకృతిస్థోపి తద్గుణైః, నయుజ్యతే.

కృష్ణుని జనన మరణములనుగూర్చి శ్రీమద్భాగ వతమందు ఇట్లు చెప్పఁబడెను.

"అవి ఇంద్రజాలకుని చేతలవలె మర్త్యుని మోసపుచ్చుచున్నవి"

శ్లో. రాజన్! పరస్య తనుభృజ్జననాప్యయేహా
మాయావిడంబన మవేహి యథానటస్య"

స్కాందపురాణమం దిట్లున్నది.

"భగవంతుఁడు మరణించె ననుటచే అతఁడు ఈప్రపం చమును విడిచి పోయె ననియే అర్థము. అతఁడు నిత్యానంద స్వరూపుఁడు. అతని మరణమునకు ఇంకొక అర్థమేలేదు. అతని రూపము అప్రాకృతమును, చిన్మయమును, అగుటచే అది

"భగవంతుని శరీరము ప్రాకృతమని చెప్పువానికంటె వేఱొండు భగవన్నిందలేదు. ఈశ్వరుఁడు సచ్చిదానంద విగ్రహుఁడు. అతని విగ్రహము సత్త్వగుణ వికారముగాదు. ఈశ్వరవిగ్రహమును సంభావింపని యతఁడు పామరుఁడు (పౌత్తళికుఁడు- Idolater). అతని నెవ్వరును తాఁకఁగూడదు; చూడఁగూడదు. అతఁడు యమదండన కర్హుఁడు."

మన సిద్ధాంతగ్రంథముల యందును ఇట్టివాక్యములు ఎన్నియో కలవు. అవి అన్నియు ఈశ్వరుఁడు పరబ్రహ్మ యనియే చెప్పుచున్నవి. బ్రహ్మ లక్ష్యార్థమును, భగవంతుఁడు వాచ్యార్థమును అనుట తప్పు; చాలఁదప్పు. ఇట్లనుకొనువారు పాపమునకే ఒడి గట్టుకొనుచున్నారు. భగవంతుఁడు బ్రహ్మయే; బ్రహ్మకంటె అధికుఁడుకాఁడు; తక్కువవాఁడును గాఁడు. ఉపనిషత్తులు అతనిని బ్రహ్మయని చెప్పుచున్నవి. అతనినే యోగులు పరమాత్మ అనుచున్నారు. భక్తు లతనినే భగవంతుఁ డనుచున్నారు. అతఁడు అద్వితీయుఁడే కాని తన్నుఁగొలిచెడి జ్ఞానులకును, యోగులకును, భక్తులకును పైనిఁజెప్పిన మూఁడుపేళ్ళతో ఉపాసనీయుఁ డగుచున్నాఁడు. "వదంతి తత్తత్త్వవిదస్తత్త్వంయద్జ్ఞానమద్వయం, బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే" అనునది ఋషివాక్యము. అతని సాక్షాత్కారము నొందిన సాధుపురుషులు ఈ విషయ

మును బలపఱచుచు భగవంతుని సర్వమునకును ప్రభువుగ భావించి వానిని గొలుచుచున్నారు.

సర్వేశ్వరుఁడగు పరమపురుషుఁడే భగవంతుఁడని ముందే చెప్పఁబడినది. భగవంతుఁడును, భగవంతుని శరీరమును గూడ ఒక్కటియే. మనకుఁగల శరీర శరీరిభేదము అతని యందు లేదు. అతనియందు నశించునది ఎద్దియును లేదు; సమస్తమును ఉండునదే. అతఁడు అనాకారము దాల్చి జగద్రంగమును విడచినప్పుడు ఏదియు విడచిపెట్టి పోలేదు. భగవంతునికి వలెనే అతని పారిషదులగు దివ్యపురుషులకుఁ గూడ దివ్యములు, నిత్యములును అగు రూపములే కలవు. ఈ రూపములు వినా వారికి అస్తిత్వమే లేదు. వారు ఈ ప్రపంచమునకు వచ్చినపుడు గూడ ఈ రూపములతోనే వత్తురు.

కావున రూపములను దూషించుట ఏ విధముచేతను గూడఁ దప్పుగాదు. విగ్రహారాధకులని నారోపము చెప్పుకొనువారు మతసిద్ధాంతముల నెఱుఁగనివారును, ఋషివాక్యముల యందు ఆదరణము లేనివారును అనియే చెప్పవలెను. దేవునికి రూపమే లేదను నిశ్చయబుద్ధితో వారున్నప్పుడు రూపముగల దేవుఁడు వారికెట్లు కనఁబడఁగలఁడు? దేవుని దర్శనమే వారికిఁ గలుగదు. తనప్రభువుయొక్క దర్శనమే లేకుండ అతనినిఁ గొలిచెడి సేవకునకు అట్టి సేవచేత ఏమియు సంతృప్తి కలుగదుగదా?

విగ్రహారాధనము ఒకఁడు చేయవచ్చును; చేయక పోవచ్చును. ఇంతలో మునిఁగినదియేమియును లేదు. శ్రీ విగ్రహ పూజనము మనకు చిన్మయదృష్టి కలుగుటకు ఉపకరణము మాత్రమే అగుచున్నది. శ్రీ విగ్రహారాధనమే జీవిత ప్రయోజనము కాదు. చిన్మయదృష్టి కలిగిన తరువాత శ్రీ విగ్రహము భగవద్రూపము వహించుచున్నది. కాని ప్రాకృతరూపముతో మఱి కనఁబడదు. అట్టిదృష్టి యేర్పడు వఱకును రామకృష్ణాది రూపములతో జగద్రంగమున కవతరించిన భగవంతుని గొలుచుటయును, మానవపుత్ర రూపముతో జగద్రంగమున కవతరించిన క్రీస్తుప్రభువును గొలుచుటయును, ఎంతటి ప్రయోజనకారియో, శ్రీ విగ్రహరూపముతో నున్న భగవంతుని గొలుచుట అంతటి ప్రయోజనకారియే. ఏమన, కృష్ణునిఁ గంసుఁడు చూచియును వానినిఁ జంపుటకుఁ బ్రయత్నించలేదా? కెయఫాసు (Caiaphas) క్రీస్తుప్రభువును జూచికూడ అతనిని మతవిప్లవకారుఁ డనలేదా? (St. John XI-49) భిన్నభిన్నమతములవారి శిక్షాప్రణాళికలను మనము వేఱు వేఱుగ విమర్శించునపుడు అందులో ఒక ప్రణాళిక కంటె వేఱొక ప్రణాళిక శ్రేష్ఠమైనదిగఁ గనిపించవచ్చును. కాని ఏ ప్రజలకొఱకు ఏ ప్రణాళిక యేర్పడినదో ఆ ప్రజలనుద్దేశించి ఆ ప్రణాళికను విచారించినప్పుడు అన్ని ప్రణాళికలును సమానశ్రేష్ఠత్వము గలవిగనే తోచును.

ఇంద్రియముల కుపాహారము. ఆహారమే దేహమును పోషించు చున్నది. కావున దేహపోషణమే ఆహారమునకుఁ బ్రధానాంశ మగుచున్నది. కావున దేహపోషణమునకు ఆహారము తప్ప మఱియొకటి శ్రేష్ఠము కాదు. కాని పెద్దలకిచ్చెడి ఆహారమునకును, చిన్నపిల్లలకిచ్చెడి ఆహారమునకును ఎంతయో భేదము కలదు. ఇట్లుండ పిల్లలకిచ్చెడి ఆహారము పెద్దలకును, పెద్దలకిచ్చెడి ఆహారము పిల్లలకును ఇచ్చినచో నేమగును? వీరికి, వారికిఁ గూడ దేహనష్టి కలుగును. మన దేహములవలెనె మన మనస్సులుకూడ భేదించుచుండును. కావున వానికి దగినశిక్ష వాని కిచ్చుట యుక్తము. ఒకవిధమగు మనోధర్మముగల ప్రజలకు అనుకూలించు శిక్షాప్రణాళిక వేఱొకవిధమగు మనోధర్మము గలవారలకు ఎంతమాత్రమును ఉపయోగపడక పోవచ్చును. కావున ఎవరి శిక్షాప్రణాళికను వారు ప్రేమించుటయును, ఎట్టికష్టములు కలిగినను వారు దానిని విడువకుండుటయును, సర్వోత్తమమగు పని. "నీవు ఇతర దేవతలను గొలువరాదు. నీ చుట్టుపట్ల నుండెడి ఇతరులు కొలిచెడి వేల్పులనుగూడ కొలువరాదు" అని బైబిలునందుఁ జెప్పియున్నది. (Deu VI-14). కాని వారు ఇతరుల శిక్షాప్రణాళికలయందు ద్వేషబుద్ధి మాత్రము కలిగి యుండరాదు. ఇతరుల శిక్షాప్రణాళిక తనకు రుచింపక పోవచ్చును. అంతమాత్రముచేత దానిని నిందించుట యేమిన్యాయ్యము?

శ్రీమద్భాగవతమందుఁ జెప్పిన నవవిధభక్తులలో భగవన్నామ సంకీర్తనమే కలియుగమునకు అనుకూలించు భక్త్యంగమని భక్తాచార్యులు చెప్పియున్నారు. కాని శ్రీ విగ్రహారాధనమును వారుకూడ అంగీకరించియే యున్నారు. ఏమన, దానియందు ఆసక్తిగలవారికి అదిఅవసరమని వారికిఁ దెలియును. వారు శ్రీ విగ్రహారాధనమును అంగీకరించినప్పటికిని, ఆ విగ్రహములు దారుమయములనియు, మృణ్మయములనియు భావించరాదని మాత్రము నొక్కి-నొక్కి చెప్పియున్నారు. తనశిష్యులు చేయవలసిన పూజావిధానములను, ఉపాసనా విధానములను నిర్ణయించునతఁడు గురువు. అట్టివి తమకుఁదామే శిష్యులు నిర్ణయించుకొనరాదు. అట్లు చేసినచో వారలు ఆత్మతత్త్వమును విడిచి తమ మనస్తత్త్వమునే అనుసరించిన వారగుచున్నారు. అనఁగా దమ ఇష్టమువచ్చినట్లు చేయుచున్నారని అర్థము. అట్లుచేయుటచే వారలు భగవంతునిఁ బొందలేరు సరేకదా అతనికి మఱింత మఱింత దూరస్థులే అగుచున్నారు. భగవంతునిఁ జేర్చు మార్గము నెఱిఁగియున్న సద్గురుని ఆశ్రయించుటమాని, తనమనస్సు నాశ్రయించి తనకుఁ దానే గురువును, మార్గదర్శకుఁడును, అగువానికి ఎన్నటికిని ఆత్మవికాసము కలుగనేరదు. దీనింగూర్చియే గీతాశాస్త్రమందు, "యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః, న ససిద్ధిమవాప్నోతి నసుఖం నపరాంగతిమ్"

(గీ. 16-23) అని చెప్పఁబడినది. కావుననే భాగవతమునందుఁ గూడ గురువుతోడ నావిక ప్రతిమానే గురువగుచున్నాఁడని చెప్పఁబడినది. గురువునందు మానవబుద్ధిచేసి అతనిని ఆశ్రయించుటకు ఇష్టములేనివారు తాము పూజించు శ్రీవిగ్రహములను కొయ్యలుగను, రాళ్లుగను భావించుటలో ఏమి వింతఁగలదు? "అర్చ్యే విష్ణౌ శిలాధీర్గురుషు నరమతిర్వైష్ణవే జాతిబుద్ధి...ర్యస్య వా నారకీసః" అనునది ఋషివాక్యము.

సాధారణముగ సమస్తమైనవారికిని విగ్రహారాధనము ఉత్సాహకరమగు విషయమే. ప్రపంచమందు ఏదేశపుఁ బ్రజలయందుఁ జూచినను విగ్రహారాధనము ఏదో ఒక రూపమునఁ గనఁబడుచునే యున్నది. కాని బొత్తుగ లేకుండుట లేనే లేదు. హిందువులు సాలగ్రామములను, శ్రీ విగ్రహములను బూజించునట్లు బౌద్ధులు బుద్ధవిగ్రహ రూపములు మున్నగువాని నాదరించుచున్నారు. గ్రీకులును, రోమనులును జ్యూపిటరు (Jupiter) మున్నగు దేవతల విగ్రహములను బూజించుచున్నారు. క్రైస్తవులలో రోమను క్యాథలికులు మేరీ, జీససు విగ్రహములను బూజించుచుండ ప్రొటెస్టెంటులు క్రాసులను పేరుగల శిలువలను బూజించుచున్నారు. మహమ్మదీయులు కూడ పంజాలను, చందువంక (Crescent) లను బూజించుచున్నారు. వేయేల? విగ్రహారాధనమును నిరసించెడి కొందఱు నవనాగరికులగు

పండితులు గూడ స్వాతంత్ర్యము (Liberty), శాంతి (Peace) మున్నగువానికి విగ్రహరూపము లిడి పూజించుచున్నారు. ఇది అంతయు విగ్రహారాధనమే కదా? ఇందులో దప్పేమి యున్నది? ధనికులగువారిలో ఎవ్వరైనం జనిపోయినప్పుడు కొందఱు వారికి విగ్రహరూపము లిడి ఏల పూజించుచున్నారు? వారలయెడం దమకుం గల కృతజ్ఞత మనస్సులో ఉండినం జాలదా? ఇట్లే విగ్రహారాధనము ప్రపంచమందుం బాదుకొని చిరస్థాయిగ నున్నది.

మఱియు విగ్రహారాధనమును అందఱును సులభముగ నిందింప వచ్చునుగాని ఆపని చేయకుండ ఎవ్వరును ఉండ జాలరు. ఈవిషయమే పైనిం జెప్పంబడినది. హిందూమత గ్రంథములయందు ఎనిమిది విధములగు మూర్తులు పూజనీయములని చెప్పబడినది. వానిలో నొకదానికి మనోమయమూర్తి అనిపేరు దాగు శిలావిగ్రహములయెదుట వంగి నమస్కరించుటకు ధైర్యము చాలనివాడుగూడ మనోమయమూర్తి యెదుట అట్లు చేయుటకు ఏమాత్రమును వెనుదీయడు. కాని మృణ్మయ విగ్రహము ఎంతప్రాకృతమైనదో మనోమయవిగ్రహముకూడ అంతప్రాకృతమైనదే. మనము ఎంతవఱకు ఆత్మోపలబ్ధిలేనివారమైయుందుమో అంతవఱకు మనభావము లన్నియును మానసికము లగుటచేం బ్రకృతిమయములే అగుచున్నవి. కావున మనకు ఆత్మోపలబ్ధియు, ఆత్మవికాసమును గలుగు

వలెను భగవంతుని అప్రాకృతవిగ్రహమును ధ్యానించుటకు అవకాశము లేదు. కొందరు చిన్మయమూర్తిని పూజించువారు కూడ విగ్రహపూజ చేయువారనబడుచున్నారు. విగ్రహారాధకులమే అని మనము మనకై చెప్పికొనకుండుటకుఁ గారణము మనగుట్టు మనము దాఁచుకొనుటకైనను గావచ్చును; లేదా "మేము విగ్రహారాధకులము" అని నిష్కపటముగఁ జెప్పికొను వారిని ఈసడించుటకైనను గావచ్చును.

మనోమయ విగ్రహమును ఆరాధించువారు హిందువులలోఁ గొందఱున్నారు. వీరికి బ్రహ్మవాదులని పేరు. వేదాంతులనియు, జ్ఞానులనియు వీరికి నామాంతరములు కలవు. మహమ్మదీయులలో "సూఫీ" లు ఎట్టివారో, హిందువులలో వీరు అట్టివారు. వీరిసిద్ధాంతము ననుసరించి బ్రహ్మ అనిర్దేశ్యుఁడును, నిరాకారుఁడును, నామరూప రహితుఁడును, సచ్చిదానంద ఘనుఁడును. బ్రహ్మకు అప్రాకృత విగ్రహము లేదు. బ్రహ్మవినా వేఱొక వస్తువే లేదు. జీవులకు అనేకత్వము లేదు. బ్రహ్మమే జీవుఁడు. అనేకత్వము నీకుఁ గనఁబడినచో నీవు మాయకు వశుఁడవై ఉన్నావని అర్థము. మాయ తొలఁగెనేని నీవు నిజముగ బ్రహ్మవే అగుదువు. నీవే అఖండ సుఖాంభోధివి. మాయామారుతము నీపైని వీచినప్పుడు ప్రపంచములనెడి తరంగములు నీయందుఁ బుట్టుచున్నవి; నీయందే మఱల అణఁగి పోవుచున్నవి. భక్తియను పదము

వారుగూడ ఉపయోగింతురు. వారికిఁ బరమప్రయోజనమగు ముక్తికి భక్తి కారణముగఁ జెప్పుదురు. స్వస్వరూపాను సంధానము, లేక, స్వాత్మతత్త్వానుసంధానము భక్తియని వారు నిర్వచించిరి. నామరూప రహితుఁడగు బ్రహ్మవస్తువును అను సంధించుట కూర్చియే అది చెప్పబడినది. అట్టి బ్రహ్మను సంధానము ఒక్కమారుగాఁ జేయఁజాలనివారు సూర్యుఁడు, గణపతి, శివుఁడు, శక్తి, విష్ణువు అను ఐదుగురు దేవతలలో నేమూర్తినైనను ఇష్టదేవతగ నుంచి ఇతర మూర్తులను ఆ దేవతకు ప్రత్యధిదేవతలుగ భావించుచుఁ బూజింపవలసి యుండును. దీనికే వారు పంచదేవతోపాసన మందురు. ఈ దేవతలలో నెవరిని బూజించినను సాధకుని హృదయము పరిశుద్ధమై బ్రహ్మానుసంధానమునకు అనుకూలమగుచున్నది. అప్పుడుమఱి అతనికి ఉపాసనతోఁ బనిలేదు. ఏమన, ఉపాస కుఁడే ఉపాస్యతత్త్వముగ మాఱినపుడు ఎవనిని ఎవఁడు ఉపా సించువాఁడు? ఈఉపాసన విగ్రహారాధనమేకదా? నీఉపాస్య తత్త్వము. నీ ఉపాసనకూడ నీమనస్సుచే భావింపఁబడిన వగుటచే అవి అవశ్యముగ మానసికములే అగుచున్నవి. కావున బ్రహ్మము ఇంతవఱకు వృత్తి వ్యాప్యముగనే ఉన్నది. ఈభావననే యోగులు సంప్రజ్ఞాత సమాధి అనుచున్నారు. తదుపరి బ్రహ్మమునందు మనస్సును, మనోవృత్తియు లయ మగుటనే అసంప్రజ్ఞాత సమాధి యనుచున్నారు. ఇదే కైవ

ల్యము, నిర్వాణము, సూతము, నిశ్శ్రేయసము, అపవర్గము అని చెప్పఁబడుచున్నది. ఇదే బ్రహ్మవాదుల సిద్ధాంతము.

మనస్సు కేవలము ప్రాకృతవస్తువేయనియు, ఇది లోకరచనపై ఆలోచనలను చేయుచునే యుండుననియు, మనస్సు ముఖ్యముగ నిష్క్రియమొనరించుకొనవలెను. మన గురువులును, పెద్దలును మనయందుంచిన దయకుఁగల అపారమగు అనుగ్రహముచే మన శాస్త్రగ్రంథములననుసరించి మనకొఱకు ఏర్పరచిన సర్వజనసౌభాగ్యకరమగు శిష్టాప్రణాళికను మనమనస్సులెట్టి కోతి చిందులు వేయకుండ మనము జాగ్రతగఁ జూచుకొనుచుండవలెను. మనకు వారు చూపెడి మార్గము ఎంతమాత్రమును క్రొత్తమార్గము కాదు. అనేకులు ఆ మార్గమును బట్టిపోయి తమ చరమ ప్రయోజనమును సాధించుకొనిరి. ఇంతేకాక మఱియొక క్రొత్తమార్గమును నిర్మించుటకు మనకు అవకాశమే లేదు. ప్రాతమార్గమే మనకు సురక్షితమగు మార్గము. "మహాజనో యేన గతస్సపంథాః" అనునది ఋషివాక్యము. మన పెద్దలవాక్యములే మనకు శరణ్యములు; మన పెద్దల అనుభవమే మనకు వజ్రకవచము. కావున మనము వారిమార్గమును బట్టియే అతి జాగరూకతతోఁ బోవలసియుండును. ఏమన, ప్రమాదవశముచేనైనను మన యడుగులు ఒకింత దారితప్పి అటునిటు పడినచో అవి మనల పంకమందే పడుచున్నవి. దానియందుఁ జాఱిపడినవాఁడు

మజల లేచు టెక్కడ? పౌత్తలికతను తల్లి ఈపసనః పిం చమే కదా?

అవతారకాలమందు శబరి విభీషణ భీష్మార్జున ప్రముఖు లగు యథార్థ భక్తుల ప్రేమ నేత్రములకు భగవంతుని ఏనామ రూపములు గోచరించెనో, భక్తియోగము నాశ్రయించిన వ్యాసుడు మున్నగు మహర్షులకుఁ గలిగిన సహజ సమాధి యందు వారలు ఏ పూర్ణపురుషుని నామ రూప గుణ లీలా పరికర వైశిష్ట్యమును దమ చిన్మయ నేత్రములచేఁ జూచిరో, ఆ నామరూపముల ననుసరించియే భగవత్సం బంధములగు శ్రీ విగ్రహములు నిర్మింపబడినవి. కావున శ్రీ విగ్రహములు భగవంతుని ప్రతిమూర్తులే అగుచు భగవంతుని సర్వాంగ సౌందర్యమును నిర్దేశించుచున్నవి. కావున శ్రీ విగ్రహారాధనము సర్వజనులకును అవశ్యా చరణీయమగుచున్నది. భగవద్దర్శనము చేసినవారు తన్నామ రూపాదులను ప్రకృతిసీమయందు యథాదృష్టములుగ నెల కొల్పి పూజించుట శ్రీ విగ్రహారాధనమగుచుండ భగవ ద్దర్శనమును ఎన్నఁడును జేయనివారు భగవంతుని రూప మిట్లుండవచ్చునని తమ మనస్సుచే నూహించి నిర్మించిన బొమ్మలను బూజించుట పౌత్తలికత అగుచున్నది. వీనిలో శ్రీ విగ్రహారాధనము ఆత్మకు సంబంధించిన దగుటచే

# దేవునిఁ దెలిసికొనుటెట్లు ?



సత్యాన్వేషణమునకు అనాదినుండియు రెండుమార్గములు గలవు. అవరోహపంథ మొదటిది. రెండవది అధిరోహపంథ. కారణమునుబట్టి కార్యమును ఊహించునది మొదటిది. కార్యమును బట్టి తర్కమార్గమునఁ గారణము నరయుంగునది రెండవది. రెండవదానికిఁ దర్కపంథ అనెడి మఱియొక పేరు గలదు.

అవరోహపంథ (Divine-descent-method) యందు దుర్జ్ఞేయమును, ఆదికారణ రూపమును అగు అద్వయజ్ఞాన తత్త్వమునకు సంబంధించిన జ్ఞానము ననుసరించి ప్రత్యక్షవస్తు జ్ఞానము సాధింపఁ బడుచున్నది. రెండవదగు ఆరోహ (అధిరోహ) పంథ (Ascending or argumentative method) యందు ప్రత్యక్షవస్తుజ్ఞానము ననుసరించి పరోక్ష వస్తుజ్ఞానము అన్వేషింపఁబడుచున్నది. భగవంతుఁడు సర్వమునకును ప్రభువని తెలిసినవారును, వానియందును, వాని పారిషదులందును, విశ్వాసము గలవారును, భగవదిచ్ఛయు, భగవదనుగ్రహమును, దమకు భగవద్జ్ఞానము కలుగుటకుఁ బ్రధాన సాధనములను నమ్మకము గలవారును, అవరోహపంథకు సంబంధించినవారు. వారి మార్గమునకు భక్తిమార్గమనియే

పేరు, ప్రసిద్ధ మతములగు హిందూమతము, మహమ్మదీయ మతము, క్రైస్తవమతము అను మూడుమతములును, దాని సాధ్యవస్తువును గూర్చిన స్వల్పపు భేదము తమలోగొన్నాము కలిగియున్నను తత్వము నిర్ణయమునకు భక్తిమార్గమునే అవలంబించుచున్నారు.

అద్వైతులు (తర్క) పంథకు సంబంధించిన వారు స్వయంకృషిచేతనే జ్ఞానసంపాదన ప్రయత్నమొనరింతురు. వారు భగవంతుని విశ్వాంతర్యామిత్వమునంగీకరింపరు. తమస్వానుభవమునే వారు నమ్ముదురు. ఆంగ్లేయభాషా పరిచయము గలవారు వీరిని "ఎంపిరిసిస్ట్స్" (Empiricists) లేక "ఎలివేష నిస్ట్స్" (Elevationists) అని చెప్పుదురు. ఈ పరేశ్వరవిశ్వాసము గల కర్మిష్ఠులు, జ్ఞానులు, యోగులు మాత్రమేకాక ఈశ్వర విశ్వాసరహితులగు చార్వాకుడు, ఎపిక్యూరస్ (Epicurus) మున్నగువారు కూడ అధ్యక్షజ (ఇంద్రియజన్య) జ్ఞాన సంపన్నులే (Elevationists). ఈమూడును గలవారును తమతమ అవసరములను బట్టి ఆయాసమయములందు, దసరా, పంచ దేవతోపాసనాది సమయములందు భక్తిప్రకటనము కొంత అభినయించినను అది యథార్థభక్తి కాదనువిషయము మనము ముఖ్యముగ జ్ఞప్తియందుంచుకొనవలెను.

యోగ, కర్మ, జ్ఞానమార్గములలో జ్ఞానమార్గము తర్కశాస్త్రముపై ఆధారపడి యుండునది. ఈమార్గము

ననుసరించువారు ''నేతి నేతి'' (ఇదికాదిది కాదను) ప్రక్రియంతోఁగూడుకొన్న తర్కముననుసరించి వస్తుసిద్ధాంతము సేయుదురు. నిర్గుణబ్రహ్మమే వారల సత్యవస్తువు. జీవుఁడు యథార్థముగ బ్రహ్మమే. కావున వీరుసోహంవాదులన బడుచున్నారు. ఇట్టివారు మహమ్మదీయ మతమునఁగూడఁ గలరు. ''అనల్‌హఖ్'' (నేనే దేవుఁడను) స్థితిని, అనఁగా భగవదైక్యమును వారు గోరుచుందురు. వారలకు సూఫీ (Sufi) లని పేరు.

సోహంవాదుల వాదము ఈవిధముగ నుండును :—
''జీవుఁడు బ్రహ్మమే. బ్రహ్మకంటె అధికుఁడు కాఁడు; తక్కువ వాఁడుగాఁడు. తాను బ్రహ్మయని తనకుఁ దెలియక పోవుటకు మాయయే కారణమగుచున్నది. ఈమాయ (1.) అంతరస్థము (Intrinsic) (2) బాహ్యము (Extrinsic) అని రెండువిధములు. ఒకఁడు త్రాడుచూచి పాము అను భ్రాంతి నొందినచో అతఁడు అంతరస్థమగు మాయకు వశుఁడగుచున్నాఁడు. అతఁడు అంతటితో నిలువక ఆపాము ఇంతపొడుగుగ నున్నది, ఇంతలావుగనున్నది, ఇన్నిమలఁకలు గలది, అనుచుఁ జెప్పుటకు మొదలిడినచో అతఁడపుడు బాహ్యమగు మాయకు వశుఁడయ్యెనని చెప్పవలెను. అంతరస్థమగు మాయచేఁ ద్రాడు పాముగఁ జెప్పఁబడినది. బాహ్యమగుమాయచేఁద్రాటియొక్క పొడవు, లావు, మున్నగునవి భ్రాంతికల్పితమగు సర్పమునందు చూడఁబడుచున్నవి.

అంతరస్థమగు మాయ జీవునకు సంబంధించినది. జీవుడు స్వయముగ బ్రహ్మమే. అయినను అనాయకు వశుండై తన బ్రహ్మత్వమును అతడు తెలిసికొనజాలకున్నాడు. అనగా బ్రహ్మకే జీవభ్రాంతి కలుగుచున్నదని అర్థము. బాహ్యమగుమాయ జగత్తునకు సంబంధించినది. దాని ప్రభావముచేతనే జగత్తునందు వివిధ నామరూపములును, విశేషత్వము, అనేకత్వము మున్నగునవి యుండు, సత్యములై కనుపట్టుచుండును. సమస్తపదార్థములును వేనికవి వేఱుగ విశిష్టములైనగుపడుచుండును.

“కాని వజ్రసూచ్యుపనిషత్తు అనెడి తత్త్వము ఎట్లు అంతర్యామిగనున్నదో అట్లే ఒక్కటేయగు ఆత్మతత్త్వము సమస్తమునకు అంతర్యామియగుచు సమస్తనామరూపములను వహించుచున్నది. ఈ నామరూపములను మనము అతిక్రమింపం గలుగుదుమేని మనమే సమస్తమును అగుచు, సమస్తమును మనమే నిండియున్నట్లు తెలిసికొనుచున్నాము.”

అనుభవమాత్రజ్ఞానము సత్యాన్వేషణమందు ఏవిధముగ ఉపయోగించునో మనమిప్పుడు విచారింతము. ఈ కార్యమునందు మన మేధాబలము సమర్థమగునో లేదో అదియుం గూడ జూతము. మనస్సు బహిర్విషయములను ఇంద్రియముల మూలమున గ్రహించుచున్నది. ఈ గ్రహణము ఇంద్రియజ్ఞానము ననుసరించి యుండునుగాని బహిర్విషయ

వాస్తవికత్వమును అనుసరించి యుండదు. దీని యర్థమే మనిన, విషయములు మన యింద్రియములకు ఎట్లు గోచరించుచున్నవో అట్లే వానిని గ్రహించుచున్నాముగాని మనము వానిని ఉన్నవి ఉన్నట్లు గ్రహించుటలేదు. అట్లు గ్రహించుటకుఇంద్రియములకన కారణము కూడ లేదు. కావుననే పాశ్చాత్య శాస్త్రజ్ఞుడగు క్యాంటు (Kant) అను నతడు, "ఇంద్రియముల మూలమున గలిగిన విషయజ్ఞానమును మించిన విషయ జ్ఞానము మనకు బొత్తిగ లేదు. మన యింద్రియములకు గోచరించిన విషయములనే మనము గ్రహించుచున్నాము" అని చెప్పెను.

ఇంద్రియములు పంచభూతములచే నిర్మింపబడినవగుటచే అవి ఆ పంచభూతములనే నిరూపించుచుండునుగాని పంచభూతములను అతిక్రమించి తదతీతమగు వస్తువు వంకకు అవిపోజాలవు; అట్లు పోవుటగూడ వాని పక్షమున అక్రమ పద్ధతియే; కావున విషయములయొక్క వాస్తవతత్త్వముమన బుద్ధికి ఎప్పటికినిదుర్జ్ఞేయమును, దురూహమును అగుచున్నది.

మఱియొక పాశ్చాత్య శాస్త్రజ్ఞుడగు హెర్బర్ట్ స్పెన్సర (Herbert Spencer) రను నతడు కూడ ఇదేవిధమగు అభిప్రాయము కలిగియుండెను. "సమస్త విద్యలకును మూలాధారముగ ఒక తత్త్వము ఉండియే తీఱవలెను. కాని దానిని

ఏవిద్యయు, ఇదమిత్థమని స్థిరపరచుటకుఁ జాలదు" దని గీతాచార్యుఁడు చెప్పెను.

మనకు దృష్టి గోచరము అగుచున్న సృష్టియొక్క వాస్తవతత్త్వమే పైనిఁ జెప్పిన విధముగ మనకు దుర్జ్ఞేయ మగుచున్నప్పుడు మనదృష్టికి అతీతమగు విషయము మన కెట్లు తెలియగలదు ? ఏవిషయముగూర్చి మనము సిద్ధాంతము చేయఁబూనినను దానికిఁ దోడ్పడు తర్కము సహేతుకమై సర్వాంగ సుందరమై యుండవలెను. కాని ఆసిద్ధాంతము జగదతీత విషయమునకు సంబంధించిన దైనప్పుడు ఏహేతువులు దానికిఁ దోడ్పడఁగలవు ? "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసాసహ" అనెడి శ్రుతి వ్యర్థ మెట్లగును ? మన మేధ జగత్తు నంతయు ఒక్కమారుగా గ్రహింపఁగలిగిన గ్రహింపగలిగి యుండునేమో గాని జగదతీతమగు విషయమును అది అంటనైన అంటఁజాలదు. మన మేధాబల మంతయును జగత్తునందుఁ బనికివచ్చునదే కాని జగదతీత విషయముల యందది నిష్ప్రయోజన మగు చున్నది. మేధాబలముగల అనుభవజ్ఞాన విశ్వాసి (Empiricist) జగదతీతుఁడగు భగవంతునిఁ దెలిసికొను టెట్లగును ?

ఇట్టి మహనీయుల కందఱకును గ్రిందవ్రాసిన విధముగ శ్రుతి బుద్ధిచెప్పియే యున్నది.

"నాయమాత్మా ప్రవచనేన లభ్యో
నమేధయా న బహునా శ్రుతేన
యమేవైషవృణుతే తేనలభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ స్వామ్."

"వాగ్వైఖరియు, వైదుష్యమును, శాస్త్రవ్యాఖ్యాన కౌశలమును, భగవంతునిఁబొందింపఁజాలవు. తన్నుఁబొందుటకు ఎవ్వఁడు అర్హుఁడగుచున్నాఁడో అట్టివానికే భగవంతుఁడు తనంతటఁదాను దర్శన మిచ్చుచున్నాఁడు" అని దీనికి సగటున అర్థము చెప్పవచ్చును.

మేధావికి ఏల భగవద్దర్శనము లభింపదు? దీనికుత్తరము పాశ్చాత్య శాస్త్రజ్ఞు లిచ్చినది పైనిఁజెప్పియున్నాను. ఇప్పుడు మనశాస్త్రములు ఇందునుగూర్చి ఏమి చెప్పునో తెలిసికొందము.

నామరూపమయమగు ఈ దృశ్యసృష్టికి అంతర్యామిగ శుద్ధజీవాత్మ తత్త్వము ఒకటి ఉన్నదనుట సర్వజన సమ్మతమగు విషయమే. ఈ జీవుఁడు భగవదంశ తత్త్వమును, భగవంతుఁడు పూర్ణతత్త్వమును అగుచున్నారు. శ్రీకృష్ణుఁడు గీతలయందు,

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" (గీ 15-7)

అని చెప్పియున్నాఁడు "జీవులు నా అంశములు. కావున వారందఱును సనాతనులు (నిత్యులు)" అని దీనికి సరళార్థము. "జీవులు నాఆజ్ఞ (సంకల్పము) నుండి పుట్టినారు. వారిని

కాఁడు. సర్వశక్తిమంతుఁడగు భగవంతునిపై మాయాశక్తి యెట్టి అధికారమును జూపఁజాలదు. అతఁడు సర్వాతీతుఁడు; కేవల సత్యస్వరూపుఁడు; మాయాధీశుఁడు.

భక్తాచార్యుల సిద్ధాంతము ననుసరించి మాయ అనునది భగవంతుని అపరాప్రకృతి (Material aspect) కాని జ్ఞానమార్గావలంబులగు బ్రహ్మవాదులు చెప్పునట్లు భ్రాంతి మాత్రము కాదు. ఈ అపరాప్రకృతి భూమి, జలము, నీరు, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అనుచు ఎనిమిది విధములగు భూతములగుచున్నది. ఇవియే జగత్ సృష్టికిఁ గారణములు.

భగవత్తత్త్వము వలె జీవతత్త్వముగూడఁ జిన్మయతత్త్వముగుటచే మాయ దానియందు లేకున్నను జీవుని బద్ధావస్థయందు భగవదిచ్ఛ ననుసరించి మాయ జీవునిపై గొంత అధికారముఁ జూపును. ఆకారణముచేఁ జిన్మయుఁడగు జీవునకు మాయామయములగు రెండు శరీరములు కలుగుచున్నవి. అందులో ఒకదానిని సూక్ష్మశరీర మందురు. అది మనోబుద్ధ్యహంకారమయము. రెండవదాని పేరు స్థూల శరీరము. అది పృథివ్యాపస్తేజో వాయు రాకాశ మయము. ఈ రెండు శరీరముల సమష్టియే అపరా ప్రకృతి.

జీవుఁడు తన స్వభావము చేతనే భగవదధీనుఁడు. భగవద్దాస్యమే అతని సహజ ధర్మము. కాని భగవంతునికి

వలెనే జీవునికిగూడ స్వేచ్ఛాప్రవృత్తి (Freewill) కలదు. కాని స్వేచ్ఛాప్రవృత్తి అనవసరముగ ఉపయోగించినచో వలసినను భగవద్దాస్యరూపమగు తన స్వధర్మమును తాను మఱవరాదు. దానిని సదా జ్ఞాపకముతో పాలించుచునే యుండును. కాని తన స్వేచ్ఛాప్రవృత్తికి అపరిమితి సంభవించినచో జీవుడు సమస్త విషయములను తన భోగముకొరకే యగుచున్నవని భావించి స్వభోక్తయగు భగవంతునికి తద్విషయము లర్పింపకుండ వాని నన్నింటిని తానే అనుభవించి తాను భోగి లేక విషయి అగుచున్నాడు. ఈవిధముగ అతడు తన స్వధర్మమును మఱచుచున్నాడు. అప్పుడు జీవుడు సంసారమను చెఱసాల యందుబడి దాని కధికర్త్రి యగు మాయాదేవిచే ఎడతెగని పీడన మొందుచుండును. తనకు ప్రభువగు భగవంతుని యాజ్ఞ ననుసరించి మాయాదేవి శుద్ధచిన్మయుడగు ఆ జీవునకు స్థూల సూక్ష్మ రూపములగు పైని చెప్పిన రెండు శరీరముల నిచ్చి అతనిని సదా తన అధీనమందుంచుకొని అతని స్వధర్మమును అతడు పూర్తిగ మఱచునట్లొనర్చును.

ఈవిధముగ జీవుడు తన స్వరూపమును, స్వధర్మమును గూడ మఱచి తనకు ఉపాధిమాత్రములగు స్థూల సూక్ష్మ శరీరములతోడ తాదాత్మ్యము వహించి తనను ఒకప్పుడు హిందువునిగను, ఒకప్పుడు మహమ్మదీయునిగను, ఒకప్పుడు పురుషునిగను, ఒకప్పుడు స్త్రీనిగను, ఒకప్పుడు

వృక్షముగను, ఒకప్పుడు క్షుద్రజంతువుగను, భావించుకొను చుండును. ఈ తాదాత్మ్యమునకు అంతమే లేదు. ఇవ్విధముగఁ దన్నుగూర్చి భావించుకొనుటయేగాక తనకంటఁబడెడి ప్రతివస్తువును గూర్చియు, ఇట్టిభావనతో గలిగియుండును. ఏవిషయముయొక్క వాస్తవతత్త్వమునైనను గ్రహింపఁగల సమర్థత అతనికప్పుడుండనే ఉండదు. ప్రతివిషయమును దన భోగముకొఱకే ఉన్నదనుకొనునుగాని అది, సమస్తవిషయములకును ప్రభువగు భగవంతునికి సంబంధించిన వస్తువుగఁ దాను గ్రహింపఁజాలఁడు.

ఇట్టి అసంబద్ధ తాదాత్మ్యకారణముచే జీవునికిఁ గలిగెడి కృత్రిమజీవనమువలన ఆత్మానాత్మలకును, జడచిత్తులకును, సత్యాసత్యములకును గల శాశ్వతభేదము జీవుఁడు గ్రహింపఁజాలకున్నాఁడు. జీవుఁడు సహజముగ శుద్ధుఁడును, శాశ్వతుఁడును అయ్యును దాను ఇపుడు జననమరణములు గలవానిగ భావించుకొనును. జీవుఁడుజననమరణరహితుఁడు. చావుపుట్టుకలు అతనిశరీరములకేకాని అతనికిఁ గలుగవు. కాని ఈ కృత్రిమజీవనముఅలవడినప్పుడుజీవుఁడుతానేపుట్టువాఁడనియు, దానేమరణించువాఁడనియు చెప్పుకొనును. పరువెత్తి పోవుచున్నరైలుబండిలో సుఖముగ గూర్చుండిన మనుష్యుఁడు పరువెత్తుచున్నాఁడనవచ్చునా? మనుష్యుఁడు కదలువాఁడుకాఁడు. రైలుబండియే కదలుచున్నది. రైలుబండికిఁ గలిగెడి చలనము

దానిలోఁ గూర్చుండిన వానియం దనురాగముండువారు పడవను నెక్కకుండ ఎదురుగ నున్నవారలే. బండిలో నున్నవారలతో పాటు మనమున్నంత వఱకు నెక్కించుకొని వారిని నడుపుచున్నాఁ డని మఱచిపోవుచు. దురదృష్టవశముగ నీ మనము మన స్వధర్మములను మఱల నెప్పుడు పోగొట్టుకొన్నామో యప్పుడు శాస్త్రోక్త ధర్మము మనలను బాగుగ పడవేయుచున్నది. ఆత్మమానవుల నుద్ధరింపఁ బనిచేయు శాస్త్రోపదిష్టమతమును, ప్రాపంచిక కష్టములు సహించుటను సంభావించుచున్నది.

కాని జీవునిఁ గ్రమ్మిన యీమనమందు సంకల్పవికల్పములు చేయునట్టి వ్యక్తికిఁ బేరేమి? మనస్సు అనియే చెప్పవలెను. ఈమనస్సే కాంతా కనక ప్రతిష్ఠలను సదా కోరుచుండును. విషయములు తన్ను ఎటు లాగుచుండిన ఆవంకకే అది పోవు చుండునుగాన దానికి నిశ్చలత్వము సున్న. మసిబొగ్గును దెలుపు చేయుట ఎంతకష్టమో మనస్సుయొక్క సహజ చంచలత్వ మును వదలించి దానికి నిశ్చలత్వము కలిగించుట అంత కష్టము. ఏమన, ఈమనస్సుకూడ మాయావికారమే కావున మాయను అతిక్రమించు శక్తి దానియందు లేదు. మనస్సును బట్టుకొని సంసార సముద్రమును దరింపఁగోరువారు మొసలి వీఁపుపై నెక్కి నదీప్రవాహమును దాఁటఁ గోరువారే. దేవునిఁ దెలిసికొనుటకు మనస్సు ఎంతమాత్రమును ఉపయో గించునదికాదు. అట్టి ప్రయత్నమందు దాని సాయముగోరుట

కుండ అక్రమమే. మోక్షమునకలిగి దాని వారికిఁ జిక్కకుండ ఆత్మను రక్షించుటే కర్తవ్యము.

దేవుని నెట్లు తెలిసికొనఁజాలమో ఇంతవఱకు విచారించితిమి. దేవునిఁ దెలిసికొనుట ఎట్లో ఇప్పుడు విచారింతము. భగవద్దాస్య సంబంధమగు మన స్వరూప లక్షణమును మనమెప్పుడు తెలిసికొనుచున్నామో, అప్పుడే మనము భగవంతునిఁ దెలిసికొనుచున్నాము. భగవంతునిఁ దెలిసికొనుటన్నను, ఆత్మను దెలిసికొనుటన్నను ఒక్కటియే.

భగవదనుభవము విషయమై హిందూ మహమ్మదీయ క్రైస్తవమతములకు సంబంధించిన సిద్ధాంతగ్రంథములందు ఏమి చెప్పబడెనో ఇప్పుడు చూతము—

ముందుగ మనము, క్రైస్తవ మతగ్రంథమగు బైబిలు నెత్తికొని అందు దేవుని పుత్రుఁడగు క్రీస్తుప్రభువు ఏమి చెప్పెనో తెలిసికొందము. క్రీస్తుప్రభువు ఒకప్పుడు,

"అడుగుము; నీకు అది తప్పక ఈయఁబడును. వెదకుము; నీవు దానిని తప్పకపొందగలవు. తట్టుము; నీకు అది వెంటనే తెఱవఁబడును" అని చెప్పెను. (St. Matthew VII-7.) కాని నిత్యలోక ద్వారము తెఱవఁబడునట్లు మనము తట్టఁ గలుగుట ఎట్లు? దీనికి అతఁడే ఇట్లు సదుత్తరమిచ్చెను.

"నా తండ్రివి అగు సమస్త పదార్థములును నా అధీన ములు చేయబడినవి. కుమారుని దండ్రియే తప్ప మనుష్యుఁ

డెవ్వఁడును తెలిసికొనఁడు. తెలిసికొనఁ బ్రయత్నించినను కొడుకును దప్ప దండ్రి నెవ్వఁడును ఎఱుంగజాలఁడు. తండ్రిని జూడదలఁచిన నెవ్వఁడైనఁ గోరినచో కుమారుఁడే అతనినిఁ జూపఁగలఁడు." (St. Matthew XI-27)

అతఁడే మఱియొకచోట ఈవిధముగఁ జెప్పెను. "నన్ను ఎవ్వఁడాదరించునో అతఁడు నన్నుఁబంపినవానిని ఆదరించినట్లే. కావున ఎవ్వఁడు ఇతరులకు నన్నురక్షకునిగఁ గనఁబఱచునో, అతనిని నేను నిత్యలోకమందున్న నాతండ్రి యొక్క అనుగ్రహమునకుఁ బాత్రునిగ జేయుచున్నాను. (St. Matthew XI-32)

పైవన్నిఁటిని బట్టి యాలోచించి చూడఁగా వేఱొకని సాయములేకుండ మనము దేవునిఁ దెలిసికొనఁ జాలమని స్పష్టపడుచున్నది. వేఱొకఁడు ఎవ్వఁడనిన, మాయాబంధము లేని ముక్తపురుషుఁ డనియే తెలియవలెను. ఏమన, మాయా బంధముగలవాఁడు ఇతరుల మాయాబంధమును ఎట్లు తొలగింపఁగలఁడు? బద్ధజీవులను గురువులుగ అంగీకరించిన వారినిఁ క్రీస్తుప్రభువు చాల నిరసించెను. తన ఉపదేశములు తమకుఁ గిట్టకుండుటచేఁ దనయెడలఁ గోపముతోనున్న ఫారిసీ (Pharisee) లను వారలఁగూర్చి తన శిష్యులతో ఒకప్పుడు అతఁడిట్లని చెప్పెను.

“వారలను అట్లేవిడువుఁడు. గ్రుడ్డివారలకు గ్రుడ్డివారలే దారిఁజూపుచున్నారు. ఇరువురును గ్రుడ్డివారలే అగుటచేఁ ఇరువురుకూడఁ గూపమునఁబడుదురు (St. Matthew XV-14.)

కాని అట్టిముక్తపురుషుఁడగు గురువును అనుసరించు టెట్లు? అట్టి అనుసరణమునకు శిష్యునకుఁ గావలసిన సాధన సంపత్తియేమి? ఇందు విషయమై క్రీస్తుప్రభువు చెప్పిన వాక్యములు తేటతెల్లముగ నున్నవి. వానిని ఈక్రిందఁ బొందు పఱుచుచున్నాను.

“శిష్యుఁడు గురువునకు పైవాఁడు కాఁడు. సేవకుఁడు తన యజమానునికిఁ పైవాఁడు కాఁడు. గురువు వర్తించినట్లు శిష్యుఁడు వర్తించినఁజాలును. యజమానుఁడు వర్తించినట్లు సేవకుఁడు వర్తించినఁ జాలును.” (St. Matthew. X-24.)

“నన్ను అనుసరించువాఁడు స్వార్థత్యాగమొనర్చి నా వెంటరావలయును. ఆత్మార్థమై నెవఁడు జీవించునో, అట్టివాని జీవనము వ్యర్థము. ఎవఁడు నాకొఱకు జీవించునో వాని మనుగడ సార్థకము.” (St. Matthew. XVI-24&25)

“నన్నుమాని తన తండ్రినిగాని, తల్లినిగాని అధికముగ ప్రేమించువాఁడు నన్ను అనుసరించుటకు అర్హుఁడు కాఁడు. కుమారునిఁగాని, కొమార్తెనుగాని అధికముగఁ ప్రేమించు వాఁడు నన్ను అనుసరించుటకు అర్హుఁడు కాఁడు.’ (St. Matthew XI—37).

ఒకానొక నూతన శిష్యునితోఁ గ్రీస్తుప్రభువు చెప్పిన వాక్యములు ఈవిషయమును ఇంకను స్పష్టపఱచుచున్నవి. ధనికుఁడైన ఆ నూతనశిష్యుఁడు అతనితో, "ప్రభూ! నాకు నిత్యలోకవాసము రావలయునని నేను ఏసత్కార్యమును జేయవలసి యుండును?" అని అడిగెను. అందు కతఁడు, "నాయుపదేశసూత్రము (Commandments) లను పాటింపుము" అని బదులుచెప్పెను. అందుపై ఆ నూతనశిష్యుఁడు, "నా చిన్నప్పటినుండియు వాని నన్నిఁటిని పాలించుచునే యున్నాను. ఇంకను నేను జేయవలసిన దేమి?" అనెను. అప్పుడు క్రీస్తు ప్రభువు "నీజీవనము సిద్ధము గావలయునని కోరుదువేని, పోయి నీకున్నదంతయు అమ్మివేసి అది బీదల కిచ్చివేయుము. నిత్యలోకమున నీకుఁ బెన్నిధి దొరకఁగలదు. రమ్ము. నన్ను అనుగమించుము" అని చెప్పెను. (St. Luke-XVIII 18 to 22)

క్రీస్తు ప్రభువుయొక్క శిష్యులుగూడ ఇదే విధముగ బోధించిరి—

పౌలు (Paul) అను నతఁడు అథేన్సు (Athens) పట్టణపుఁ బ్రజలు భగవద్ జ్ఞానములేకుండ భగవదారాధనము సేయుచుండుటచూచి వారితో "అథేన్సువాసులారా! మీకు అన్నివిషయములందును బిచ్చినమ్మకము గలదు. నేనొకసారి మీ పూజావిధానములను గనిపెట్టుచుండ ఒక పూజాపీఠముపై "ఎవ్వరెఱుఁగని దేవునకు" అనుచుఁ గొన్ని అక్షరములు

నాకుఁ గనఁబడినవి. దేవుని నెవ్వరును ఎఱుఁగజాలరని కదా మీ యభిప్రాయము? కావున ఏ దేవుని మీరు గ్రుడ్డిగఁ బూజించుచున్నారో ఆ దేవుని మీకు నేను వివరింప గలను" అని చెప్పెను (The Acts XVII—22 & 23).

జాన్ అను నతఁడు తాను వ్రాసిన మొదటి సందేశ (Epistle) మందు, "ప్రపంచమును జూచిగాని, ప్రపంచమునందలి వస్తువులను జూచి కాని మోహపడకుము. ప్రపంచమందు మోహము గలవానికిఁ దండ్రియందు ప్రేమ ఉండదు (II John-15). ఏమన, ప్రపంచమునందలి ప్రతివిషయమును, అనఁగా శరీరసంబంధ మోహము, నేత్రసంబంధమోహము, తనకుఁగల పదవినిఁ దలఁచుకొని విఱ్ఱవీఁగుట మున్నగునవన్నియుఁ బ్రపంచమునకు సంబంధించిన వే కాని తండ్రికి సంబంధించినవి కావు. ప్రపంచము నశ్వరమైనది. దాని సంబంధమగు మోహముకూడ అట్టిదే. కాని దేవుని సంకల్పమును నెరవేర్చుచుండువాఁడు మాత్రము శాశ్వతస్థానము నొందును (II John-16 & 17). భగవంతుని యందే సదా యుండువానికిఁ బాపము కలుగదు. పాపము సేయువాఁడు దేవునిఁ జూచుటయు లేదు. తెలిసికొనుటయు లేదు." అని చెప్పెను (III John-6).

బైబిలుకు సంబంధించిన ఇట్టి వాక్యములు మహమ్మదీయులకుఁ బ్రధాన మతగ్రంథమగు ఖొరానునందుఁ గూడ గలవు. వానిలోఁ గొన్నింటిని ఇచ్చట వివరించుటయే కాక

తన్నతావలంబులగు కొందరికి సువార్తమానములనుగూర్చి తెలుపు చున్నాను.

"జాలిక, ఫజలుల్లాహి, యూతీహి, మయ్యషాఉ"

దీనియర్థమేమనగా, "ఈ జ్ఞానము (భగవంతుని జ్ఞానము) దేవునిదయను అనుసరించియే కలుగుచున్నది దేవునికిఎవడు ఇష్టుడో వానికే అతడు ఈ జ్ఞానము నిచ్చును."

"వమైయుతి ఇల్లాహా. వరసూలహూ, ఫఖద ఫాజ ఫౌజన అజీమా."

దీని యర్థమేమనగా "దేవుని ఆజ్ఞలను పాలించు వాడును, దేవుని వాక్యములు పలుకువానిని అనుగమించు వాడును పరమ శ్రేయస్సును పొందుచున్నాడు."

"వమైం, యత్తఖిజిష, షైతాన వలీయం,
మిందూనిల్లాహి, ఫఖద ఖుసిర ఖుసరానం, మబీన"

దీని యర్థమేమనిన, "అల్లానువిడిచి సైతాను ననుగ మించువాడు స్పష్టముగ నష్టపోవును."

"యాయుబసా ఇబ్లీసి ఆ ఆదమి రూయి హస్తి
పంచ బహార్ దస్తిన బాయిద్ బె హర్ దస్తి"

దీని యర్థమేమనిన "(ప్రపంచమున) లెక్కలేని సైతాను లు మనుష్యరూపములతో తిరుగుచున్నారు. కావున అనా లోచితముగ నీవు ఎవరినిబడితే వారిని గురువుగ వరింపకుము.

ఇక మన శాస్త్రములను పరిశోధించినచో ఈ

వాక్యములే యింతకంటె విపులముగాఁ గూడఁ గనుపట్టు చున్నవి.

గీతలయందు శ్రీకృష్ణుఁడు యిట్లు చెప్పెను:—

శ్లో. దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే. (గీ.7-14)

దీనియర్థమేమనిన "దైవికమగు నామాయదాఁటుట శక్యముకానిది నాయందు ఎవరికి భక్తి కలదో, వారే దానిని దాఁటగలరు."

మనము భగవంతుని మఱచినను భగవంతుఁడు మనలను మఱచువాఁడుకాఁడు. అతనికి మనయందు అపారమగు ప్రేమ కలిగియుండుటచే తెలిసిని మనము తెలిసికొనుమార్గము తన పారిషదుల మూలముగను, తన ఆచార్యులమూలముగను, మనకు బోధించుచున్నాఁడు. "భగవంతునకిఁ బ్రపంచమునందు గల ప్రేమ ఎంతటిదనిన, తనయందు విశ్వాసముగలవారికిఁ బ్రకృత బంధరూప మరణము పొందక రక్షించి అప్రాకృతమగు శాశ్వత జీవనము నిచ్చుటకై తన ఒక్కఁడగు కుమారునే పంపించియున్నాఁడు." అని బైబిలునందు చెప్పియున్నది **(St. John III—16.)**. మహాభారతమందు ధర్మదేవత కొంగ రూపమునవచ్చి యుధిష్ఠిరు నడిగినప్పుడు అతఁడు "మహాజనో యేన గతస్సపంథా" అని ఉత్తరమిచ్చియున్నాఁడు. ఇట్లనుటచే భగవత్పారిషదులగు మహాసీయులే భగవంతునిఁ దెలిసినవా

రనియు, వారలు పోవునమార్గమే భగవంతుని దెలిసి కొనుటకు మార్గమనియు అర్థము.

ఆచార్యులే మానవరూపము వహించిన దివ్యపురుషులు. మనకు దారిచూపుటకే వారు అవతరించుచున్నారు. తమపాద ధూళిచే లోకమునంతయుఁ బవిత్రముసేయుచు మానవకోటి నుద్ధరించుటయే వారలకేనల ముఖ్యాభిప్రాయము. కావుననే సర్వశాస్త్ర శిరోమణి యగు శ్రీమద్భాగవత మందు భగవంతుడు ఇట్లని చెప్పెను.

శ్లో॥ ఆచార్యం మాం విజానీయా న్నావ మన్యేత కర్హిచిత్
న మర్త్యబుద్ధ్యా సూయేత సర్వ దేవమయో గురుః ''

దీని యర్థమేమనిన, "ఆచార్యుని నన్నుగా నెఱుంగుము. వాని నెప్పుడును గొంచెపు దృష్టితోఁ జూడకుము. వానిని మనుష్యునిగా భావింపకుము. ఏమన: గురువు సర్వదేవ మయుఁడు.''

కాని యిట్టి గురువు మనకు ఎట్లు లభించును? దీనికి ఉత్తరము భక్తాచార్యు లిట్లు చెప్పియున్నారు.

"గొప్పకులమందుఁ బుట్టినను, సమస్త యజ్ఞదీక్షలను బొందినవాఁడైనను వేదశాస్త్రములు చదివిన వాఁడైనను భగవద్భక్తుఁడు కానిచో గురుపదమునకు ఎవ్వఁడును అర్హుఁడు కాఁడు''

ఏమన, భక్తుఁడే భగవంతుని నెఱింగినవాఁడు; భక్తుఁడే భగవంతుని సర్వమునకును ప్రభువుగ భావించువాఁడు. భగ

వంతుడు కూడ అట్టివానియందు పరమప్రేమ గలిగి వానిని క్రమముగఁ దన పారిషదునిగఁ జేసికొనును. జగద్గురువగు శ్రీగౌరసుందరుఁడు కూడ గురుని లక్షణములు ఈ క్రిందఁ జెప్పిన విధముగ వివరించెను.

"కివా విప్ర కివాన్యాసీ శూద్ర కేనే నయ
యె ఇ కృష్ణతత్త్వవేత్తా సె ఇ గురుహోయ"

దీని యర్థమేమనిన, "భగవత్తత్త్వమందలి సూక్ష్మాతిసూక్ష్మములు తెలిసినవాఁడే గురువు. అతఁడు బ్రాహ్మణుఁడే కావచ్చును, సన్యాసియే కావచ్చును, శూద్రుఁడే కావచ్చును."

కాఁబట్టి అట్టిభక్తులను గురువులుగ స్వీకరించిన వారికే నిశ్శ్రేయస పదము లభించుచున్నది. అభక్తులగు గురువులను వరించినవారికిఁ దుదకు అనర్థమే కలుగుచున్నది. ఏమన, వారల మూలమునఁ దమ జీవధర్మము తమప్రాణావసాన కాలముననుసైతము తేటపడకుండుటయే కాక మీఁదు మిక్కిలి జీవసంబంధజ్ఞానము వెనుకఁబడుటచే వారలకు దుఃఖమే కలిగి తుదకు సద్గురూపదేశము లభించినపుడు తమ గతజీవితమెల్ల వ్యర్థమయ్యెనే అను కించ వారిని విడువకుండును.

జీవధర్మము మఱల ఉద్ధరింపఁబడుటకు ఇతరుల సాయము అంత అవసరమా? మానవుఁడు మున్ను దాఁ బోఁగొట్టుకొన్నది తన స్వప్రయత్నముచే మఱల సంపాదించ లేఁడా? అని యెవరైన అడుగవచ్చును. అట్లు సంపాదించ

లేడని యింతకు ముందే చెప్పియుంటిని. గురుసాహాయ్యము అత్యంతావశ్యకము. కావుననే శ్రీమద్భాగవతమందు యిట్లు చెప్పఁబడినది.

"అనాద్యవిద్యాయుక్తస్య పురుషస్యాత్మవేదనమ్,
స్వతో నసంభవేదన్యస్తత్త్వజ్ఞో జ్ఞానదో భవేత్"

దీని యర్థమేమనిన, "అనాదియగు అజ్ఞానము చేఁగప్పఁబడిన పురుషునకు ఆత్మజ్ఞానము జ్ఞానవంతులగు పురుషులవలనఁ గలుగు నదేకాని తన స్వప్రయత్నముచేఁ గలుగునదికాదు."

ఇఁకను అట్టువంటి గురువులను ఎట్టివారు అనువర్తింతురో, ఎట్టివారు అనువర్తింపరో మనము తెలిసికొనవలసి యున్నది.

ప్రపంచమందు దేవ సృష్టియనియు, అసుర సృష్టి యనియు రెండువిధములగు మానవసృష్టి గలదు. భగవంతుని ఆరాధించువారు దేవతలు; భగవంతుని ఆరాధింపని వారు అసురులు" అని పద్మపురాణమునందుఁ జెప్పఁబడినది.

బైబిలులో ఈ రెండు తెగలనే "దేవుని బిడ్డ"లనియు, "సైతానుబిడ్డ"లనియు చెప్పిరి. ఆవాక్యములు ఇచట వ్రాయుచున్నాను—

"దీనియందు (ప్రపంచమందు) దేవుని బిడ్డలును, సైతాను బిడ్డలునుగూడఁ గనఁబడుచున్నారు. సత్క్రియవర్తనము

లేనివాఁడును, దన సోదరునిఁ బ్రేమించనివాఁడును దేవుని బిడ్డఁడు కాఁడు." (I John III—10)

దేవుని బిడ్డలగు దేవతలు దేవునిఁ దెలిసికొనవలయు నను బుద్ధికలవారగుటచే గురుసాహాయ్యమునుగోరుచుందురు. రక్కసి బిడ్డలగు అసురులు దేవుని పూజించువారు కారు గనుక వారలకు గురువుతోఁ బనిలేదు; గుర్వావశ్యకతను గూర్చి మనము వారలయెదుట ముచ్చటించినచో వారలు మనలనుజూచి నవ్వి మనలను అవమానము కూడఁ జేయుదురు.

శ్రీమద్భాగవతమందు అసురుఁడగు హిరణ్యకశ్యపుఁడు పరమభాగవతుఁడగు తన కుమారుని ప్రహ్లాదుని దండింపఁబోవు చున్నప్పుడు ప్రహ్లాదుఁ డిట్లనెను.

"అసన్మార్గ వర్తనులును, కాంతా కనక ప్రతిష్ఠా లోలుపులును అగువారు భగవత్సేవనము అను వైష్ణవ ధర్మమును ఎన్నఁడును తెలిసికొనఁజాలరు. గ్రుడ్డివారిచే దారి చూపఁబడిన గ్రుడ్డివారివలె వారలు తప్పుడు మార్గమునఁ బడి మాయా పాశములచే మఱింత మఱింత గట్టిగ బిగింపఁబడు చున్నారు."

కావున భగవంతునిఁ దెలిసికొనుటకు భక్తిమార్గమే మార్గము. మాయాజాలము లందు జిక్కుకొనిన జీవ పక్షులకు ఇది యొక్కటియే మార్గము, కర్మమార్గము, యోగ

బారిషదుఁడుగను, దాసుఁడుగను ఉండి అతనిని నిరంతరము సేవించుచుండును.

కాను ఈలోకమందుండఁగా జీవుఁడు భగవంతునిఁ బ్రత్యక్షముగ సేవింపఁజాలఁడు. కాని భగవత్పారిషదుఁడగు తనగురునకుఁ గపటరహితమగు సేవన మొనరింపఁ గలిగినచో జీవుఁడు మాయకుదూరుఁడై భగవత్సేవనమందు మిగులసమర్థుఁ డగును. "నీవు నన్నూ ఎఱుఁగవు. నాతండ్రినీ ఎఱుఁగవు. నీవు నన్ను ఎఱిఁగియుంటే నాతండ్రిని గూడా ఎఱిఁగిఉందువు" అను బైబిలులోని వాక్యము ఈవిషయమునే చెప్పుచున్నది. (St. John VIII-19.) ఇంతేకాక అతఁడు ఈభూలోకమందే నిత్యలోకసేవనసౌఖ్యములను జవిచూచుచు దేవునిరాజ్యమును భూలోకమున వెలయించిన వాఁడగుచున్నాఁడు. కావుననే జీవుఁడు భూలోకమం దుండఁగనే భగవద్భక్తియు, సద్గురుసేవనమును జేసినచో మాయాజాలములఁ ద్రెంచి భగవద్దాస్యరూపమగు తన స్వధర్మమును మఱలఁబొందఁ గలుగును." అని ఒకానొక భక్తాచార్యుఁడు చెప్పియున్నాఁడు.

మనము కొలిచెడి గురువు భగవద్వాక్యములు పలుకఁగల భగవంతుని ప్రతినిధికానిచో వానికి మనముసేయు దాస్యమంతయు బూడిదలోఁ బోసిన పన్నీరగును. ఏమన, కపటగురుసేవనము వలన గురుసాహాయ్యమువలని ఫలము ఎంతమాత్రమును లభింపనేరదు. ప్రస్తుతము లోకమంతయుఁ

కపటగురువులతో నిండియున్నది. వారిపాలఁబడకుండ మనము అతి జాగరూకతతో మెలఁగవలసి యున్నది.

ప్రసిద్ధ మతములగు హిందూమహమ్మదీయ క్రైస్తవ మతములకు సంబంధించిన ప్రధానగ్రంథములందుఁ గననగు వాక్యరత్నములను, భిన్నభిన్నకాలము లందును భిన్నభిన్న దేశములందును నివసించి యుండిన ఆయా మతాచార్యుల నోట వెలువడిన వాక్యరత్నములను, బైనిఁజెప్పిన విధముగ మనము నిష్పాక్షికముగ విచారించిన పైని భక్తిమార్గ మొక్కటియే భగవంతునిఁ దెలిసికొనుటకు మార్గమని మనకు స్పష్టపడుచున్నది. భగవత్కృపచే మనకుఁ దన్మార్గవర్తియగు సద్గురువు దొరకినచో మన జీవితము చరితార్థత నొందుననుటకు సందేహమే లేదు.



# దేవుని బ్రేమించు టెట్లు?



"దేవునిపై నీహృదయమంతయుఁ జేర్చి అతనినిఁ బ్రే మింపుము; నీమనస్సంతయుఁ జేర్చి ప్రేమింపుము; నీ ఆత్మ నంతయుఁ జేర్చి ప్రేమింపుము; నీశక్తినంతయుఁ జేర్చి ప్రేమిం పుము. మానవుని నీ సోదరునిగ భావింపుము." అను ఈవాక్య ములు మొట్టమొదటఁ క్రీస్తుప్రభువు నోటనుండి వెలువడినవి. (St. Luke X—27) ఈ వాక్యములు సత్యవిషయమునే చెప్పు చున్నవికాని మానవులు తమ ప్రవృత్తి తారతమ్యములను బట్టి వీనికి వేలువేలుఅర్థములను జెప్పుచున్నారు. మహాత్ముల ముఖములనుండి వెలువడిన వాక్యములు అన్నియును సహా త్తరములు, సత్యస్వరూపములు, నిగూఢార్థములు అగు చున్నవి. కాని అవిమనకుఁ జక్కగ బోధపడినపుడు వాని యందలి సత్యము మనకు హృదయంగమ మగును. చక్కగ బోధపడనపుడు అవి భాషావిశేష మాత్రములే అగుచు అస్పష్టపడియుండును. ఇట్టివాక్యములు నిగూఢార్థములగుటకు గారణమేమనిన, అంతర్ముఖులై భగవద్దర్శనలాభము నొందిన మహనీయులు భగవదాజ్ఞారూపములగు ఇట్టి సువాక్యములను దమయందు అంతర్యామిరూపముతోనున్న భగవంతుని వలన వినుటకు అలవాటు పడినవారగుటచే వానిని దాము

వివిధవిధముగనే ప్రకటించెదరు. అవి బహిర్ముఖులగు వారలకు సులభముగ బోధపడునవి కావు. ఈ రెండు పద్ధతులకు ఎట్టి సంబంధమో ఆత్మదృష్టికిని, బహిర్దృష్టికిని అంతటి సంబంధము కలదు.

బద్ధస్థితి యందుండిన జీవాత్మకు వికాసము కలిగెడి మహా భాగ్యము లభించినప్పుడు ఆవికాసము సోపానక్రమముగ సంప్రాప్తించును. చిన్నసోపాన స్థితియందున్నవాని జ్ఞానము, అతనికి పై మెట్టునందుండువానికంతయు అసంపూర్ణముగను, లోపయుక్తముగను ఉన్నట్లు సహజముగ తోచును. సర్వోచ్చసోపానమును చేరువఱకును, ఆత్మవికాసముచేఁ గలుగు జ్ఞానము అసంపూర్ణముగనే యుండును. ఆత్మవాదులగు కొందఱు స్థూలవిషయములు సూక్ష్మతా పరాకాష్ఠ నొందినపుడు ఆత్మరూపము వహించుచున్నవని చెప్పెదరు. ఇది సహజజ్ఞానము (Commonsense) నకుఁ గూడ విరుద్ధమగు విషయమని వేఱె చెప్పనక్కఱలేదు. స్థూలము స్థూలమే; ఆత్మ ఆత్మయే. స్థూలము ఆత్మపదార్థముగ మాఱుననుట అసంభవము. ఆత్మ నిస్సంశయముగ సర్వోత్కృష్టమగు పదార్థము. దానికి దేశకాల కారణత్వములతోఁగల సంబంధము బద్ధావస్థయందున్న మనకు గోచరించునట్టి విషయము కాదు. కాని జీవాత్మకు వికాసము కలిగినపుడు అది క్రమముగ ఉచ్చావస్థల నొందుచుండుననియు, ఆయా అవస్థలయందు ఇంతకుముందు దుర్బోధములుగ నున్న

విషయములు అప్పుడు సుబోధము లగుచుండుననియు, నుసము నిస్సందేహముగఁ జెప్పవచ్చును. దీనిని అనుసరించియే క్రీస్తు ప్రభు వుచ్చరించిన పైనిఁ జెప్పినవాక్యములు మనసోపాస స్థితికి అనురూపముగ మనకు వేఱువేఱు అర్థముల నొసంగు చుండును. సామాన్య మనుష్యమాత్రస్థితికంటె ఒకింత ఉచ్చస్థితిలోనున్న జ్ఞానవంతులకుఁ బైనిఁజెప్పిన క్రీస్తుప్రభుని వాక్యములలో "దేవునియందు హృదయమంతయుఁ జేర్చి ప్రేమింపు" మనుదానికి, ద్వేషబుద్ధి యించుకయులేక బాలుర హృదయమునవలె అతినిర్మలమును, కపటశూన్యమును అగు హృదయముతోఁ బ్రేమింపుమనియు, "మనస్సునంతయుఁ జేర్చి ప్రేమింపు" మను దానికి, అంధప్రాయముగఁ గాకుండ వివేకవతియగు బుద్ధితోఁ బ్రేమింపుమనియు, "ఆత్మసంతయుఁ జేర్చి ప్రేమింపు" మనుదానికి, మానవ వ్యక్తియందు ఏ ప్రవృత్తిక్రమమున భగవదారాధనము సేయబడుచున్నదో, ఏప్రవృత్తిక్రమమునఁ దన అమర్త్యత్వమును జీవుఁడు తెలిసికొను చున్నాఁడో, ఆప్రవృత్తితోఁ బ్రేమింపుమనియు, "శక్తిసంతయుఁ జేర్చి ప్రేమింపు" మనుదానికి, కర్మాచరణముచేఁ బ్రేమింపు మనియు, అర్థము. సర్వోచ్చస్థితిలోనున్న ఆత్మవంతులకుఁ క్రీస్తు ప్రభుని వాక్యములయందు ఇంతకంటె ఉత్కృష్టమును, గంభీరమును అగు అర్థమే గోచరించును. అతఁడు దేవునిఁ బ్రేమింపుమని చెప్పియుండెను గాని, అతనినిఁ దెలిసికొను

మనిగాని, ఊహింపుమనిగాని, మననము సేయుమనిగాని చెప్పియుండలేదు. మానవుడు తాత్త్వికముగ శుద్ధ జీవాత్మయేకాని, అతఁడు బుద్ధికాని, దేహముకాని కాఁడు. ఆత్మకు జ్ఞానము సారభూతము. కర్మ విమలప్రేమ. మానవుని శుద్ధజీవావస్థయందుఁ దన్ను భగవంతునితోఁ గలుపునది విమలప్రేమయే. కనుక ప్రేమయే జీవాత్మయొక్క లక్షణము. అనఁగా (ఇచ్చట) మానవలక్షణము. ఈ సందర్భమున ఎవ రైన ఇట్లు ప్రశ్నించవచ్చును. "హృదయముతో నాకు ఏమి పనియున్నది ? నా హృదయము ఇపుడు ఉద్యానవనవిహారము, షడ్రసోపేతమగు ఆహారము, నిరంకుశవర్తనము మొదలగు వానినిఁ గోరుచున్నది."

దీనికిఁ గ్రీస్తుప్రభువు ఇట్లు గంభీరముగ బదులు చెప్పెను. "హృదయముతో నీకు ఏమిపనియున్నదో చెప్పు చున్నాను వినుము. నీహృదయమంతయు భగవంతునియందే చేర్చి అతనిని ప్రేమింపుము. నీహృదయము ఇప్పుడు భోగము లవంకకే పరుగెత్తుచున్నది కాని దేవునివంకకుఁ బోలేదు. కాని దుష్టాశ్వమును లొంగదీసినట్లు హృదయ ప్రవృత్తుల నన్నింటిని నీవు స్వాధీనపఱచుకొని వానినిఁ బ్రేమమయుఁడగుఁ భగవంతునియందే చేర్పుము." ఇది చతుర్విధ భగవదారాధ నములలో ఒకవిధమగు ఆరాధనముగఁ జెప్పబడుచున్నది. భాగవత ధర్మమందు దీనిని శాంతరస సంబంధమగు భక్తి

అని చెప్పుదురు. ఇప్పుడు ఒకరు ఇట్లడుగవచ్చును. "హృదయము భగవంతునివంకకు బోవుచున్నను మనస్సు భగవంతుని విడిచి దృశ్యసృష్టి వాస్తవికత్వ విచారము (Positivism) వంకకు నన్నుగొనిపోవుచున్నది. కావున నేను ఇపుడేమి చేయవలెను?"

దీనికి క్రీస్తు ప్రభువు ఇట్లు బదులుచెప్పెను. "నీ మనస్సంతయు భగవంతుని యందే చేర్పుము. అనగా నీవు ఏది చూచినను, గ్రహించినను, స్మరించినను, భావించినను, దర్శించినను అది ప్రేమసంపన్నమై యుండవలెను గాని శుష్కముగ ఉండరాదు. శుష్కబుద్ధికి ప్రేమయే ఆర్ద్రతగలిగించుచున్నది. సత్యమందు ఆదరమును, పరమార్థ చింతనమును, సాత్త్విక స్వభావమును గలుగు విధమున బుద్ధిని ప్రశస్తములును, పవిత్రములును అగు విషయములందు సదా ప్రవర్తింపజేయుము."

భాగవత ధర్మమందు దీనిని దాస్యరససంబంధమగు భక్తియని చెప్పుదురు. కాని హృదయము బుద్ధియు వికసించినంతనే మానవుని చరమోద్దేశము చేకురునా? అని ఒకరడుగవచ్చును. దీనికి క్రీస్తు ప్రభువు ఇట్లు బదులుచెప్పెను.

"నీ ఆత్మనంతయు భగవంతునియందుఁ జేర్చి అతనిని ప్రేమింపుము. నీ హృదయము బుద్ధియు భగవంతుని యందు ఉన్నంత మాత్రమునఁ జాలదు. నీ ఆత్మకూడ భగవదర్పితము

కావలెను. భగవంతునితో నీకుఁగల సంబంధమును మనసునఁ గలుపుకొని ధ్యానకాలమున నీవు అతని సంకల్పములను, ఆదేశములను ఎఱుంగుము.”

ఇది భాగవత ధర్మమందు సఖ్యారసమునకు సంబంధించిన భక్తి యని చెప్పెదరు. ఈ అవస్థయందు జీవాత్మ నిర్భయముగ భగవత్సేవ చేయుచుండును.

ఇప్పుడు ఒకరు ప్రశ్నింపవచ్చును. “ఇట్టి భగవదర్పణముచే జీవాత్మ భగవంతునియందు లీనమై తన ప్రత్యేక స్థితి నాశనమగుచుండు నిమియము తెలియఁబడలేకుండునే?” అని.

దీనికి దేవుని బిడ్డఁడగు క్రీస్తు ప్రభువు ఇట్లు బదులు చెప్పెను. “నీశక్తిసంపదయును దేవునియందు చేర్చి అతనిని ప్రేమింపుము. నీ యిచ్ఛాశక్తి యతని యిచ్ఛాశక్తిచేతనే నియమింపఁబడి యున్నది. నీ ప్రత్యేక స్థితికి ఎన్నఁటికిని నాశము లేదు. నీవు కర్మయోగుఁడవు. స్వార్థపరత్వము లేశమైనను లేకుండ నీ స్వేచ్ఛాప్రవృత్తి ననుసరించి భగవదర్పితములుగను, భగవదాజ్ఞను నెఱవేర్చుటకును, నీవు నీ స్వకర్మలు చేయుచుండినచో నీవు సదా ప్రేమ సముద్రుఁడగు భగవంతునియందే నివసించుచుందువు.” ఇందు సాధారణ భక్తి లక్షణమే చెప్పఁబడినది (గీ. 12 — 6, 7, 8.)

“మానవుని సోదరునిగ భావింపుము” అను క్రీస్తు ప్రభుని మఱియొక వాక్యము గలదు. మానవులకు అందఱ

కును సోదరభావము కలిగినపుడు తమకుఁ దండ్రి భగవంతుఁడే అగుచున్నాఁడు. ఇది ప్రాథమికావస్థ యందున్న వాత్సల్య రస సంబంధమగు భక్తి అని చెప్పవచ్చును.

భక్తి ఈ విధముగఁ బ్రథమావస్థయందు హృదయ గమ్యముగను, తదుపరి మనోగమ్యముగను, తదుపరి ఆత్మ గమ్యముగను, తదుపరి యిచ్ఛా గమ్యముగను లభ్యమగు చున్నదని స్పష్టపడుచున్నది. హృదయము, మనస్సు, ఆత్మ, ఇచ్ఛ అను నాల్గింటిచే సంపాదితములగు భక్తి వృత్తులు పరస్పర నాశ కారణములు కాకుండుటయే కాక ఇవి ఏకీ కృతము లగుచు భాగవత ధర్మమందుఁ జెప్పఁబడిన ఏకాంత భక్తిరూపము వహించుచున్నవి.

ఈభక్తికిఁ బరాకాష్ఠా రూపమును, సర్వోత్కృష్ట మును, అత్యంత నిగూఢమును అగు మఱియొక భక్తి వృత్తి గలదు. ఇందు మానవుని శుద్ధజీవాత్మ స్త్రీభావము వహించి కేవల పరమపురుషుఁడగు భగవంతునితో రమించును. ఇది కాంతా కనకప్రతిష్ఠలయొక్క వాసనయైన లేనట్టి మహా సుకృతాత్ములకు అనుభవవేద్యమే కాని దీనిని వర్ణించుట అసాధ్యము. భక్తివృత్తులలో ఇది ఐదవవి. దీనినే భాగవత ధర్మమందు మధుర రససంబంధమగు భక్తి అని చెప్పుదురు. ఇది శ్రీమద్భాగవతము మున్నగు రసగ్రంథములయందు దీని యందు అధికారము గలవారిచేఁ దెలిసికొన దగినదై యున్నది.

# దేవుని స్మరించు టెట్లు?

"కష్టకాలమందు నన్ను స్మరింపుము. నిన్ను నేను ఉద్ధరించెదను." అనునది బైబిలులోని ఒక వాక్యరత్నము. సమస్తచరాచరములను గని పెంచుచున్న ప్రేమసముద్రుండగు భగవంతునినోటనుండి వెలువడిన ఈవాక్యము అతి మనోహరమును, మానవులకు ఎంతయు ఉత్సాహజనకమును అగుచున్నది. శీర్ణహృదయులకు అమృతతుల్యమై, అస్పృశ్యుఁ జీకటింబడి గృహాంధకారమైన వారలకుఁ గరదీపకమై ఈవాక్యము వెలుఁగొందుచుండును. కష్టభూయిష్ఠమును, దుఃఖనిలయమును, బుంఖానుపుంఖములుగఁ గలుగుచుండెడి ఆశాభంగములకు నిలయమును, అగు ఈ సంసారసముద్రమునందు మునిఁగి తేలుచుండు వారలకు సర్వలోక శరణ్యుఁడును, అనాథ రక్షకుఁడును, దండ్రులకుఁ దండ్రియు, మిత్రులకు మిత్రుఁడును, సర్వశక్తిమంతుఁడును అగు భగవంతుఁడును బోతిమి యొప్ప వేఱొక తరణోపాయమే లేదని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. దుఃఖము లనుభవించుట మానవకోటికి ఎంతటి అనివార్య విషయమైనను, దుఃఖానుభవముచేఁ గలుగు పరమ ఫలము సుఖరూపమైనదని కవులు ఎంతవర్ణించినను, సర్వజ్ఞుఁడును, దయామయుఁడును, అగు ఒక మహావ్యక్తి మనలను సదా వేయికన్నులతోఁ గనిపెట్టి ప్రోచుచున్నాఁడను గాఢ

విశ్వాసమును, ఆ సర్వజ్ఞమూర్తి మనకుఁ గలిగించినది అంతే యు మనమేలుకొఱకే అగుచున్నది అను గట్టినమ్మకమును, మన హృదయములను ఉత్సాహముఁ గొలుపకున్నచో, మనము మనోవ్యాధిగ్రస్తుల మగుటయు, మన జీవితములు మనకు భరింప శక్యములు కాని వగుటయు సంభవించును. మానవు నికి ఎన్ని తెలివితేటలున్నను, ఎంతటి ద్రవ్యబలమున్నను, వాని జీవితములో ఒక్కొక్కప్పుడు సంభవించెడి మహాక్లిష్ట పరిస్థితులయందు అవి బొత్తిగఁ బనికిరాకుండఁ బోవును, కష్ట కాలమందు మనకు దారిఁ జూపువాఁడును, సాయము చేయు వాఁడును అగు భగవంతుఁ డున్నాఁడను మనోధైర్యముగల వానికిఁ గలహాయి, మానవ ప్రజ్ఞను నమ్ముకొని దుఃఖనివార ణము కొఱకు విశ్వప్రయత్నము సేయువానికిఁ గలుగదు. ఈవిషయము యథార్థమనుటకు లోకమునందలి స్త్రీల యొక్కయు, బురుషుల యొక్కయు, జీవితములను గొన్ని పరీక్షించినచో దీని వాస్తవస్థితి వారి జీవితములలోఁ బ్రతిదిన మందును, బ్రతి నిముసమందునుగూడఁ దప్పక గోచరించు చుండును.

దేవుఁడే లేఁడనియు, దేవుఁడున్నాఁడను విశ్వాసము అవివేక జనితమును, మేధాదౌర్బల్య లక్షణమును అనియు, చెప్పువారు పెక్కుమంది కలరు. వీరు భగవంతుని స్మరింప నైన స్మరింపక స్వశక్తి స్వప్రయత్నములచేఁ దమ జీవిత

సుఖములను అభిలషించుచుందురు. కాని వీరి జీవితముల యందుఁగూడ ఒక్కొక్కప్పుడు విషమ పరిస్థితు లేర్పడినచో దారి తెన్ను దోఁచక వీరు కొంతవఱకు గింజులాడి తుదకు నిస్సహాయత్వము తోఁచినప్పుడు "చచ్చితిమో దేవుఁడా!" అను పలుకులు సహజముగ వీరి నోటనుండి వెలువడును. మనలోఁ జాలమంది నాస్తికవాదములు చేయుచు, 'దేవుఁడు లేఁడు; గురువు లేఁడు' అని చెప్పుచుండియును దమకుఁ గష్టకాలముగాని, మరణకాలముగాని తటస్థించినపుడు ఏమియుఁ దోఁచక నిర్విణ్ణులగుచు భగవంతుఁ డున్నాఁడను నమ్మకము తమ కిపుడు కలిగెననియు, దమ అపరాధములు ఎట్లు క్షమింపఁ బడునో తెలియకున్నదనియు, తమతమ గురువుల యెదుట చెప్పుట వినుచున్నాము. కావున లోకపరిస్థితులు అన్నికాలముల యందును, అన్ని స్థలములయందును, ఇదేవిధముగ నుండుటచేఁ గామక్రోధాదులను జయించిన వాఁడైనను, దేవునిపై ఆధారపడకుండ, గష్టకాలమందు దేవుని స్మరించకుండ, సుఖజీవనము చేయఁజాలఁడని మనము నొక్కి వక్కాణింప వచ్చును.

అట్లయిన గష్టములు మనకు ఏల కలుగుచున్నవి? దేవునికి మనపైఁ గోపము వచ్చుటచేతఁ గలుగుచున్నవని చెప్పినచో అతనిని స్మరించినంత మాత్రమున అతనికోపము ఎట్లు చల్లారును? భగవంతుఁడు చపలచిత్తుఁడును, చంచల

స్వభావముఁ గలవాఁడును, అగు ఈశ్వరుఁడు ఉన్నాఁడన్నచో అతఁడు మనకుఁ గష్టములను ఏల కలిగించవలెను? భరింపఁజాలమనుచు ఆతనిని బ్రతిమాలుకొని అతని అనుగ్రహమునకై మనము ప్రార్థించినచో ఎప్పుడును మనకు ఆ కష్టములను ఆతఁడేల తొలఁగించవలెను? ముఖ్యముగ మనము భగవంతుని ఏవిధముగఁ బ్రార్థించవలెను?— ఈ ప్రశ్నలన్నిఁటికిని సదుత్తరములను మనము ఆలోచించి అధ్యాయారంభమున ఉదాహరించిన భగవద్వాక్యమునందలి వాస్తవ తత్త్వమును తెలిసికొందము.

మానవజీవితముయొక్క ప్రయోజనమును, చరమోద్దేశమును తెలిసినవారు మనకుఁ గలిగెడి కష్టములన్నియుఁ బూర్వకర్మానుసారముగఁ గాని, స్వధర్మపద్ధతిని ఉల్లంఘించుటచేఁగాని, కలుగుచున్నవని చెప్పుచున్నారు. భూలోకమందేకాని, దేవలోకమందేకాని, కర్మ అనుల్లంఘనీయమనియు, కర్మవిధికి లోఁబడని సత్త్వము ఉండనే ఉండదనియు, మనము తెలిసికొనవలెను. కర్మప్రభావము నెఱింగి, దాని విధులను అనుసరించుచు జీవితము గడపు నిస్సంగునికి ఎప్పటికైనను మృత్యుసంసారము నుండి తరించు మార్గముగలదు. కర్మతోఁ బోరాడెడు బుద్ధిహీనుఁడు సంసారమను సుడిగుండమునఁబడి, దానినుండి తరించు మార్గము కానరాక తన జీవితమును చెఱచుకొనును. ఒక

కర్మను సాధించుకాలమున ఇతరములగు అనేక కర్మలు మనము చేయవలసి వచ్చును. వానివలన మనకుఁ గీడుకాని, కష్టములుగాని, కలిగినయెడల తీఱును. ఈ కష్టములు మనము తెచ్చుకొన్నవేకాని భగవంతుఁడు తెచ్చినవి కావుగదా? మన కర్తృత్వమునకు లోఁబడి ఇవన్నియుఁ గార్యకారణ శృంఖలారూపమున సహజముగ సంభవించుచునే ఉండును. కష్టములను, విపత్తులను మనము తప్పించుకొనఁ జాలము. కర్మ యొనర్చినవానికిఁ గర్మఫలానుభవము తప్పదు. మనము ఏకర్మ యొనర్చిన ఆకర్మఫలమే మనకు అనుభవనీయ మగుచున్నది. మిరెపవిత్తనములు పొలములోఁ జల్లినవానికి బంటకాలమున గోధుమలులభింపఁజాలవు. కొందఱుదుష్కర్మ పరంపరలను భరింపజాలక గుండె పగిలి చత్తురు. లేదా, ఆత్మహత్య నొనర్చుకొందురు. విధి అనుల్లంఘనీయమని తెలిసిన మఱికొందఱు తమ కష్టములను అల్లే ఓపికతో భరించి, వినయము, సంతృప్తియుఁ గలిగి జీవితములను గడపుకొనుటచేఁ దుదకు ఆకష్టములు వారికిఁ దొలఁగి పోవచ్చును. భగవంతుఁడు దయామయుఁడనియు, బక్షపాతము లేనివాఁడనియు, వారికి సంపూర్ణవిశ్వాసము కలిగియుండు టచేఁ దన్మూలమున వారికిఁ గలిగెడి శాంతిసహనములే వారి కష్టనివారణమునకుఁ గారణము లగుచున్నవి. బాగుగఁ బరిశీలించినపుడు ఈ విశ్వాసముకూడ మున్ను దానొనర్చిన

సత్కర్మకు ఫలమనియే తెలుచున్నది. ప్రార్థనము సలుపుటయు, మనన మొనర్చియు, కరుణానిధి యగుచు న్యాయైక దృష్టి గలిగిన భగవంతునియందు పూర్ణవిశ్వాసమును మానవుడు సంపాదించవలసి యున్నది. ఆ విశ్వాసము హృదయ గతము, మనోగతము మాత్రమగుచు, ఆత్మగతముకానిచో అది నామమాత్ర విశ్వాసమే అగుచున్నది. విశ్వాసము ఆత్మ గతమైనఁగాని భగవంతునితో జీవునికిఁగల సంబంధము పునఃస్థాపితము కానేరదు. అప్పుడుగాని మానవుఁడు పిలిచిన పిలుపు భగవంతునికి వినఁబడదు.

అపతార్కికులమందు ఒకానొకప్పుడు నిరీశ్వరవాదికిఁ గూడ హఠాత్తుగ ఈశ్వరవిశ్వాసము గలుగవచ్చును. ఇట్లు కలుగుటకుఁ గారణము పైకి ఎద్దియుఁ గనఁబడకుండుట నిజమే. కాని పురుషుఁడు అనాదికర్మవాసనలతో నిండిన బద్ధజీవుఁడని మాత్రము మనము మఱవరాదు. కావున నాస్తికునకు ఆకస్మికముగ ఈశ్వరవిశ్వాసము గలిగినప్పుడు అనేకజన్మల నుండి పాఁతుకొనియున్న అతని ఈశ్వర విశ్వాస రూపమగు వాసన క్రియారూపమునఁ బ్రకటితమగుటకు ఇంతవఱకు అవకాశము చిక్కకుండెననియు, ఇప్పుడు అట్టి యవకాశ మొద్దిదో కలుగుటచే అది ప్రకటితమయ్యెననియు, మనము తెలిసికొనవలెను. ఈరీతిగఁ బరిశీలించినపుడు ఈశ్వర విశ్వాసము హఠాజ్జనితముగాక, పురాకృత కర్మజనితమనియే తెలుచున్నది.

కావున ఈలోకమందుఁ గారణములేకుండఁ గార్యము పుట్టుటకు ఎట్టి అవకాశమునులేదు. దీనినిబట్టియే జననమరణ తత్త్వవేత్తలగు హిందూధర్మశాస్త్రజ్ఞులు మన పూర్వజన్మలతో ఇప్పటిజన్మకు అవినాభావసంబంధము గలదనియు, మన ఇప్పటిజన్మ అనేక జన్మకృత కర్మఫలమేయనియు జెప్పియున్నారు. కావున "ఎవరి అదృష్టమునకు వారేకర్తలు" అనెడి సామెతయొక్క తాత్త్వికార్థము ఇపుడు సుస్పష్టము కాఁగలదు. ధర్మస్వరూపుఁడగు భగవంతుఁడు మనయోగ్యతాయోగ్యతల ననుసరించి సంపత్తులను, విపత్తులను, సుఖములను, దుఃఖములను మనకు బహుమానరూపముగఁ గాని, శిక్షారూపముగఁగాని ఎట్లొసంగుచున్నాఁడో ఈ విధముగఁ మనకుఁ దెలియుచున్నది. కావున మనకుఁ గలిగెడి కష్టములు మనకర్మఫలములే అని తెలిసికొంటిమి. భగవంతుని స్మరించుటచే విపత్తులను ఎట్లుదాఁటఁగలుగుదుమో, భగవంతుఁడు ఎట్టిస్వభావము గలవాఁడో, ఇఁకను మనము తెలిసి వలసి యున్నది.

భగవంతుని స్వభావము, నిత్యము, అచలము, సనాతనములయినదని శాస్త్రవేత్తలు ఎఱింగియున్నారు. మానవుని అవిశ్వాసముచే భగవత్స్వభావము కదనని వహించునదియుఁగాదు; మానవుని ప్రార్థనల చేతనే అది ద్రవీభూతమగునదియుఁ గాదు. భగవంతుఁడు ధర్మ స్వరూపుఁడును,

దయామయుఁడును న్యాయశీలుఁడు అగువాఁడు ఎప్పుడును అట్లే యుండవలెను గదా? మానవుని ప్రవర్తనను బట్టి భగవంతుని స్వభావము మాఱుట అసంభవము. చపలచిత్తులగు మానవ ప్రభువులవలె భగవంతుఁడు కూడ ఒకనిపైఁ గోపించు ననియు, ఒకనిని ఆదరించుననియు, కొందఱి ననుగ్రహించి మఱికొందఱిని ఆపత్సముద్రమునఁ ద్రోచివేయు ననియు, భావించుటకంటె వేఱొండు అజ్ఞానము లేదు. మనము చేయు దైవప్రార్థనమునకు ఫలము మనము పూర్వము ఏ కర్మ లొనర్చుటచే ఇప్పుడు కష్టములను అనుభవించుచున్నామో ఆ కర్మలకుఁ బ్రతిక్రియ ఒనర్పఁజాలు ఇతర కర్మల సంభవము నకు అవకాశ మొసంగుటకాని, కోపావిష్టుఁడైయున్న దేవుని కోపమును ఉపశమింపఁజేయుట కాదు. స్థూల జగత్తునందు ఇంద్రియముల మూలమునఁ జేయఁబడిన కర్మలకంటె మానస ప్రార్థనములకు ఫలములుగ ఏర్పడు కర్మలు బలవత్తరము లైనవని మనము గుర్తించవలెను. వాస్తవముగ మన దైహికకర్మలకంటె మానసిక కర్మలు అధికబలము గలవి యును, అధికఫలము నొసంగునవియును, అని చెప్పవచ్చును. మన ఇచ్ఛాశక్తిచే ఎట్టి కార్యములను సాధింపఁ గలిగి యున్నామో మనము ఎఱుఁగని విషయము కాదు. ప్రార్థన మన్నను, ఇచ్ఛాశక్తి అన్నను ఒక్కటే. మనము ఇచ్ఛగించిన అర్థమును సాధింప సమర్థమగునట్టి ఒకానొక మనోధర్మ

విశేషమునే ప్రార్థనముని చెప్పుచున్నారు. మనస్శక్తి రూప మగు ఈ ప్రార్థనము బలవత్తరమైన కొలఁది దానిఫలము మహత్తర మగుచుండును. కావున మన కపటరహిత ప్రార్థనమే మనకు భగవదనుగ్రహము నొడఁగూర్చునుగాని, వాగాడంబరముచేతను, పూజాడంబరముచేతను, భగవదనుగ్రహము కలుగనేరదు. కపటరహిత ప్రార్థనమనిన నిర్మలమగు ఇచ్ఛాశక్తి స్వరూపమే అని తెలియవలెను.

ఈ విధముగ ఆలోచించినపుడు విశ్వాస మనునది ధర్మసంబద్ధమును, జీవునికి భగవంతునితోఁ గల సంబంధమును బునఃస్థాపిత మొనర్ప సమర్థమును, అగు కర్మవిధి యొక్క స్వభావనిరూపణము తప్ప వేఱొండుకాదని స్పష్ట మగుచున్నది. మనము ఇంతకుముం దొనర్చిన దుష్కర్మల యొక్క ప్రభావమును బ్రతిహత మొనర్పఁజాలిన కొన్ని సత్కర్మలు సంభవమగుటకు మనమొనర్చెడి ప్రయత్నమునకే ప్రార్థనమని పేరు.

ఇఁకను ఈఅధ్యాయారంభమున ఉదాహరింపఁబడిన భగవన్ముఖనిఃసృతమగు వాక్యరత్నమునకు అర్థమేమియో విచారింతము. దాని అర్థము ఇట్లు చెప్పఁబడుచున్నది. "ఓయి మానవుఁడా! నీకు ఇపుడు కలుగుచున్న కష్టములనుగూర్చి వగచుటకాని, కించ నొందుటగాని, నీకుఁదగదు. ఏమన, మున్ను నీ వొనర్చిన దుష్కార్యములకు ఫలరూపములుగ,

అవి నీకు ఇపుడు కలుగుచున్నవి. ప్రార్థన బలముచేతఁగాని, ఇచ్ఛా ప్రధానముచేతఁగాని, వానిని నీవు జయింపఁ గలుగుదువు. కావున వానిని అట్లు జయింపుము. నేను సర్పాటుచేసిన విధుల నన్నిఁటిని నీవు పరిపాలింపుము. వానిని నీవు యుక్తము గఁబరిపాలింతువేని నిన్ను నీ వుద్ధరించుకొని నీ స్వస్థానమును నీవు చేరుదువు.

పైని జెప్పిన భగవద్వాక్యమునకు ఇంతకు మించిన అర్థములేదు. లేని అర్థమును గల్పింతుమేని మనకే మోసము కలుగును. కర్మవిధులు అనుల్లంఘనీయము లగుటచేఁ గర్మాచరణమందు అప్రమత్తులమై ఉండవలయునని ఈవాక్యము మనకుబోధించుచున్నది. భగవంతుఁడు న్యాయైకదృక్కనియు, దయామయుఁడనియు, గూడ ఈ వాక్యము మనకుఁ దెలుపుచున్నది. మన మొనర్చిన కర్మలకు ఫలములను నిరాక్షేపణముగను, నిష్పాక్షికముగను, ఒసంగుటలో అతని న్యాయవర్తనమును, దుష్కర్మానుభవమైనవెనుక మనకుబుద్ధికలిగి మనము సన్మార్గవర్తనము నవలంబించుటకై లెక్కలేని అవకాశములను మనకు, గలిగించుటలో అతని దయాస్వభావమును, మనకు ద్యోతితమగుచున్నవి. భగవదనుగ్రహమనిన, ఒకమానవ ప్రభుని అనుగ్రహము వంటిదికాదు. భగవంతుని స్వభావము మానవబుద్ధి గమ్యముకాదు. కామక్రోధాది షడ్వర్గశూన్యమగు ప్రశాంత చిత్తముతోడఁగూర్చి, భగవం

తునితో మనకు గల జ్ఞానస్వరూప సంబంధమును మనకు మఱలఁ గూర్చి, భగవత్ప్రేమస్వరూపమగు చరమప్రయోజనము మనము సాధింపఁ గలుగుటకు అనేకమార్గములును, లెక్కలేని అవకాశములును మనకుఁ జూపించి, మనకు సర్వవిధముల చేతను దోడ్పడునట్టి భగవత్సంబంధమగు ఒక ప్రవృత్తికే భగవదను గ్రహమని పేరు.

కర్మవిధులయందుఁ బూర్ణవిశ్వాసము కలిగి, మానవ చరమ ప్రయోజనమందు దృష్టినిలిపి, దుష్కార్యా చరణమును ప్రేరేపించునట్టి మనఃప్రవృత్తిని నిర్మూలముచేసి, మానవుఁ డొనరించు సరళప్రార్థనమే "దేవుని స్మరించుట." దుష్కర్మఫలములు మనము అనుభవించెడి దినమే మనకు "కష్టకాలము". మనమొనర్చిన దుష్కర్మలకు అనురూపము లగు దుష్ఫలముల నొసంగుటచే అవిద్యా నిద్రాగతులమగు మనలను లేవఁగొట్టి, మనకు ఆత్మజ్ఞానము కలిగించి, భగవ త్సేవారూపములగు సత్కర్మలను మనచేత జేయించి మనకుఁ దోడ్పడుటయే భగవంతుఁడు మనలను "ఉద్ధరించుట".

ఈరీతిగ మనము కర్మను గూర్చియు, దానిఆవశ్యకతను గూర్చియు, భగవదనుగ్రహ మనుదానిఁ గూర్చియుఁ దెలిసి కొంటిమి. "విశ్వాసము". "ప్రార్థనము" అను మాటలకు అర్థమును గూడఁ దెలిసికొంటిమి. ఈ నాల్గింటికిని నేనొసం గిన నిర్వచనములు సర్వమత సమ్మతములనియే నాఅభిప్రా

యము. ఎంతటి వారికైనను గర్మ దాఁటశక్యము కానిదనియు, దుష్కర్మ బీజములు నశించినఁగాని కర్మబద్ధుఁడగు జీవునకుఁ దరణోపాయమే లేదనియు భాగవత ధర్మప్రవర్తకుల నిశ్చితాభిప్రాయము. కర్మవిచారమునకు సంబంధించిన ఒక అమూల్యమగు శ్లోకము ఈ క్రింద నుదాహరింపఁబడినది.

శ్లో. నమస్యామో దేవాన్ననుహతవిధేస్తేఽపి వశగా
విధిర్వంద్యస్సోఽపి ప్రతినియత కర్మైక ఫలదః
ఫలం కర్మాయత్తం కిమమరగణైః కించ విధినా
నమస్తత్కర్మభ్యో విధిరపి న యేభ్యః ప్రభవతి.

"దేవతలకు నమస్కారము. వారుసైతము పాడు దైవమునకు లోఁబడినవారు గాన దైవమునకు మ్రొక్కెదను. ఆదైవము కర్మానుసారముగ ఫలమునిచ్చునుగానఁ గర్మకు నమస్కారము. ఫలము కర్మాధీనము కావున దేవతలతోడను దైవముతోడను మాకేమిపని? దేవతలచేతఁగూడ దాఁట శక్యముగాని కర్మమునకే మ్రొక్కెదను."

# జీవుని సంసార భ్రమణము.



జీవుఁడు మఱలమఱల జన్మించువాఁడను సిద్ధాంతము కేవలము హిందూమతమునకు సంబంధించిన సిద్ధాంతమే. ఈ సిద్ధాంతము ననుసరించియే ఈ మతమునకును మహమ్మదీయ క్రైస్తవ మతములకును గొంత పార్థక్యత యేర్పడు చున్నది. ప్రపంచమునందుఁ గనఁగు నానాత్వమునకు సమాధానము చెప్పుటయే ఈ సిద్ధాంతము యొక్క ప్రయోజనము. జీవుని పునర్జన్మముగూర్చి అనేకులకుఁ గల వివిధాభిప్రాయములు సరియైనవి కావు. వారలకుఁ గల సుమూహలను దొలఁగించుటకై భక్తాచార్యుల శిష్యప్రణాళికను ననుసరించి జీవ పునర్జన్మము గూర్చి యిచ్చట విచారింతును.

పునర్జన్మమునకు సంబంధించిన జ్ఞానము జీవునితో సంబంధము కలది కావున జీవ స్వరూపము ఎట్టిదియో ముందుగఁ దెలిసికొనుట మనకు ఆవశ్యకమై యున్నది.

ఈ జీవస్వరూపము గూర్చియే ప్రపంచమందుఁ గల శాస్త్రవేత్త లందఱును భేదచ్ఛేద మొనర్చుకొనుచున్నారు. ఈ భేదచ్ఛేదమునకుఁ జిత్తభ్రాంతియే ఫలముగ యేర్పడు చున్నది. ఇంద్రియ జన్యమగు జ్ఞానముచే ఎవరికి దోచినట్లు వారలు ఈ జీవతత్త్వమును గూర్చి విచారించుటయే కాని

శ్రుతివాక్యము బోధించువారు ఒక్కరైనను గానరారు. మనబుద్ధి ఏప్రదేశమునకు పోఁబూనుటకుఁ గేవలము అసమర్థమై యుండునో, ఆ ప్రదేశము నందు అది ప్రవేశించుటకుఁ బ్రయత్నించినప్పుడు గందరగోళమే కాక మఱేమి కలుగఁగలదు? ఈ గందరగోళమునకు ఫలము ఎట్టిదియో వేఱే చెప్పవలసిన పనిలేదు. అసలు వస్తువును విడిచి దాని నీడ వెంటఁ బరువెత్తుటయే కదా? జర్మని దేశమునందుఁ బ్రజలు చెప్పుకొనుపిట్టకథలలోఁ దననీడను బోఁగొట్టుకొన్న ఒకమనుష్యుని గూర్చినకథ ఒకటి గలదు. నీడను బోగొట్టుకొనుటచే ఆమనుష్యునకుఁ దీఱనిముప్పు వచ్చినదఁట! అతఁడు సమస్తమును గోలుపోయెను. స్నేహితులందఱును అతనిని విడిచివైచిరి. బంధువులు అతనిని దలఁచుటయే లేదు. నీడను గోల్పోయినవారికే ఇట్టిగతి పట్టినప్పుడు అసలు వస్తువును గోల్పోయిన వారిగతి ఏమికావలయును? మనలో ఇంచుమించుగ అందఱమును దెలిసియో, తెలియకయో నీడ (చిచ్ఛాయ, లేక, మాయ) వెంటనే పరువెత్తుచుఁ జివఱకు దుఃఖభాజనుల మగుచున్నాము. ఈశరీరమే మనము అను భావముతో విషయసుఖముల వెంట మనము సదా పరువెత్తుచునే ఉన్నాము. ప్రపంచ భోగమే జీవధర్మము అను అభిప్రాయము గలిగి ఆ భోగము కొఱకే మనము జీవించుచున్నాము. ఇదే మనము చేయుచున్న గొప్ప తప్పిదము. స్థూలసూక్ష్మ దేహములు అనుభ

వించెడి సుఖము ఆత్మసంబంధమైన సుఖము అనుకొని మనము భ్రాంతినొందుచున్నాము. కాని దేహసుఖమెక్కడ? ఆత్మసుఖమెక్కడ ? ఆత్మసుఖము నిరుపమానము. అది ఈ భోగలోకమందులభింపదు; లభింపవలయునని గోరుటయుం దగదు. ఐహికభోగాన్వేషణము వలన గలుగు ఫలము చివఱకు దుఃఖమే అగుచున్నది. కావుననే బైబిలులో ఇట్లు చెప్పంబడినది.

“ప్రపంచమందలి ప్రతివిషయమును, అనగా, శరీర సంబంధ మోహము, నేత్ర సంబంధమోహము, తనకుంగల పదవిని దలంచుకొని విఱ్ఱవీగుట, మున్నగునవి అన్నియును ప్రపంచమునకు సంబంధించినవే కాని తండ్రికి సంబంధించి నవికావు. ప్రపంచము నశ్వరమైనది. దాని సంబంధమగు మోహముకూడ అట్టిదే. కాని భగవత్సంకల్పము నెరవేర్చుచుండువాండుమాత్రముశాశ్వతపదవి నొందును. (I John II - 16, 17)

సరియే. జీవతత్త్వమును గూర్చి శ్రుతివాక్యములు ఏమిచెప్పుచున్నవో తెలిసికొందము. శ్రుతులయందు జీవతత్త్వమును నిరూపించుచు, జీవుండు, లేక, ఆత్మ అనువస్తువు భగవంతుని పరాప్రకృతికి సంబంధించినదనియు, అందువలనం దాత్త్వికముగ భగవంతునికంటె అది అభిన్నమైనదనియు చెప్పంబడినది. స్థూలసూక్ష్మశరీరములగు ఈ దేహమును, మనస్సును, భగవత్సంబంధములగు అపరా ప్రకృతి యొక్క

వికారములని యే చెప్పఁబడినవి. పురుషుఁడు చిన్మయుఁడు. శరీరాదులు మాయికములు. ఈ రెంటికిని గలభేదము ఎంతటి దనిన, మానవబుద్ధిచే ఎంతవిచారము ఆలోచించినను ఈ రెంటికిని ఎన్నటికిని బొత్తిగ కలియనంతటి భేదమున్నదని యే చెప్పవలసియుండును. అయినను భగవత్సంకల్పమును అనుస రించి అసాధ్యములు సాధ్యములగుచున్నవి. చిదచిత్తులు రెండును అన్యోన్యసాహాయ్యముతోఁ గార్యాచరణ మొనర్చు చున్నవి. కాని వానికిఁగల భేదము ఎప్పటికిఁ బోఁగలదు? మనము గమనింపక పోయినను భేదము అట్లులే యుండును గదా?

జీవాత్మ తన కర్మచేతనే ఈ అచిత్ప్రపంచమునందుఁ ప్రవేశించి స్థూలసూక్ష్మములగు రెండు దేహములు ధరింప వలసివచ్చెను. ఈ విధముగ అతఁడు మాయాబద్ధుఁడగుచుఁ దన తత్త్వానురూపములగు చిత్కార్యము లొనరించుటమాని ఈ అచిత్ప్రపంచమునందు అనేకరూపములు వహించి దారియు, దెన్నును ఎఱుఁగనివానివలె ఇందు భ్రమ్మరుచుండును. తనచిన్మయలక్షణమును బూర్తిగ మఱచి తన్ను సదా ఆకర్షించు చుండు మాయికభోగముల వెంటఁ బరువెత్తుచు అవి లభించి నపుడు క్షణభంగురమగు సుఖమే కలిగెనని వగచుచు, ఈ రీతిఁగాలము గడపుచుండును.

కాని జీవాత్మకు నిజముగ జననమరణములు కలవా? లేవు అనియే చెప్పవలెను. జీవాత్మ ఒకప్పుడు పుట్టునది కాదు.

గిట్టునది కాదు. "స్వరూపే తే సజాతీయా గోలోకే తే స్థితిః" అని వంగభాషయందుఁ జెప్పఁబడినది. "చిత్ప్రపంచమగు నిత్య లోకమందు జీవులందఱును స్వస్వరూపములో, సమానంగా, దివ్య స్వరూపముతో ఉందురు" అని దీనికి అర్థము. బైబిలులోను, ఖొరానులోనుకూడ ఇట్లే చెప్పఁబడియున్నది (St. Matthew XXII–30). స్వస్వరూపముతో ఉన్న జీవునకుఁ బరిణామమే లేదు. చిన్మయుఁడగు జీవాత్మపై మాయికములగు జననమరణములకు ఎట్టి అధికారమును లేదు. పరువెత్తి పోవుచున్న ధూమశకటమందుఁ గూర్చుండిన మనుష్యుఁడు ఒక స్థలము నుండి వేఱొక స్థలమునకుఁ బ్రయాణము చేసినట్లు చెప్పఁబడు చున్నాఁడు. కాని మనుష్యుఁడు కొంచెమైనను గదలుట లేదు కదా? నిజముగఁ బ్రయాణము చేయునది ధూమశకటము. కాని ప్రయాణము చేసినవాఁడు మనుష్యుఁడే అని చెప్పఁబడు చున్నాఁడు. జీవాత్మయొక్క గతాగతములుకూడ ఇదే విధముగ ఉండును. జననమరణములచేఁ గలిగెడి పరిణామము శరీరమునకే అగుచుండ వీనితో ఎట్టి సంబంధమును లేని జీవుని యందు అవి ఆరోపింపబడుచున్నవి. ఇందులకు మనకుఁగల అజ్ఞానమే కారణము. మాయామోహితులమై మనస్వస్వరూపములను మనము మఱచుటచే జీవునకు శరీరముతోఁ దాదాత్మ్యము గలుగుచున్నది. అందువలన, "నాకుఁజావుపుట్టుకలు గలవు, వానికిఁ జావుపుట్టుకలుగలవు, పిల్లికిఁజావు పుట్టుకలు

గలవు; చెట్టునకుఁ జాపుష్పుట్టుకలు గలవు" అని మనము సదా చెప్పుచుందుము—

కాని జననమరణములు ప్రపంచధర్మము లగుటచే, "నేను బుట్టుచున్నాను, నేను జచ్చుచున్నాను" అను విషయమును వ్యవహారములో మనము ఒప్పుకొనక తీఱదుగదా? శుద్ధజీవునకు జననమరణములు లేనప్పుడుమఱి దేనికి ఇవికలుగుచున్నవి? "దేహాదులకు అనియే చెప్పవలెను. దేహాదిరూపమగు ఆత్మ, లేక, చిదాభాసుఁడు (Apparent Self) గతాగతములనొందుచుండ అవి జీవరూపమగు ఆత్మకు, అనగా శుద్ధజీవు (Real Self) నకుఁ గలుగుచున్నట్లు మాయామోహితులమైన మనము చెప్పుచున్నాము. "ఇతఁడు పురుషుఁడు; ఇది స్త్రీ; ఇతఁడు హిందువు; ఇతఁడు మహమ్మదీయుఁడు; ఇది పిల్లి; ఇది కుక్క; ఇది చెట్టు; ఇది ఱాయి" అను వ్యవహారము చిదాభాసునకే కాని శుద్ధజీవునకు లేదు.

ఇఁకఁ జిదాభాసుఁడన ఎవరో విచారింతము. జీవుని బద్ధావస్థయందు మాయావరణము శుద్ధజీవునకుఁ గలిగినను జీవతత్త్వమందు మాయకుఅనుప్రవేశము లేదు. ఆభాసజీవుఁడు స్థూలసూక్ష్మదేహద్వయ రూపుఁడగుచు కేవలము మాయాశక్తిచేతనే నిర్మింపఁబడుచున్నాఁడు. కాని స్థూలసూక్ష్మ శరీరములు రెండును జడప్రాయము లేకదా? వానికిఁగల్గ చైత

న్యము ఎచ్చటినుండి వచ్చెను? దీనికి ఉత్తరమేమనిన, వానికి స్వభావసిద్ధముగఁ జైతన్యము లేకపోయినను చైతన్యమయుఁడగు శుద్ధజీవునకు అవిసన్నిధానమందుండుటచే వానికిఁ జైత న్యముకలిగినది. జీవుఁడు దేహాంతర్వ్యాప్తియై యున్నంతకాలమును దేహాదులకు జీవచైతన్యము కలిగియేయుండును. గులాబి పుష్పమును ఒక స్ఫటికముచెంతఁ జేర్చినచో స్ఫటికము అంతయు ఎఱ్ఱగా దోచును. ఆ పుష్పమును ఎడముగఁ దీసివేసినచో స్ఫటికము స్ఫటికమువలెనే కనఁబడును. ఇదే విధముగ శుద్ధజీవుని సాన్నిధ్యమందుండిన దేహాదులకు జీవలక్షణమగు చైతన్యము కలుగుటచే స్థూలదేహసూక్ష్మదేహ సంఘాతము ఒక ప్రత్యేకవ్యక్తిగఁ దోచుచు "నేను నేను" అను వ్యవహారముతో ఒప్పుచుండును. ఈ సంఘాతమునకే చిదాభాసుఁడని పేరు.

కాని ఆరెంటికిని ఎప్పుడు జీవసంబంధము వీడిపోవుచున్నదో, వానికి స్వభావ సిద్ధమగు జడప్రాయత్వము వానికపుడు గలుగుచునే ఉన్నది. బాగుగ విచారించినపుడు ఈరెంటిలో శరీరము అనునది, మనస్సు అనుదానికిఁ గేవలము ఉపకరణమే అగుచుఁ దనమూలమున మనస్సును స్థూల ప్రపంచముతో వ్యవహరింపఁ జేయుచున్నది. కావున జీవచైతన్యముతోఁ గూడుకొన్నమనస్సే నిక్కముగఁ జిదాభాసుఁడు వీనికే జననమరణములు కలుగుచున్నవి.

కాని జీవునికి జననమరణములు కలిగించు కారణ మెయ్యది? దీనికి ఉత్తరము జీవుని స్వకర్మ యనియే చెప్పవలెను. చిదాభాసుఁడు మాయానిర్మితమైన దేహమునం దభిమానికముగ మాయచేతనే చాలింపఁబడుచు నానాకర్మ లొనర్చును, ఆ కర్మలయొక్క ఫలమును అనుభవించుటకు అనువగు దేహము తానుపొంది ఆ దేహమునందుండి మరల మరల నానావిధములగు కర్మ లొనర్చును. తత్కర్మఫలాను భవమునకు అనువగు నానేక దేహములు మరల వానికి ఆవశ్యకముగాఁ గలిగితీరును. ఈ విధముగాఁ గర్మతోఁ గర్మయును బుట్టుకకు బుట్టుకయును ఫలములగుచుండుటచే జీవుఁడు జననమరణ చక్రమందే సదా తిరుగుచుండును. ఇప్పుడు మనుష్యరూపముతో జన్మించిన జీవుఁడు తన దుష్కర్మచేతఁ బిల్లియై పుట్టవచ్చును. ఆ పిల్లితత్కర్మ క్షయానంతరము మరల మనుష్యుఁడై పుట్టవచ్చును. ఒకజన్మము వేఱొకజన్మమునకు దప్పక కారణమే అగుచున్నది. జీవునకి స్వకర్మానురూపమగు జన్మతప్ప వేఱొకవిధముగ ఎన్నఁడూ ప్రపంచమందు జన్మకలుగదు. ఇదే ప్రపంచ ధర్మము. ఇదే జననమరణ సూత్రము లేక విధి. ఈ విధికి వ్యతిరేకముగ ఏ జీవుఁడును సంచరింపఁజాలఁడు. దేవతాజన్మము మొదలు పిపీలికా జన్మము వఱకుఁగల సమస్త జన్మములును ఈ విధికి బద్ధములే అని తెలియవలెను.

కాని మనకు ఈ సందర్భమున ఒక ప్రశ్న కలుగవచ్చును. జీవుఁడు శుద్ధుఁడు కదా తాను దుష్కర్మ చేయుటఎట్లు? దుష్కర్మ చేయకుండఁ దాను ఈమాయాప్రపంచమునకు ఎట్లు రాఁగలిగి యుండును? అధర్మవర్తనము గలిగించు ప్రవృత్తి శుద్ధ జీవ తత్త్వమందు ఎన్నఁడును గోచరింపదు గదా? దీనికి ఉత్తర మేమనిన ప్రవృత్తి లేకున్నను గారణమైనను జీవతత్త్వమందు ఉండియే తీఱవలెను. మాయా ప్రపంచమందు జీవుఁడు జన్మించుటకుఁ గారణము జీవతత్త్వమునకు సంబంధించిన సహజసిద్ధమగు ఒక అసంపూర్ణత అనియే చెప్పవలసి యుండునుగాని ప్రపంచ మాయాదోషము కారణ మెంతమాత్రమును గాదు. ఏమన జీవుఁడు శుద్ధుఁడును, జన్మయుఁడును అగుటచేఁ బ్రకృతి దోషము అతనికి ఎన్నఁడును అంటఁజాలదు. కాని అణుప్రాయుఁడగుటచే అగ్ని కణమునకువలె ఆ అణుత్వమే తనకు దోషముగ ఏర్పడుచున్నది. ఈ తీఱని అణుప్రాయత్వదోషముచే జీవుఁడు తనంతటఁదాను మాయచే ఆకర్షింపబడి ఈ అచిత్ప్రపంచమునఁ బ్రవేశించినఁ బ్రవేశింప వచ్చును. లేదా, తాను చిత్ప్రపంచమందు, అనఁగా "దేవుని రాజ్య" (Kingdom of God) మందుండి సదా భగవత్సేవ యొనర్చుచు సంసార పతన భయము లేకుండఁ గూడ ఉండవచ్చును. అల్పత్వదోషముచే అందఱి జీవులకును ఏల పతనము కలుగఁగూడదు? అనినచో దానికిఁ గారణము చెప్పుచున్నాను. జీవుఁడు

అణుప్రాయుఁ డైనను తటస్థుఁడని కూడ వేదము చెప్పుచున్నది. తటస్థుఁడను అనఁగా చిదచిత్స్వభావములుగల రెండులోకములందును సంచరణ మొనర్చుటకు అర్హత గలవాఁడని అర్థము. జీవుని అవస్థానము చిదచిత్ప్రపంచముల సంధిస్థానమనికూడఁ జెప్పఁబడినది. సంధిస్థానమందున్నందుచేతనే తాను చిత్ప్రపంచమందుండి భగవత్సేవ చేయుటయో, అచిత్ప్రపంచసంబంధమగు సంసారమునఁబడి ప్రపంచభోగములు అనుభవించుటయో, తనస్వబుద్ధిచేఁ బరిష్కరించుకొని తాన యిష్టమువచ్చినట్లు చేయుటకు జీవునికి అనుకూలతఁ గలుగుచున్నది. అనఁగా, శుద్ధజీవుఁడు స్వతంత్రుఁడని దీనికర్థము. జీవుఁడు ప్రపంచభోగముల నభిలషించినపుడు తాను మాయాబంధమునందే చిక్కుకొనుచున్నాఁడు. ప్రపంచభోగాల సత్యమే జీవుఁడు భగవంతునియెడఁ జేసిన మహాపరాధము. మాయాబంధమే దీనికి ఫలము.

చిదాభాసుఁడు ఎట్లు జనన మరణముల పొందుచున్నాఁడని అడుగవచ్చును. మనము ఇచ్చట విచారించిన దానినిఁబట్టి చూడఁగా ఆతఁడు ప్రాకృతాహంకారమునకు లోనై విషయసంబంధము కల్పించుకొని కర్మలు చేయుచు వానిఫలములను అవశ్యముగఁ దాను అనుభవించుచున్నాఁడు. “అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్” అనియే శాస్త్రము. ఒక జన్మకు సంబంధించిన కర్మలే వేఱొక జన్మకుఁ

గారణము లగుచున్నవని మునుపే చెప్పఁబడినది. మనోరూపమగు సూక్ష్మశరీరమే కర్మవాసనలకు నిలయము. ఈ కర్మవాసనచే జీవుఁడు జన్మాంతరమందు సంపాదింపఁ బోవునట్టి దేహముయొక్క లక్షణమును నిర్ణయించుచున్నవి. అంతేకాక అతఁడు ఆదేహమునందుండి చేయునట్టి కర్మల లక్షణమును నిర్ణయింపఁగలవు. కావుననే కర్మకుఁ గర్మమే ఫలమనియు, జన్మకు జన్మమే ఫలమనియు, ఇంతకు మునుపు చెప్పఁబడినది. సముద్రమునందు అలలకువలె సంసారమందుఁ బడియున్న జీవునకుఁ గలిగెడి జననమరణములకు అంతము లేదు. కర్మసూత్రము ఇదియే. కర్మవిధికి నిషేధమే లేదు. కాని జీవుఁడు ఎపుడు స్వస్వరూపమును మఱల సంపాదించి భగవత్ప్రేమా రూపమగు తన స్వధర్మమును మఱల ఆచరించునో, అప్పుడు ఈ జననమరణ రూపమగు కర్మచక్రము నశించిపోవుచున్నది. భగవద్భక్తిచేతనే జీవునికి స్వస్వరూపలబ్ధి కలుగుచున్నది కాని వేఱొకవిధముగ అది కలుగనేరదు. భగవద్భక్తి చేతనే జీవునకు భోగవాంఛలు నశించుచున్నవి. "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టేపరావరే" అని వేదవాక్యము. భక్త్యాచరణమందు జీవుఁడొనర్చు కర్మలు భగవత్ప్రీత్యర్థములగు కర్మలగుటచే అవి అతనికి మఱల జననమరణము లిచ్చునట్టివి కాకపోవుటయే కాక జన్మాంతర కర్మల ఆవేగమునుగూడఁ బూర్తిగ నిలుపజాలినవి అగుచున్నవి. ఈ రీతిగఁ గలుగు

అవస్థితికే ముక్తి యని పేరు. ఇట్లు సకల విషయ భోగములందును విముఖతను కలుగఁజేయు ప్రాకృతమగు మాయా సంబంధము అతనికి బూర్తిగఁ దెగుటయు, భగవత్పారిషదుఁడగుచుఁ దన నిత్యనివాసమగు పరంధామము లేక నిత్యలోకము నందు సదా భగవత్సేవ యొనర్చుటయు, జీవునికిఁ గలుగు ఈ ముక్తిదశయొక్క లక్షణమని తెలియనగును.

కాని భగవద్భక్తి చేయక యితర దేవతల యెడల భక్తి గలిగినవారికి ఎట్టిగతి కలుగుచున్నది? ఇందు విషయమై శ్రీ కృష్ణుండు గీతలయందు ఈ విధముగఁ జెప్పెను.

"యాంతి దేవ వ్రతా దేవాన్,
పితౄన్యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా,
యాంతి మద్యాజినోఽపి మామ్" (గీ. 9—25)

దేవతలను ఆరాధించువారు దేవలోకమును బొందుదురనియు, పితృదేవతలను బూజించువారు పితృలోకమునకుఁ బోవుదురనియు, భూతములను బూజించువారు భూతములనే పొందుదురనియు, భగవంతునిఁ బూజించువారు భగవంతునినే పొందుదురనియు దీని కర్థము. ఇందులోఁ జెప్పిన నాలుగు లోకములలో మొదటి మూఁడును ప్రాకృత మయములగు భోగలోకములు. ఆ లోకములందుండు వారలు ఆయాలోకములకు సంబంధించిన భోగములనుదాము ఈ భూలోకమందు

చేసిన కర్మలకు ఫలరూపములుగా గొప్పవిగనో, గొప్పగనో, అనుభవించి భోగకాలము తీఱినవెంటనే మఱల భూలోకము నకు అరుదెంచుచున్నారు. గీతలయందు ఇట్లున్నది.

"శ్లో. త్రైవిద్యామాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివిదేవభోగాన్ (గీ. 9—20)

శ్లో. తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతమ్ కామకామా లభంతే." (గీ 9—21)

నాలుగవదియగు భగవల్లోకము, అనఁగా సత్యలోకము. ఈ ప్రాకృతలోకములకు అవ్వలనుండునట్టి చిన్మయ లోకమగుచున్నది. అందు జేరినవారికిఁ బునరావృత్తి భయము లేదు.

"శ్లో. నతద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ"—(గీ. 15-6)

"ఆ పరంధామమును మనము జేరినంతట మానవునికిఁ గలిగెడు సంసారసంబంధమగు శోకమోహములును, గష్టములును గట్టెక్కుచున్నవి." ఆ పరంధామము బైబిలులో ఇట్లు వర్ణింపఁబడినది. "మఱియు, అచ్చట రాత్రిఅనునది లేదు; దీపముకాంతి లేదు. సూర్యకాంతికూడ అవసరము లేదు. ఏమన, భగవం

తోడనే అచ్చటి సమస్తమును గాంతి నిచ్చుచున్నాడు. అచ్చటి వారందఱును శాశ్వతులై యుందురు." (Revelation XXII-5) సోహంవాదులగు బ్రహ్మమార్గావలంబులఁగూర్చి శ్రీమద్భాగవతము ఇట్లు చెప్పుచున్నది.

"శ్లో. యేఽన్యేఽరవిందాక్ష! విముక్తమానిన
స్త్వయ్యస్తభావా దవిశుద్ధబుద్ధయః
ఆరుహ్య కృచ్ఛ్రేణ పరంపదం తతః
పతంత్యధోఽనాదృత యుష్మదంఘ్రయః"

జ్ఞానమార్గము వారు అత్యున్నత ప్రదేశమగు బ్రహ్మధామము వఱకుఁబోయి అచ్చట వారలకు భగవద్భక్తి అనెడి ఆలంబనము దొరకకుండుటచే వారలుమఱల భూలోకమునకువత్తురని దీనిభావము. ఆత్మ (జీవ) వినాశరూపమగు నిర్వాణముక్తిగూడ వారికి అనధికలగుటచేత, ఆత్మసంబంధమును, శాశ్వతమును అగుజ్ఞాన జ్ఞాతృజ్ఞేయ రూపమగు త్రిపుటియొక్క నాశనము కోఱకువారుసదా ఉద్యుక్తులై యుందురు.

యోగమార్గమువారిని గూర్చి వేదముచెప్పునది ఏమన, వారలలోఁ గొందఱు పరమాత్మ ధ్యానపరులగుటచే మహర్లోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకమువఱకుఁబోయి, తమభక్తికి అనురూపములగు సుఖభోగములను ఆయాలోకము లందుఁ గొంతకాలము అనుభవించి, మఱల మనుష్యలోకమునకు అరుదెంచి ఉత్తమకులములందు జన్మించుచున్నారు.

వారిలోఁ గొందఱు పుణ్యవిశేషములు పొందినవారై నిర్వాణముక్తిఁ గోరుచు, బ్రహ్మస్థానమున నఱకుఁబోవు అచ్చటనుండి మఱల భూలోకమునకు వత్తురు. ఈ విషయమే శ్రీమద్భాగవతమందు ఈ క్రిందివిధముగఁ జెప్పఁబడినది.

శ్లో. [illegible]॥
[illegible]॥

కాని మహమ్మదీయ క్రైస్తవమతములు ఈ సిద్ధాంతమును అంగీకరించినట్లు కనబడదు. దేవుఁడు ఈసృష్టిసంపదయును ఒక్కనాఁడే నిర్మించెనని వారు నమ్ముదురు. ఈ లోకమునఁ గనఁబడు వివిధవస్తుసంచయమును అతఁడే విభజించెననియు, ఈ లోకమునందు జన్మించిన పిమ్మటనే జీవుఁడు సత్కర్మనైనఁ జేయుటగాని, చేయఁగలుగుటగాని, సంభవించుచున్నదనియు, వారలు చెప్పెదరు. ఈ జన్మలో తాము నొనర్చిన కర్మలయొక్క ఫలమేతాము అనుభవించుటకు అర్హు లగుచున్నారు. కాని ఈ జన్మ చాలించినంతటనే జీవులకు ఫలానుభవము కలుగనేరదు. తమతమ శరీరములను విడిచిన జీవులలో బుణ్యాత్ములగువారు "ఇల్లీన్" అనుస్థలమునందును, పాపుల లగువారు "సిజ్జీన్" అను స్థలమునందును, ఖియామత్ (విచారణదినము, **Day of judgment**) వఱకును ఉందురు. ఇస్రాఫీల్ అను దేవదూత ఆనాఁడు 'సూర్' (బిగులు, **Bugle**) ఊఁదినంతనే సమాధిలోనున్న తమశరీరములలో వారు ప్రవే

కించి చెప్పినట్లు త్వరత్వరగా నడచెదరు. భూమిలోనుండి మఱల అనాయాసముగ వారలకు శరీరములు ఏర్పడుచున్నవి. ఇందుకు ప్రమాణవాక్యము ఖొరానునందు గలదు. "(నేను) భూమి నుండియే మిమ్ములను పుట్టించితిని. మఱియు దానిలోనికే మిమ్ములను దీసికొని పోవుదును. మరల (రెండవపర్యాయము) అందులోనుండియే మిమ్ములను దీసెదను.*" బైబిలునందుం గూడ ఇట్లు చెప్పఁబడినది. "భగవంతుఁడు మనుష్యుని మట్టితో నిర్మించి వాని నాసికారంధ్రముల మూలమునఁ బ్రాణమును బ్రవేశపెట్టెను. అప్పుడు మనుష్యుఁడు సజీవుఁ డాయెను (Genesis II—7).

దీనినిబట్టి క్రైస్తవులు విచారణాదినమున స్థూలశరీరములతో లేచినట్లు కనఁబడుచున్నది. దీనిని బలపఱచుచు ఈజిప్టు చక్రవర్తియగు "ఫరోవా" అనునతనితో దేవుఁడిట్లనెను. "కాఁబట్టి ఈ దినమున నీయొక్క శరీరముతో నిన్ను రక్షింతును. ఇది నీ తరువాత వచ్చెడి వారలకు నిదర్శన నిమిత్త మగుచున్నది. ♦"

కావున విచారణ దినమందు మహమ్మదీయశాస్త్రము ప్రకారము జీవు (రూహు) లకు స్థూలవాసన తప్పనట్లు కనఁ

---

* మిన్‌హా, ఖలఖ్నాకుమ్, వఫీహా, నుఈదుకుమ్, వమిన్‌హా, నుఖ్రిజుకుమ్, తారతన్ ఉఖ్‌రా—ఖొరాను.

♦ ఫల్‌యౌమ నునజ్జీక, బిబదనిక, లితకూనలిమన్, ఖల్ఫక ఆయా—ఖొరాన్.

బడదు. క్రైస్తవమతమందుఁగూడ ఆనాఁడు జీవునకు (సోల్)కు ప్రపంచవాసన ఉన్నట్లు కనఁబడుచున్నది. కాని పుణ్యాత్ములగు జీవులు దివ్యరూపములతో నిత్యలోకము (బహిస్టు) లేక దేవుని రాజ్యమునకుఁబోవుదురని చెప్పఁబడినది (St. matthew XXII-30.)

మహమ్మదీయ క్రైస్తవ సిద్ధాంతముల ననుసరించి, ఏదేని ఒక కారణముచే బాల్యమునందు సాధుసంగ లాభము నొందినవాఁడు చేసిన సత్కర్మకు దేవునివలన అనంతసత్ఫలము లభించుటయు, దన ప్రయత్నముకాని, తన నేరముగాని, సుమాత్రము లేకున్నను దుష్టసహవాసము బాల్యమునందు దొరకి దుష్కర్మ యొనర్చిన వానికి అనంతముగు దుష్ఫలము లభించుటయు సంభవించుచున్నది.

సంసార మండలములోఁ పడకమును పే జీవుల కందఱకును కర్మాచరణము కొఱకు సమానములగు నవకాశము లిచ్చి తన ఆజ్ఞలను నెఱవేర్చుపని వారలకుఁ గలిగించి నపుడు తత్కార్య నిర్వాహకమందు వారలయందు నోచెడు ప్రవర్తనభేదమునుబట్టి వారలను శిక్షించుటయో మన్నించుటయో సమంజసమగుపనిఅని హిందూమతము చెప్పుచున్నది.

మహమ్మదీయ మత పరిభాషలో "రూహు" అని చెప్ప బడునదియును, క్రైస్తవులచే "సోల్" అని పిలువఁబడు నదియును ఒకటే అయినను హిందువులచే "జీవుఁడు" అని

పిలువబడుదానికంటె అపరిమితిగా భిన్నములుగనే కనఁబడు చున్నవి. హిందూమతము ననుసరించి జీవుఁడు భగవదంశమే అని యింతకుముందు చెప్పఁబడినది. బద్ధదశయందైనను జీవునికిఁ బ్రకృతి సంబంధము లేశమైనను లేదు. జీవుఁడు ముక్తావస్థయందు సత్యలోకమును జేరినపుడు ప్రకృతియొక్క ఆకర్షణశక్తి కూడ వానిని ఏమియుఁ జేయఁజాలదు. "రూహు" అనునదియును, "సోల్" (Soul) అనునదియును, ప్రత్యేక తత్త్వములే అయినను భగవత్తత్త్వము కంటె భిన్నములుగ గనఁబడు చున్నవి. పునరుత్థాన (Resurrection) కాలమందుఁ గూడ ప్రపంచవాసనలు వాని నాశ్రయించి యుండుటచేఁ దా మొనర్చిన పుణ్యకర్మలకు ఫలమనుభవించుటకు బెహిస్త లేక స్వర్గమునకుఁ బోవునప్పుడు కాని, తా మొనర్చిన పాపకార్యముల ఫలమనుభవించుటకు దోజక్ (Dojak) లేక నరకమునకు బోవునప్పుడుగాని, "రూహు", "సోల్" అనువారికిఁ బ్రకృతి సంబంధమున్నట్లు కనిపించుచుండును. పైనిఁ జెప్పిన స్వర్గ రూప నిత్యలోకము (Heaven, paradise) కంటె శుద్ధజ్ఞాన మయమగు అవస్థానము హిందూ మతమునందు జెప్పఁబడి నది. కావున హిందూమతము ననుసరించి జీవుఁడును దేవుఁడును నొక శుద్ధావస్థామునందు కలియుటకు గాని జీవుడు అచ్చట నిత్యదాస్యవృత్తి నవలంబించి దేవునికి శుద్ధభక్తి యొనర్చుటకు గాని, సంపూర్ణమగు అవకాశము కలుగుచున్నది.

దీనినిబట్టి చూడఁగా మహమ్మదీయ క్రైస్తవ మతములకు సంబంధించిన శ్రుతివాక్యములయందు అసంపూర్ణత్వమైన ఉండియుండవలెను; లేదా, ఆవాక్యములకు విపరీతార్థమైనను గల్పింపఁబడి యుండవలెను; లేదా, ఈ రెండునుగూడ వాస్తవములై ఉండవలెను. బాగుగ ఆలోచించి చూచినచో ఈ రెండుఁగూడ వాస్తవములనియే చెప్పవలసి యుండును. ఏమన, శ్రౌతవాణి, (Revelation) వినువారలకు గల పారమార్థికాధికారము ననుసరించి ప్రవర్తించును. కావుననే క్రీస్తుప్రభువు మహమ్మదుకూడఁ దమ శిష్యులకు ధర్మబోధ సేయుచుఁ దాము వారలకుఁ జెప్పిన దానికంటె పెక్కింతలు ధర్మవిషయము ఇంకను మిగిలియే ఉన్నదని చెప్పిరి. భగవంతునితో ముఖాముఖిగ సంభాషించుటకుఁ దగినంత ఆత్మశక్తి కలవాఁడే భగవత్సంకల్పములను ఎఱుంగఁ గలిగియుండును. అతఁడే భగవద్వాక్యము లనఁబడు శ్రుతివాక్యముల యొక్క సరియైన అర్థము తెలిసికొనఁ గలిగియుండును.

ధర్మసమ్మతమగు ప్రతిమతమందును దన్మతానులంబులు (1) అంతర్ముఖులనియు, (2) బహిర్ముఖులనియు, రెండువిధములుగ ఉందురు. అంతర్ముఖులు శ్రుతివాక్యములను, గురువాక్యములను లెస్సగ అర్థము చేసికొనఁ గలిగినంత ఆత్మశక్తి కలిగియే ఉందురు; వారు ఎల్లప్పుడును, అల్పసంఖ్యాకులుగనే యుందురు. కాలక్రమమున వారల సంఖ్య మఱింత మఱింత

స్వల్పమగుచుఁ బోదకు పక్కారుకులకు నిలిచియుండక పోవచ్చును. వారలసంఖ్య తగ్గుచున్నకొలఁది మతకర్మము చెడుటయు, సత్యము రూపుమాయుటయు సంభవించెను. తుదకు ఆమతము మర్మరహితమే యగుచున్నది. అప్పుడు సన్మతావలంబులు తమ మతము గొప్పదని ప్రోత్సాహము చేసిరి కాని, తమ మతము బోధించు ధర్మవిషయములు వారికి తెలియకుండుటచే వాని రక్షణగూర్చి వివాదపడుట యంతయే యుండెను. వస్తువును విడిచి దాని నీడ కొఱకుఁ బ్రాకులాడుటవంటి దగును. తమ మతగ్రంథములందుఁ జెప్పిన విధులను చాలునాళ్లు చేసియు, స్వకార్య సాధనము కొఱకు వానికి విపరీతార్థములు కల్పించియు, తుదకు మతమును బూర్తిగ ధ్వంసము చేయుదురు. బహిర్ముఖుల లక్షణము ఇట్టిదే.

మన మతమునకు సంబంధించిన వని చెప్పుచు అనేకు లాచరించు ఘోరములును, హింసాత్మకములును అగు కర్మలు శాస్త్రవిధికి వ్యతిరేకముగఁ జేయఁబడిన కర్మలే అగుచున్నవి. వీనికంతటికిని అర్థకాములును, పరమార్థ శూన్యులును, పండితమ్మన్యులును అగు గురునామ ధారులే ఉత్తరవాదులు. ఈ కాలమున సద్గురువు దొరకుట అంత సులభమగు పనికాదు.

# ఇతరుల కెట్టిమేలు చేయవలెను?



"ఇతరులకు మేలు చేయుము" అనెడివాక్యము ప్రసిద్ధ వాక్యమే. ప్రతిమనుష్యుఁడును ఇది తాను ఎఱిఁగియున్నట్లును, దీనిని అనుసరించు చున్నట్లును, గూడ నటించుచుండును. కాని నిజముగ ఎవరును దీనిని ఎఱిఁగి యుండుటయు లేదు, అనుసరించుటయును లేదు. "ఇతరులకు మేలుచేయుము", అను వాక్యమునందలి తత్త్వము అంత సులభముగ బోధపడునది కాదు. కావున భక్తిమార్గము ననుసరించి ఈవాక్యమును ఇచ్చట విమర్శింతము.

ఈ వాక్య విమర్శనమందు అయిదు సమస్యలు బయలు వెడలు చున్నవి. వానిని మనము సూక్ష్మముగ విచారింప వలసి యుండును. అవి ఎవ్వివి అనిన :

1. ఇతరులకు ఎట్టిమేలు చేయవలెను ?
2. మేలుపొందవలసిన ఇతరులు ఎవరు ?
3. ఇతరులకు మేలుసేయుపనికి ఎట్టివారు తగినవారు ?
4. ఇతరులకు మేలుచేయుట ఎట్లు ?
5. ఎట్లు ఇతరులకు మేలుసేయవలెనో బోధించువారు ఎవ్వరు ?

ఈ రెండును సమస్యలను ఒకదానితో నొకటి సంబంధించి యున్నందున ఒకదానిని విమర్శించుచున్నప్పుడు మఱియొకదాని విమర్శనముగూడ నందులో గలసిపోవుచుండును. ముందుగ వానిలో మొదటి రెండు సమస్యలను విచారింతము.

ప్రపంచములో "మేలు" అనుశబ్దమునకు "ఇతరులు" అనుశబ్దమునకును, మనుష్యులు తమకుంగల భిన్నాభిప్రాయములను బట్టి వేఱు వేఱగు అర్థములను జెప్పుదురు. మిక్కిలి స్వార్థపరుండగు మనుష్యుండు సదా అతండు తననుగూర్చి తప్ప ఇతరులను గూర్చి తలంపనే తలంపండు. అతండు తనకొఱకే జీవించుచుండును. హాయిగా దినుటయు, త్రాగుటయు, దిరుగుటయు, అనునవే అతని జీవితాదర్శములు. ఇట్టిజీవితము ఇతరులకు ఆదర్శప్రాయముగ నుండవచ్చునా ? అట్లుండుటకు ఎంతమాత్రమును దగదు. ఏమన, అట్టివాని జీవితము పశుప్రాయమును, నిరంకుశమును అగుచుం బరబాధకముగ ఉండును. తనవిషయభోగములు తాను సాధించుటలో ఇతరులకుం గలుగు కష్టసుఖములతో అతనికిం బనిలేదు. ఇంతేకాక తన శరీరమునకును, మనస్సునకును మేలు చేయుటలో ఈ రెండింటిని అధివసించి యున్న తన ఆత్మయొక్క మేలు సంగతి తలంపనైనం దలంపండు. కాంబట్టి ఇట్టి స్వార్థపరుండు "మేలు" శబ్దమునకును, "ఇతర" శబ్దమునకును జెప్పెడి

అర్థము మిగుల సంకుచితమైనది అగుటచే అది మన జీవిత మునకు ఆదర్శమే కాదు.

ఇఁకమఱియొక విధమగు జీవితమును విచారింతము. తనగుఱ్ఱమందు అపారమగు మోహముగల ఒక మనుష్యుఁడు ఉన్నాఁడనుకొందము. "ఇతర" శబ్దమునకు అతఁడు చెప్పెడి అర్థము గుఱ్ఱమే. అతని జీవితమంతయు, ఆగుఱ్ఱమునకు మేఁత బెట్టుట యందును, దానికొఱకు చక్కని జీనులు సంపాదించుటయందును, దానినిఁ బుష్టముగను, బలిష్ఠముగను జేయుట యందును, వినియోగపడుచుండును. ఇది సార్థక జీవనమా ? ఎంతమాత్రమునుగాదు. ఇందుకుఁ గారణములు ఏవవిన, దాను ఒక్కఅశ్వమునే బోషించుచు ఇతరాశ్వములను బోషింపకుండుట మొదటి కారణము. ఆగుఱ్ఱమును బోషించుట వాస్తవముగఁ దన మేలుకొఱకేగాని దానిమేలుకొఱకుఁ గాదనుట రెండవకారణము. తాను ఆ గుఱ్ఱమును బోషించుటలో దాని అంగీకారము ఏమాత్రమైనను లేనందునఁ దన పోషణవిధానము దానికి మేలుచేయుటకు బదులు కీడుచేయవచ్చుననుట మూఁడవకారణము. తాను గుఱ్ఱము యొక్క శరీరమునకు మాత్రమే మేలుచేసి దాని ఆత్మకు మేలుచేయకుండ విడిచెననుట నాలుగవకారణము. తనకు ఆగుఱ్ఱముపై వెఱ్ఱిమోహము కలిగి యుండుటచేఁ దనకే తీఱని ముప్పు కలుగుచున్నదనుట అయిదవకారణము. తీఱని ముప్పు

ఏమనిన: మన శాస్త్రములందలి వాక్యములు యథార్థము లైనచో జడభరతునికథయందువలె అతఁడు మఱల జన్మించి నపుడు గృహస్థుని జన్మమేకదా ఎత్తవలసి యుండును ?

ఇఁక మఱియొక విధమగు జీవితమును విచారింతము. తనకుటుంబమును బోషించుకొనుచున్న ఒక గృహస్థుఁడున్నాఁ డనుకొందము. "ఇతర" శబ్దమునకు ఇతఁడు చెప్పెడి అర్థము అంత సంకుచితమైనదికాదు. కొంత విస్తృతిగలదిగా అగు చున్నది. "ఇతరులు" అనఁగా ఇతని తల్లి, తండ్రి, భార్య, బిడ్డలు, పశువులు మున్నగు వ్యక్తులని అర్థము. వీరలనే మనము ఆత్మశేషభూతులని చెప్పుచున్నాము. వారికి అతఁడు అన్నము పెట్టియు, వస్త్రములిచ్చియు, ఇంకను ఇతర సౌకర్య ములొనఁగూర్చియు, వారికి అన్నివిధములచేతను సుఖము గలిగించుటకే ప్రయత్నించుచుండును. ఈ జీవనము ఆదర్శ ప్రాయమైనదా ? కాదు. ఇతర శబ్దమునకును, మేలు శబ్దము నకును అర్థము అతనికిఁగూడ సరిగా తెలియకున్నది. పైనిఁ జెప్పినఁ గారణములను బట్టియే అతని జీవితమందుఁగూడఁ బక్షపాతబుద్ధియు, అసంపూర్ణతా దోషమును గూడఁ జూపట్టుచున్నవి. తన కుటుంబమునకు దాను ధర్మాధికారి అగుటచేఁ దనకుటుంబమువారికిఁ బరమశ్రేయస్సు గూర్చు టయే అతనికి అవశ్యకర్తవ్యము. అట్టి తనవిధితాను చక్కఁగ నిర్వహింపనందునఁ దనకుటుంబములో ఎవరికైన ఎట్టి ఆపద

వచ్చినను దాను అందులకుఁ దప్పక ఉత్తరవాది అగు-
చున్నాఁడు.

ఇఁక వేఱొక విధమగు జీవితమును విమర్శింతము. గోవధముగూర్చి వివాదపడుచున్న ఇద్దఱు మనుష్యులు ఉన్నా రనుకొందము. అందులో ఒకఁడు తనమత గ్రంథములు గోవ ధను అంగీకరించుటచే గోవును జంపుటకుఁ దనకు హక్కుగల దని వాదించును. రెండవవాఁడు తనమతము గోవధను నిషే-ధించుచున్నది కావున దానికిఁ దాను అంగీకరింపనని వాదిం చును. తమ వాద ప్రతివాదములలోఁ బాల్గొనుటకును, దమ తమ పక్షములను బలపఱచుటకును, వీనికిఁ గొందఱు శిష్యు లును, వానికిఁ గొందఱుశిష్యులును ఉండవచ్చును. ఈజీవనము సార్థకమైనజీవనమా? కాదు. ఎంతమాత్రముగాదు. ఇది నింద్య మగు జీవనమని కూడఁ జెప్పవచ్చును. ధర్మజీవనమునకు ఘాతుకకృత్యములతో ఎట్టి సంబంధమైన ఉండునా? పశుహిం సలు, జీవహింసలు మున్నగువానిని ఏమతముకూడ ఆమో దించదు. ఆవును జంపుట ఒకానొకనికి ఆనందదాయకముగ ఉండిన ఉండవచ్చునేమో కాని ఎట్టి పరిస్థితి యందైనను దాను వానిచేఁ జంపఁబడుటకు ఆ ఆవు అంగీకరించునా? అట్లు చంపఁబడుచున్నపుడు ఆ ఆవు ఆనందించునా? ఇది ఇట్లుండ నిమ్ము. తమ ధర్మశాస్త్రము ననుసరించి గోహింస నింద్య మని తేలుచున్నను దానికైఁ దగవులాడుట మాత్రము

సమంజసమగు కార్యమా ? కాదు. ఏమన, దవు నీతిము అంగీకరించు చున్నదని కాని, తమ ఆహారము కొఱకని గాని, ఇతర జీవరాసులను జంపి తినుటకుఁ దమకు హక్కు గలిగి యున్నదని ఒకరు చెప్పినపుడు, ఆ కారణములను బట్టియే ఇతరమతస్థుఁడు ఆవును జంపునపుడు వానితో ఇతఁడు ఏ మొగము బెట్టుకొని తగవాడఁగలఁడు? కాన ఒక జంతువు తనకు నిరుపయోగమైనది గనుక దానిని నశింపఁ జేయుచున్నానని ఒకఁడు చెప్పవచ్చును. ఇట్లు చెప్పుటకూడ అతని పక్షపాతబుద్ధిని, స్వార్థపరత్వమును మాత్రమే వెల్లడించుచున్నది. తనకుఁ బనికివచ్చినంతకాలమే ఒక పశువును ప్రాణముతో నుంచుటయు, దనపని దీఱినంతనే దానినిఁ జంపివేయుటయు, ధర్మసమ్మతములగు కార్యములు కావు. ప్రాణముతోనున్న ప్రతివ్యక్తియు దాని యిచ్ఛచొప్పున అది జీవించుటకు దానికి హక్కుగలదుకాని, అది యింతకాలము మాత్రమే జీవింపవలెనని నిర్ణయించుటకు, ఎవ్వరికిని హక్కు లేదు.

ఇఁకను ఒక స్వదేశాభిమాని జీవితమునువిచారింతము. స్వదేశాభిమాని తన దేశక్షేమము కొఱకు పడెడి కష్టములకు మితి ఉండదు. అతని స్వార్థత్యాగమును జూచి తన దేశము నందు అతనినిఁ ప్రేమింపనివాఁడు ఉండనే ఉండఁడు. కావున, ఈ జీవనమైనను మనకు ఆదర్శజీవనము కాదా? కాదు. పైకి

స్వార్థరహితముగఁ గనఁబడెడి అతని జీవితమందుగూడ స్వార్థపరత్వము ఇమిడియే ఉన్నది. తాను ఏఅభిమానముచేఁ దన దేశముకొఱకుఁ బోరాడుచున్నాఁడో, అట్టి అభిమానమే కలిగి యుండుటచే ఇతర దేశస్థులు కూడఁదనతోఁ బ్రతిఘటించవచ్చును. తన దేశమును మఱియొకని బారినుండి రక్షించుటకుఁ బ్రయత్నించువానికి ఎంతటి అభిమానము కలదో, తన దేశక్షేమమునకై మఱియొక దేశమును దనస్వాధీనమందుంచుకొను వానికిఁగూడ అంతటి దేశాభిమానమే కలదు. కావున ఇట్టి విరుద్ధభావములుగల ఆ ఇరువురను ఎవరు తృప్తిపఱుపఁగలరు? ఇందులో ఒకనిమేలు మనము చూచినప్పుడు రెండవవానికి అది కీడేఅగుచున్నది. కావున ఇట్టి జీవనము కూడ సంకుచితజీవనమే. దీనిచేఁ బరమశ్రేయస్సు సాధింపఁబడ నేరదు.

ఇఁకను ఒక శాస్త్రవేత్త జీవనమును విమర్శింతము. ఒక గొప్పశాస్త్రజ్ఞుఁడు తనకుఁ గల అద్భుత మేధాశక్తివలన అనేక నూతనవస్తువులను గల్పించుటచేఁ బ్రపంచమునకు అంతకును అపారమగు సేవ యొనర్చుచున్నాఁడు. కావున "ఇతర" శబ్దముచే అతఁడు సర్వప్రపంచమనియే అర్థము సేయును. కాని అతని ప్రపంచసేవవలన మానవకోటికిఁ బరమశ్రేయోరూపమగు మేలు కలుగుచున్నదా? కొంచెము విచారించినచో అట్టిమేలు కలుగలేదనియే స్పష్టపడును.

రసాయనశాస్త్ర సాహాయ్యముచే ఒకఁడు నీలిమందు కని పెట్టెను. అందుచే నీలిచెట్లను పెంచి మందు తయారు చేయుచున్నవారికి ఘోరమగు నష్టము కలిగి వారి వ్యాపార మంతయు ధ్వంసమయ్యెనా లేదా ? వస్త్రములు నేయుటకు యంత్రములు నిర్మింపఁబడుటచే ఎన్ని మగ్గములు పాడువడి నంటవాండ్రను క్రింద వినియోగమయ్యెనో మనకుఁ దెలియదా? పొగ బోడలు నిర్మింపఁబడిన తఱువాత నాటుపడవలను గడపు వాండ్రెంత కూటికిలేక దుమ్ము పడలేదా ? కాబట్టి ఒక్కొక్క నూతనకల్పన ఒక్కొక్క జాతి మనుష్యులకు వృత్తినాశనమును, జీవనభంగమును గలిగించుచునే ఉన్నది. నూతన వస్తునిర్మాణముచే బాగుపడెడివారలు అల్పసంఖ్య గలవారే. కావునఁ గల్పితవస్తువులు లేనంత మాత్రమున ప్రపంచ వ్యాపారమునకు ఎట్టి కొఱఁతయుఁ గలుగనేరదు. ఈ కల్పితవస్తువులు ధనవంతులను మఱింత ధనవంతులుగను, ధనహీనులను మఱింత ధనహీనులుగను మాత్రము చేయు చున్నవి. ధనమంతయును ఏ స్వల్పసంఖ్యగలవారికో చేరి పోవుటచే దేశమున మోసము, దొంగతనములు, దోపిడులు, హత్యలు మున్నగునవి నిరాఘాటముగ ప్రబలుచున్నవి. కావున శాస్త్రవేత్తల నూతన నిర్మాణములచేఁ బ్రపంచము నకుఁ గలుగుచున్న నాగరికత ఎందఱి జీవనములనో తీయు చున్నది. "గతకాలము మేలు వచ్చుకాలముకంటె" నని ప్రజ

లందఱును ఘోషించుటకు ఇదియే కారణము. సకలవస్తు సమృద్ధిగల గతకాలమువంటికాలము మఱల ఎప్పుడు వచ్చునని ప్రజలు చూచుచున్నారు. ప్రజలకుఁ ముఖ్యముగఁ గావలసినది ఆహారముకాని నాగరికత కాదు. కడుపునిండఁ దమకుఁ గూడు దొరికినచో ఈ నాగరికతను ఎవరు దక్షిణ పెట్టికూడ ఎవరు కోరితే వారికి దానిని సంతోషపూర్వకముగ ధారవోయుదురు.

ఇంతవఱకు మనము భుక్తివాంఛగలవారలు ఏది మేలని చెప్పుచున్నారో దానినిఁగూర్చి విచారించితిమి. ఇప్పుడు ముక్తివాంఛ గలవారు "మేలు" శబ్దమునకు ఏ అర్థము చెప్పుచున్నారో దానిని విచారింతము.

భోగివలె కేవలముక్తివాదిగూడఁ బ్రపంచముతన చెప్పుచేతలలోఁ దిరుగునని అనియే భావించుచుండును. ప్రపంచమందుగల సకల వస్తువులును దాను జెప్పినరీతిగ ఉన్నవనియే వాదించును. ఇరువురును సుఖము గోరువారే: ఇరువురును దుఃఖమువలదనువారే; కాని భోగి దుఃఖనాశముకొఱకు సదా కృషిచేయుచుండును. కేవల ముక్తివాది దుఃఖము అనునది లేనేలేదుఅని వాదించును. ప్రపంచమునకును, దానినిభోగించెడి తనకును అస్తిత్వము లేదనియు, అంతయుభ్రాంతి కల్పితమనియు, భ్రాంతియే మాయ అనియు వాదించును. ఈ మాయ తొలఁగినచోఁ బ్రపంచము ఉండదు. దానినిఁ జూచువాఁడు కూడ

ఉండదు. అప్పుడు, "ఇతరులు" అనెడి శబ్దమే లేదు. కావున ఇతరులకుఁ జేయువలసిన మేలు గూర్చి ప్రస్తావించుటకే అవకాశము లేదు. ఇట్టి జీవనము ఆదర్శ జీవనమని చెప్పఁగునా! చెప్పఁగూడదు. ప్రపంచమునందలి వస్తుజాల మంతయు మనము ఉండమనిన ఉండునదియును, పొమ్మనినఁ బోవునదియును గాదు. దానికి అస్తిత్వము ఉండియే యుండవచ్చును. అట్లగుచో అది లేదని చెప్పుట వాచా దోషమును, ఒకప్పుడు ప్రమాదకరమును గూడ అగుచున్నది. కావున భక్తి-విరా-ముక్తి గోరు వాని జీవనమునకు నిలుకడ లేదు. అతని జీవనము సర్వజన వాంఛనీయమగు ఆదర్శ జీవనము కాదు.

ఇప్పుడు భక్తాచార్యుల సిద్ధాంతమును అనుసరించి ఏది ప్రపంచమంతకుఁ బరమ శ్రేయోదాయక మగుచున్నదో దానినిఁ గూర్చి విచారింతము. వారు దేనిని పరమ కళ్యాణప్రదముగ భావించుచున్నారో అది ఈ క్రింద నుదాహరించిన దానినిఁ బట్టి తెలియ గలదు.

గీ. అవనిఁ బల్లెలఁ బట్టము లందు నేమ
నామ మొగిఁ బ్రాకు; భారత భూమి జనులు
తాము తొలి శిక్షనొంది యితరుల కపలఁ
బరమ కళ్యాణమును గూర్పఁ బాడి యగును.

భగవన్నామప్రచారముచేతను, భగవన్నామసంకీర్తనము చేతను మానవకోటికిఁ బరమ కళ్యాణము చేకూఱు చున్నదని

యు, నామము నుందుగా అస్వాత సంపాదించినగాని నామ ప్రచారముచేయుటకు ఎవ్వరికిని అధికారములేదనియు. దీని అర్థము. నామప్రచారముగూర్చి ఖొరానునందును, బైబిలు నందునుగూడఁ జెప్పబడినది. "దయాసముద్రుఁడగు భగవంతుని 'అల్లా'అని పిలిచినను సరే. 'అబ్రహామ్'అని పిలిచినను సరే. అతనికి అనేక దివ్యనామములుగలవు మిక్కిలి బిగ్గఱగాఁగాని, మిక్కిలి మెల్లగఁగాని కాకుండ భగవన్నామమును గీర్తింపుము." అని ఖొరాను చెప్పుచున్నది. "భగవంతుని స్తుతింపుము. భగవన్నామమును గీర్తింపుము. భగవల్లీలలను ప్రజలకు వినిపింపుము. భగవన్నామము సర్వోత్కృష్టమైనదని వారలకుఁ జెప్పుము." అని బైబిలు చెప్పుచున్నది. (Isaiah XII–4)

నామప్రచారమన నేమియో ఈ క్రింద వివరింపఁబడుచున్నది.

1. అధికారము గలవారివలన భగవన్నామమువినుట.

2. భగవన్నామమును గీర్తించుట.

3. భుక్తిముక్తి వాంఛలు లేకుండ భగవదనుగ్రహముకొఱకై ప్రార్థనమొనర్చుట.

4. భగవత్సందేశము అర్హులగువారికి బోధించుట.

5. భగవత్సందేశ బోధనమునకు వలయు సౌకర్యములను గూర్చుట.

6. శక్తిసంచారము చేయఁగల భగవద్భక్తులను సేవించుట.

7. భగవత్సేవకొఱకు ఇతరులవలన ఉపాయనములను గొనుట.

8. పైని చెప్పిన కార్యములు చేయుటయందు ఇతరులకుఁ బ్రోత్సహించుట.

భగవంతుఁడు మహద్వస్తువు లన్నిటికంటె మహత్తరమగు వస్తువు; అణువుకంటె అణువుకూడ అగుచున్నాఁడు. అతఁడు అన్నిటియందును గలఁడు. అన్నియు అతనియందుఁ గలవు. అతనిని సేవించినచో అన్నియు సేవింపఁబడినట్లే. అతనిని సేవింపకున్న ఏదియు సేవింపఁబడనట్లే. చెట్టు మొదట నీరుపోసినచో దాని ఆకులును కొమ్మలునుగూడ ఎట్లు తృప్తిఫలమును అనుభవించుచున్నవో, అట్లే భగవత్సేవనముచే సర్వ చరాచర సేవనమగుచున్నది. భగవద్దాస్యమే పరమనిశ్శ్రేయస కరమగుచు మానవకోటికిఁ బరమకల్యాణ మొనఁగూర్చు చున్నది.

ఈవిధమగు భగవత్సేవనమును గూర్చిన అద్భుతమగు ఉదాహరణము మహాభారతమందు ఒకటి కలదు. దుర్యోధనునకుఁ బాండవులయెడ అధిక ద్వేషము కలిగి యుండుటచే అనేక మాయోపాయములు పన్ని వారలను రాజ్యభ్రష్టులనుజేసి అడవికిఁ బంపెను. వారలు అరణ్యా

వాసముచేయు చుండగా అచ్చటనైన వారేల సుఖముగ నుండవలెనను దురుద్దేశము కలిగి వారిని నాశనముచేయ వలెనను కోర్కెతో ముక్కోపియగు దుర్వాసమహర్షిని రావించి తనశిష్యులతోఁ బాండవుల యొద్దకుఁబోయి యొక్క దినము వారికి అతిథిగఉండి రమ్మని ప్రార్థించెను. పాండవ పత్నియగు ద్రౌపదికి మాత్రము తానుభోజనము చేయక పూర్వము ఎందఱు అతిథులు వచ్చినను దానువండిన స్వల్ప వంటకము తోనే వారి నందఱిని దృప్తి పఱుపఁగల అమానుషశక్తి గలదు. కాని ఆమెభుజించిన వెనుక ఆశక్తి ఆమెవద్దనుండదు. తన అరువదివేల శిష్యులను దోడ్కొని దుర్వాసుఁడు పాండవుల కడకు వచ్చువఱకు ద్రౌపది భోజనముగూడఁ బూర్తి అయ్యెను. ముక్కోపి యగు దుర్వాసుఁడు తమ్ము దప్పక శపించునని భయపడి, ద్రౌపది అప్పుడు కృష్ణుని ప్రార్థించి దుర్వాసునిఁ జూచి తానును శిష్యులును స్నానముచేసి భోజనమునకు రావచ్చునని చెప్పెను. ఇంతలోఁ గృష్ణుఁడు ద్రౌపదికిఁ బ్రత్యక్షమై ఆమెవండిన పాత్రలలో ఏమైనమిగిలియుండిన యెడలఁ దనచేతిలోనుంచు మని కోరెను. పాత్రలుశోధింపఁగా శోధింపఁగా ఒక కూరాకు ముక్కకు ఒకపాత్రయందు అంటుకొని యుండెను. కృష్ణుఁడు దానిని భుజించి సంతృప్తుఁడయ్యెను. అతఁడు సంతృప్తుఁడు కాఁగానే, దుర్వాసునియొక్కయు, అతని శిష్యులయొక్కయు

కడుపులు షడ్రసోపేతములగు భోజనపదార్థములతో నిండి క్రిక్కిఱిసిపోయెను. పాండవుల యింటికిఁబోయి వారువడ్డించిన పదార్థములు తినఁజాలక పోయినచో వారు అపహసింతురను బిడియముతో దుర్వాసుఁడును, శిష్యులును, దామువచ్చిన దారినేపోయిరి.

ఇట్టి ఉదాహరణమే రామాయణమందుగూడ ఒకటి కలదు. విష్ణుని అవతారమగు శ్రీరామచంద్రమూర్తి లంకకుఁ బోవుటకు ఒకసేతువు గట్టఁ గోరెను. అతఁడు దానిని సంకల్పించినంతమాత్రమునఁ జరాచర ప్రపంచమంతయు అతనిని సేవించుటకే సిద్ధపడెను. సముద్రము తరంగశూన్యమై నిశ్చలమయ్యెను. రాళ్లు నీటిలో మునుఁగకుండెను. ఉడుత కూడ గడ్డియు, ఇసుకయుఁ దెచ్చి యిచ్చుచుండెను. ఈ విధముగ సేతుబంధనము అతిస్వల్పకాలములోఁ బూర్తి అయ్యెను.

ఈ ఉదాహరణములనుబట్టి ఒక్కపరమతత్త్వమే సకల చరాచరములందును వ్యాపించి యున్నదనియు, ఆ తత్త్వ స్వరూపుఁడు తృప్తినొందినపుడు సకలప్రపంచమును దృప్తి నొందుచున్నదనియు, అతఁడు సేవింపఁబడుచుండ సర్వమును సేవింపఁబడుచున్నదనియు, అతఁడు ఎట్టి సేవ నర్థించినను విశ్వమంతయు, అతనికి దాసినయై ఉండుననియు స్పష్టపడుచున్నది.

భగవద్దాస్యమే జీవస్వధర్మమని భక్తాచార్యు లందఱును ఏకగ్రీవముగ బోధించిరి. జీవుఁడు మనుష్యరూపము వహించినను, వృక్షరూపము వహించినను, శిలారూపము వహించినను, పరమపురుషుని సేవించుటే అతని ముఖ్యధర్మమగుచున్నది. భగవత్సేవనమందే జీవుని జీవత్వము చరితార్థత నొందుచున్నది. భోగబుద్ధిచే గలిగిన భగవత్సేవోన్ముఖత వలన దనకు స్వస్థానమగు ఏ చిన్మయలోకమును మున్ను దానుగోలుపోయెనో, ఆలోకమును మఱలభగవత్సేవచేసియే సాధింపవలసియున్నది. కావున దేహమునకుఁ జేసిన మేలు సర్వోత్తమమైన మేలుకాదు. అట్లేమనస్సునకుఁ జేసిన మేలు కూడ సర్వోత్తమమైనదికాదు. ఆత్మకుజేసిన మేలే వాస్తవమగు మేలగుచున్నది. అదియే పరమనిశ్శ్రేయసము. తాను స్వయముగ భగవంతుని సేవించుటయు, ఇతరులు భగవంతుని సేవించునట్లు చేయుటయు, ప్రతిమనుష్యునకును ప్రధానవిధి యగుచున్నది. భగవత్సేవామార్గమునుండి ఎట్టివాఁడును చలింపరాదు. చలించినచో మనము ఏకకాలమునందే రెండు నేరములు చేసినవారమగుచున్నాము. మనము ఆత్మనాశన మొనర్చుకొనుట ఒకనేరము. ఒకవిధముగ ఇతరుల ఆత్మను గూడ మన అక్రమప్రవర్తనచే నశింపఁజేయుట రెండవనేరము. ఇట్లే మన ఆహారముకొఱకు ఏజంతువును జంపినను ఒక్కుమ్మడి రెండు నేరములు చేయుచున్నాము. వంటకట్టెలకొఱకు

చెట్లను నఱికినప్పుడు కూడ అపరాధద్వయమునే చేయు చున్నాము. ఇల్లుకట్టుటకు కాలనునఱికినప్పుడుగూడ అపరాధ ద్వయమునే చేయుచున్నాము. త్రాగుటకు నీరుత్రోడినప్పుడు కూడ అపరాధద్వయమునేచేయుచున్నాము. ఈకార్యములన్ని యునుభగవదర్పణముగనుభగవత్ప్రీతికొఱకును జేయకున్నచో ఈరెండువిధములగు నేరములును సంభవించుచునే యుండును. వంటచేయువాఁడు భగవంతునికొఱకే వంటకము వండ నగును. నీరుత్రోడువాఁడు భగవదుపయోగమునకే నీరుత్రోడ నగును. చెట్లునఱకువాఁడు భగవదుపయోగమునకే అట్లు చేయనగును. గృహనిర్మాత భగవన్నివాసము కొఱకే గృహమునిర్మింపనగును. భూమిని దున్నువాఁడు భగవత్సేవ కొఱకే అట్లుచేయ నగును. శాస్త్రవేత్తకూడఁదన నూతన నిర్మాణములను భగవంతుని ప్రీతికొఱకే నిర్మింపనగును. ఈ విధముగ విశ్వమంతయు కేవలభగవన్మందిరమగుటయు, విశ్వ మందలిసమస్త జనులునుదమవృత్తి ధర్మములను భగవత్సేవా రూపమున నొనర్చుటయు, అవశ్య కర్తవ్యములు. అట్లొన ర్చినచో అవియే జీవుఁడు మున్నుఁ దానుగోలుపోయిన స్వధర్మజ్ఞానము మఱల అతనికి సిద్ధించుటకుఁ గారణము లగుచున్నవి.

"యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" (గీ.8-22)

అను గీతావాక్యము ఈవిషయమునే చెప్పుచున్నది. మానవుల భక్తిలక్షణము వారు చేయు కర్మలను అనుసరించి యుండదు (గీ. 2–49) ఏకర్మలు సర్వేశ్వర ప్రీతికొఱకుఁ జేయఁబడుచున్నవో ఆ కర్మలు వారు అతనికొఱకొనర్చి అతనికి దాసులే అగుచున్నారు. సమస్త విశ్వమును పాలించు వాఁడు పరమేశ్వరుఁడు, అతఁడే యజ్ఞేశ్వరుఁడును, యజ్ఞభోక్తయును (గీ. 9–24) మనము ఏది ఆలోచించినను, ఏది భుజించినను, ఏకర్మ మొనర్చినను, అవి అన్నియుఁ ఈశ్వరార్పణముగనే చేయవలెను. (గీ. 9–27) లేనిచో, మనము అతని పదవిని అన్యాయముగ ఆక్రమించిన వారమగు చున్నాము. అర్పణ విధానము నిర్ణయించుటకు, అనఁగా, ఏది అర్పింపనగునో, ఏది అర్పింపరాదో తెలియుటకు మనము శాస్త్రమునే ప్రమాణముగ భావింపవలసి యుండును. (గీ. 16–24). శాస్త్రసమ్మతములు కాని కర్మలుగాని, ఆలోచనలుగాని చేయరాదు. అట్లొనర్చినచో అవి భగవత్ప్రీతి కొఱకుఁ గాక భోగబుద్ధితోఁ జేయఁబడినవే అగుచున్నవి. వాని వలన ఎట్టిసుఖమును గలుగనేరదు. శాస్త్రము భగవదిచ్ఛా స్వరూపము. కావున శాస్త్రవిధికి వ్యతిరేకముగ మనము అతనికి ఏమి అర్పించినను అది అతనికి గ్రాహ్యము కాదు. (గీ. 16-23). భగవదాజ్ఞ నొనర్చుటయే భగవత్సేవా లక్షణము.

దేశభక్తుఁడు ఏ స్వాతంత్ర్యము తన దేశమునకుఁ గలుగ వలెనని హాహాకారములు పోరాడుచున్నాఁడో, ఆ స్వాతంత్ర్యము ఒకానొక విధమగు బంధనము యొక్క రూపాంతరమే అని తెలియనగును. ఈ ప్రపంచమంతయు ఒక చెఱసాల. స్వాతంత్ర్యము అనునది ప్రపంచ ధర్మమునకు అన్వయించు పదముకాదు. విశ్వమంతయు బంధనమయమే. ప్రపంచసుఖమును గోరుట అనిన ఒక బంధమును విడిచి వేఱొక బంధమును గోరుకొనుటయే. మనము ఈ చెఱసాలలో ఉన్నంతకాలమును స్వేచ్ఛ అనుమాటకుఁ జెఱసాలలోని ఒక గదినుండి మఱొకగదికి మాఱుచుండుట అనియే అర్థము. మనము ఏ ఐహిక సుఖములకొఱకుఁ బోరాడుచుందుమో, ఆసుఖభోగములే మనలను మఱల బంధించుచుండును. ఒక సుఖమును భోగింపఁబోయి తుదకు ఆసుఖమునకే మనము దాసుల మగుచున్నాము. "భోగా న భుక్తా వయమేవ భుక్తా" అని ఒక అనుభవశాలి చెప్పియున్నాఁడు. ఈవిధముగఁ బ్రపంచ స్వేచ్ఛా కాములమగు మనము బంధన పరంపరనే పొందుచున్నాము. ఇదే మనకు భగవంతుఁడు సంకల్పించిన దండనము. ఈ ప్రపంచమునందు ఈ బంధనములకు అంతము లేదు. వీనినిఁ దప్పించుకొనుమార్గముకూడ లేదు. కావున లౌక్యములగు ఈ తాత్కాలిక లాభములపై మనకుఁ గల దృష్టిని మఱలించుకొనక తీఱదు. ప్రపంచదృష్టిని విడిచి

చిన్మయదృష్టితోఁ జూచినపుడు విశ్వమంతయు మనకుఁ బ్రేమ మయముగా అగపడును. కనుకఁ బ్రేమైకదృష్టితోఁ మనము ప్రపంచమును దిలకించినప్పుడే ప్రేమసముద్రుఁడగు భగవంతునివంశమువారమని మనము చెప్పుకొనుటసార్థకమగును. "మనము భగవంతుని వంశమువారము. భగవంతునితో సంబంధము గలవారు మనమాటలు విందురు. భగవంతునితో సంబంధము లేనివారు మన మాటలు వినరు * * * ఓయీ! ప్రియతముఁడా! మన మొకరి నొకరము ప్రేమింతము గాక. ఏమన, ప్రేమ భగవంతునికి సంబంధించినది. ప్రేమ గలవారందరును భగవంతుని బిడ్డలగుచు భగవంతుని దెలిసికొను చున్నారు. ప్రేమ లేనివారు భగవంతుఁడు లేనివారే. ఏమన, భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడు. * * * మానవుఁడు భగవంతునిఁ జూచుట లేదు. మన మొకరియం దొకరము ప్రేమగలిగి యుందుమేని భగవంతుఁడు మనయం దుదయించును. అప్పుడు భగవత్ప్రేమ మనయందు సంపూర్ణ వికాసము నొందును" అని బైబిలు చెప్పుచున్నది (I. John IV—6, 7, 8 & 12). ఒకరికి మనము చెడుగుచేసినచోఁ దుదకు ఆ చెడుగే మనకు లభించును. చెడుగుకుఁ జెడుగే ఫలము; ద్వేషమునకు ద్వేషమే ఫలము. ఈప్రపంచమునఁ జెడ్డతనము లేకుండఁ జేయవలయు ననినఁ జెడ్డను మంచిచేతను జయింపవలెను. ద్వేషమును ప్రేమచేత

జయింపవలెను. కోపమును మందహాసముచేత జయింపవలెను. ఎడమచెంపపైఁ గొట్టినవానికి వెంటనే కుడిచెంపనర్పింపవలెను. మూఢ విశ్వాసములచే ఎన్నటికిని జ్ఞానము కలుగదు. ద్వేష బుద్ధికిఁ బ్రేమ ఎన్నటికిని ఫలముకాదు. ప్రేమకుఁ బ్రేమయే ఫలము; సేవకు సేవయే ఫలము. మనము అందఱిని బ్రేమించినచో, అందఱును మనలను బ్రేమింతురు. మనము అందఱిని సేవించినచో, అందఱును మనలను సేవింతురు. పులినిఁ జూచి మనము ద్వేషించినచోఁ బులి మనలను అవశ్యముగ ద్వేషించును. కాని మనకు ఎప్పుడు భగవత్ప్రేమ కలుగుచున్నదో అప్పుడు ఆ పులి క్రూరత్వమును విడిచి మనలను బ్రేమించును. అట్లు కాకున్నచో, బ్రహ్లాదునిఁ జావఁద్రొక్కుటకుఁ బంపఁబడిన మదపుటేనుఁగు ప్రహ్లాదునిఁ జంపుటకు బదులు వానినిఁ దనవీఁపుపై నెక్కించుకొని ఆనంద తాండవ మొనర్చునా ? అతనినిఁ గఱచుటకుఁ దెచ్చిన విష సర్పము కూడ అతనియందుఁ బ్రేమదృష్టి కలిగి అతని ఒడిలో ఆడ లేదా ? ఏ భూతముగూడఁ బ్రహ్లాదునకు ఎట్టి హానియుఁ జేయ జాలకుండెను గదా? సహజముగ దుష్టబుద్ధి గల జంతువులు కూడ భగవత్ప్రేమ ప్రభావముచేఁ దమ స్వభావ గుణమును జూపింప వలెను. కావున మనలను జంపుటకు వచ్చినవారినిఁ గూర్చికూడ మున్ను క్రీస్తు ప్రభువు చెప్పినట్లు, "తండ్రీ ! వారిని క్షమింపుము. వారు చేయుచున్న పని వారికే తెలియ

కున్నది" అని చెప్పుటయే యుక్తము. వారు మన యెడల దుష్టబుద్ధిని జూపనిండు. మనము వానియెడలఁ బ్రేమనే చూపవలెను.

ఈ ప్రేమ సందేశమునే ఒకానొక భక్తాచార్య శిష్యునకే బోధించి దీనినే ప్రపంచమందు ఎల్లెడల బోధింపవలయునని ప్రజలనందఱును ఆజ్ఞాపించెను. ఇదిసమస్తజనులును ఆమోదించునట్టి విశ్వసమ్మతమగు సందేశము. ఈ సందేశమునకు వర్ణాశ్రమ జాతి భేద వివక్షత లేదు. సత్కులము, వయస్సు, పదవి, పాండిత్యము మున్నగు వానితో దీనికిసంబంధము లేదు. భగవద్భక్తి సేయువాఁడే అందఱికంటె అధికుఁడని అతని అభిప్రాయము.

ఇంకను ఇతరులకు మేలుసేయు పనికి ఎవ్వరు తగినవారు అనునది విచారించవలసి యున్నది. ప్రేమ ప్రచారకులందఱును సత్యసంధులును, నిష్కల్మష హృదయులును అయి ఉండవలెను. కపటగుణము ప్రచారకునిఁ జెఱచును; ప్రజలనుగూడఁ జెఱచును. నిష్కపటియే గురూపదేశమునకు అర్హుఁడు. ఎంతటి ప్రజ్ఞావంతుఁడైనను గురూపదిష్టుఁడు కానిచోఁ బ్రేమ ప్రచారమునకు అర్హుఁడు కాఁడు. ప్రేమ ప్రచారముసేయువానిని ఆశీర్వదించి వానికి అపారమగు శక్తి నొసంగువాఁడు గురుదేవుఁడు. సదాచారుఁడు సదాచారమునే వృద్ధిఁబొందించును. మిథ్యాచారుఁడు మిథ్యాచారమునే వృద్ధిఁ

బొందించుచు, ప్రజలను సందేహవాదులుగనో, నాస్తిక వాదులుగనో, చేయును. ఇందు విషయమై ఒక కథకలదు.

మనుష్యాహారమునకు వంకాయ శ్రేష్ఠమా ? అను విషయమై ఒకానొకఁడు ఒక పెద్దసభలో ఉపన్యసించుచుండెను. అతఁడు తన వక్తృత్వమహిమను వెల్లడించుచు దానిం గూర్చి కొన్ని గంటలసేపు ప్రసంగించి తుదకు వంకాయ మనుష్యాహారమునకుఁ బనికిరాదనియు దానినిఁ దిన్నవాఁడు దానిలో ఎన్నిగింజలు ఉండునో అన్ని సంవత్సరములు నరకములో ఉండవలసి యుండుననియుఁ జెప్పెను. అప్పుడు అతనిభార్యకూడ ఆ సభయం దుండెను. వంకాయ కూర లేకుండఁ దనఁ భర్తకు అన్నము నోటికిఁ బోదని ఆమెకు బాగుగఁ దెలియును. కాఁబట్టి అతనికి బుద్ధిచెప్పుటకై ఆమె ఇంటికి వచ్చి అన్నము ఒక్కటే వండి ఊరకుండెను. భర్త భోజనమునకు రాఁగానే ఆమె ఆ అన్నము మాత్రమే వడ్డించెను. కూరవడ్డించనందులకు ఆతనికిఁ గోపమువచ్చి ఏల కూరవండలేదని ఆమెను గోపముతో అడిగెను. అప్పుడు ఆమె "నాథా ! నీ ఉపన్యాసము వినుటకు నేనుకూడ వచ్చి యుంటిని. అది పూర్తియై నేను ఇంటికి వచ్చుసరికి అంగడి వేళ మించిపోయెను. కాఁబట్టి వండుటకు ఏకూరయుఁ దొరక లేదు" అని చెప్పెను. ఆమాటవిని అతఁడు "దొడ్డిలోనున్న వంగతోఁటకుఁ బోయి నాలుగు కాయలు తెచ్చి వండలేక

పోయితివా ?" అని అడిగెను. అప్పుడు ఆతనిభార్య, "నాథా! వంకాయ నిషేధవస్తువని నీ ఉపన్యాసములో నీవు నొక్కి నొక్కి చెప్పియుంటివి. కావున నేను ఆ పాడుకూరను ఇంక ముట్టనే ముట్టను సుమా" అని జవాబు చెప్పెను. అదివిని ఆమెభర్త పకపకనవ్వి, "ఓసీ పిచ్చిదానా! వంకాయను గూర్చి వినినవారికి నరకప్రాప్తిగాని, చెప్పినవారికి నరక ప్రాప్తిలేదు" అని సమాధానము చెప్పెను.

ఇట్టిబోధకులు లోకమందు బయలుదేరినప్పుడు వారి మాటలయందు ప్రజలకు ఎంత విశ్వాసముండునో వేరే చెప్పనక్కరలేదు. మిథ్యాచారులు మతప్రచారకులుగ ఉండ రాదని సమస్తశాస్త్రములు చెప్పుచున్నవి.

ప్రేమప్రచారము భగవత్సేవా రూపమునఁ జేయవల యును. భగవత్సేవా విధానమును బోధించువాఁడు గురుదేవుఁడు. గురూపదేశము లేకుండఁ జేయుప్రేమప్రచారము లౌకికవ్యాపారమే అగుచున్నది. భూతలమునకు అవతరించిన భగవత్ప్రతినిధియే గురుదేవుఁడు. భగవత్సేవా విధానమును బోధించుటకంటె వేఱుగువ్యాపారమే అతనికి లేదు. "తట్టుము; నిత్యలోకద్వారము నీకై తెఱవఁబడుచున్నది" అనునది క్రీస్తు ప్రభునివాక్యముకదా? కాని ఎట్లు తట్టవలెను? ఎచ్చటఁదట్ట వలెను? ఈ విషయములు చెప్పువాఁడు గురుదేవుఁడు. నిత్యలోకద్వారము దెలిచి తన శిష్యుని దేవుని రాజ్యమునకుఁ

ప్రవేశ పెట్టువాఁడున్నూడు గురుదేవుఁడే. దైన్యమభ్యసించిన వానికి దేవుని రాజ్యము లభించుచున్నది. క్రీస్తుప్రభువు ఇట్లనెను. "ఈ చిన్నబిడ్డవలె దీనత్వమును అవలంబించిన వాఁడు దేవుని రాజ్యమందు అందఱికంటె అధికుఁడగుచున్నాఁడు. (St. Matthew XVIII—4). వినయము, దైన్యము గలవాఁడే గురుదేవునియొక్కయు, భగవంతునియొక్కయు, పరిచర్యకు అర్హుఁడగుచున్నాఁడు. "భగవంతుని యెదుట దీనభావముతో నుండువారే నిత్యలోకమునకు అర్హులు" అని ఖొరానుకూడఁ జెప్పుచున్నది. గురుదేవునిఁ బ్రేమించువానిని భగవంతుఁడుగూడఁ బ్రేమించుచున్నాఁడు. కావుననే క్రీస్తు ప్రభువు "నేను భగవంతుని వద్దనుండి వచ్చినవాఁడననుచు నీవు నన్ను బ్రేమించుటచే, నాతండ్రి నిన్నుఁ బ్రేమించుచున్నాఁడు" అని చెప్పెను. (St. John XVI—27) భగవదనుగ్రహము కోరువాఁడు నమ్రభావము కలిగియుండవలెనని భక్తాచార్యుల అభిప్రాయము.

> "వవనిధితుల్యము దీనులయెడ భగవంతుని దయ భువిని నమ్ము
> ధని పండితుఁడు కులీనుఁడు వహించును గడు నభిమానమ్ము."

పైనిఁజెప్పిన ధనికుఁడు, పండితుఁడు, కులీనుఁడు అను మూఁడు తరగతులవారును గురుశుశ్రూష నొల్లనంతటి గాఢమగు నభిమానము గలవారగుటచే వారికి నిత్యలోకద్వారము

సదా మూయఁబడియే ఉండును. "ఒంటె సూది బెజ్జమునఁ బ్రవేశించుట ఎంతసులభమో ధనవంతుఁడు దేవుని రాజ్యమునఁ బ్రవేశించుట అంత సులభము" అని బైబిలు చెప్పుచున్నది. (St. Luke XVIII—25). "ఇద్దఱు ప్రభువులను ఎవ్వరును గొలువఁజాలరు. భగవంతునిఁ గొలుచుచు ధనమునుగూడఁ గొలుచుటఅసంభవము (St. Matthew VI-24). ధనపూజ అనినఁ బ్రకృతిపూజయే. పాండిత్యము, సంపద, పదవి మున్నగువానిచేఁ గలుగు స్వాతిశయమే ప్రకృతి వ్యామోహము. "ఇట్టి స్వాతిశయము గలవారలను భగవంతుఁడు వినుటయులేదు. లెక్కగొనుటయులేదు," (Job XXXV—13) కాని ఈమూఁడును స్వతస్సిద్ధముగ దోషయుక్తములు కావు; వాని వినియోగముబట్టి వానియొక్క దోషాదోష నిర్ణయము చేయఁబడు చున్నది. భగవత్సేవయందు వినియోగింపఁబడినపుడు అవి దివ్యప్రభావము గలవి అగుచున్నవి. అట్లు వినియోగింపఁబడనపుడు నరక తుల్యములు అగుచున్నవి. కావున ధనవంతుల ధనమును, పండితుల పాండిత్యమును కులీనులకులమును, ప్రతిష్ఠావంతుల ప్రతిష్ఠయు, ఇట్టి సమస్త విషయములును భగవత్సేవయందు వినియోగింపఁ బడుటయే కర్తవ్యము.

ధన దేవతారాధనము ఎంతటి నిషేధకార్యమో తదారాధకుల సంగముకూడ అంతటి నిషేధకార్యమే. కావున

యథార్థ భక్తిగలవాఁడు ధనారాధనము చేయఁగూడదు సరే కదా డబ్బే దేవునిగ భావించువారితో సాంగత్యముకూడఁ జేయరాదు. ఏమన, వారల సాంగత్యముచేఁ దనకు ధనపిశాచము పట్టి భగవద్భక్తిని మూలముట్టుగ ఊడఁబెఱుకును. భగవంతునియందుఁ దీవ్రభక్తిగలవారుకూడ కొందఱు భాగ్యహీనతచే ధనదేవతకు దాసులగుటఁ జాలచోట్ల వినియున్నాము. కావుననే ఒకానొక యథార్థగురువు శ్రీకూర్మక్షేత్రమందుఁ గుష్ఠరోగ పీడితుఁడగు వాసుదేవుఁ డనునతనిని ఆరోగ్యవంతునిగఁజేసి తన ప్రేమ సందేశమును అతనిచేఁ బ్రచారము చేయింపనెంచి అతనితో ఒక పరి ఇట్లనెను.

"గీ. ఇదిగో నా యాజ్ఞ, శిరసా వహించి నిను
రక్షకుఁడవీవు, లోక సం రక్షణమ్ము
సేయుపని నీది, ప్రకృతి వీచికలు నిన్నుఁ
గలఁత నొందింపఁ జాలవే కాలమునను."

ఇట్టి అపారమగు శక్తిని దన అనుగ్రహమునకుఁ బాత్రులైన తనశిష్యులకు గురువొసంగును. అట్టి శిష్యులు ఎవ్వరికిని హానిచేయరు సరేగదా గురువనెడి సుదర్శనచక్రము తమ్ము సదా రక్షించుచుండుటచే వారికిఁగూడ ఎట్టి అపాయమును గలుగనేరదు. వారికి అట్టి దివ్యతరమగు ప్రాపులేకున్నచో అభక్తులతో వారు కలసి మెలసి తిరుగుచున్నప్పుడు వారికి ఎట్టి అపాయములైనను సంభవించవచ్చునుగదా ?

ఇఁక నాలుగవ సమస్య ఇతరులకు ఎట్లు మేలు సేయుట ? అనునది. ఇతరులకు విద్యాశిక్ష నొసంగుటఁ జాల కష్టము. కష్టమైనను, గాకున్నను విద్య ఆచరణలో రాణించునుగాని నేర్చికొను కాలమందును చెప్పు కాలమందును రాణించదు. చెప్పునది చేయకుండుటయే మిథ్యాచారము. దీనివలనఁ గలిగెడి నష్టమునకు మేరయే లేదు. మిథ్యాచారముగూర్చి పైనిఁ జెప్పఁబడినది. "పుస్తకము బోధకంటె అణువంత ఆచారము మేలు "అనునది ఒకసామెత. ఆచరణగురువే శిష్యులకుఁ గల్పవృక్షము. గురునిజీవితము మహాపవిత్రమైనదగుచు శిష్యులకు ఆదర్శప్రాయముగ ఉండవలెను. తాను జెప్పినది తాను ఆచరించునపుడే దానిని ఇతరులు ఆచరింతురనియు, తాను విశ్వాసపాత్రుఁడైనపుడే ఇతరులను విశ్వాసపాత్రులుగఁ జేయగలిగియుండుననియు, ధర్మప్రచారకుఁడు ముఖ్యముగ జ్ఞప్తియందు ఉంచుకొనవలెను. మనము ఒకరికి సేవ జేయనప్పుడు ఇతరులు మనకు సేవఁజేయుదురు అనుకొనుట అసంభవము. మనము జెప్పునది మనమే చేయనప్పుడు ఇతరులు అది చేయుదురు అని అనుకొనుట కూడ అసంభవమే. కావుననే ఇట్లు చెప్పఁబడినది.

గీ. ఏది నీవాచరింతువ ◆ దే యితరుల
కీవు బోధింప నగుఁజుమ్ము; ◆ నీవు సర్వ
మితరులకుఁ జెప్పి నీవాచరింప కున్న
నెవఁడు నీబోధచేతఁ జరించువాఁడు ?"

ఎట్లు ఇతరులకు మేలుసేయవలెనో బోధించువారు ఎవ్వరు? అనునది ఆఱవదియు గడపటిదియు అగు సమస్య. గురుదేవుఁడనిగో దీనికి ఉత్తరము. గురుదేవుని కంటె వేఱొకఁడు ధర్మప్రచార మొనర్చుటకు ఎంతమాత్రము అర్హుఁడుకాఁడు.

భగవంతుఁడెవఁడో, అతఁడు నివసించు నిత్యలోక మెట్టిదో మనకు ఏమియుఁ దెలియదు. కాఁబట్టి వానినిఁ గూర్చి మనము తెలిసికోఁగ గోరినయెడల నిత్యలోక వార్తలు చెప్పఁగల భగవత్పారిషదుఁడు నిత్యలోకము నుండి అవతరించవలసి యుండును. అట్టివాఁడు అవతరింపనిచో, భగవంతుఁడెవఁడో, భగవంతుని సేవించుటెట్లో, భగవదర్పితములుగఁ గర్మలు చేయుటెట్లో మనకు యథార్థముగఁ జెప్పువారు ఎవ్వరును లేరు. ఈసమాచారము మనకుఁ దెలియుటకు రెండు ఆధారములు కలవు. ఒకటి శాస్త్రము, రెండవది గురువు. కాని శాస్త్రవాక్యములకు విపరీతార్థములు చెప్పఁగల కాలము ఇపుడు వచ్చుటచే ఈకాలమున నిత్యలోక వృత్తాంతము సద్గురుని శ్రీముఖమునుండి వినుటయే శ్రేయస్కరము.

ఇచ్చట మఱియొక కష్టము ఏర్పడుచున్నది. శాస్త్ర గ్రంథములయొక్క వాస్తవార్థము తెలియకుండ భగవంతునిఁ జేరుమార్గము మనకుఁ దెలియదుగదా? భగవన్మార్గము ఎట్టిదో తెలియకుండ ఆమార్గమున మనలను నడపింపశక్తి గలగురువును

ఎంచుకొనుట ఎట్లు సాధ్యపడును? నిజమే. శాస్త్రము ఎట్టిదో మనకుఁ దెలియదు. తెలిసినను, అందలి వాక్యములకుఁ గల సరళార్థము మనకు బొత్తుగఁ దెలియదు. కావున ఒక అపాత్రుని మనము గురువుగ నెంచి కొనినచో మనగతి యేమి? మనము అశక్తులమైనపుడు మనకై యథార్థ గురువును ఎంచిపెట్టుటకు ఎవరిపై మనము ఆధారపడవలసి యుండును? దీనికి ఉత్తరమేనిన: భగవంతుఁడే మనకు గురునిఁ బంపునని భక్తాచార్యులు చెప్పుచున్నారు. భగవంతుఁడు అచేతన పదార్థము కాఁడు. అతఁడు సర్వమును జూచుచున్నాఁడు. సర్వమును దెలిసికొనుచున్నాఁడు. నిష్కపట స్వభావముగల వారికి సర్వేశ్వరుఁడే సద్గురులాభము నొసంగుచున్నాఁడు. భగవంతుఁడును, గురువును ఏకతత్త్వమే. భగవంతుఁడు ప్రభుతత్త్వము, గురువు సేవక తత్త్వము; ప్రభువు సేవకుని, సేవకుఁడు ప్రభువును, లెస్సఁగ నెఱింగి యున్నారు. "తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి" అనునది గీతావాక్యము (గీ.6-30). సేవకుఁడు ప్రభుని ఆజ్ఞలను సదా నెఱవేర్చుచుండునని ఇంతకు ముందే చెప్పఁబడెను. కావునఁ దనకు సేవకుఁడై తన అనుగ్రహమునకుఁ బాత్రులైనవారికిఁ దన ప్రభువగు భగవంతుని సంకల్పములను దాను వివరింపఁ గలిగియుండును. భగవత్సంకల్పము నెఱిఁగి భగవత్సేవ చేయఁగోరువారు, గుర్వనుగ్రహమును సంపా

డించి గుర్వాజ్ఞలను పాలింపవలసి యుండును. అట్లు చేయని వారికి భగవత్సేవ లభింప నేరదు. గురుని సాయము లేకుండ భగవత్సేవ చేయ మొదలిడిన వారు పోయెడిమార్గము అపమార్గమే అగుచున్నది. గుర్వావశ్యకతం గూర్చి శ్రీ మద్భాగవతమందు ఇట్లున్నది.

"శ్లో. ఆచార్యం మాం విజానీయా
న్నావమన్యేత కర్హిచిత్
నమర్త్యబుద్ధ్యా సూయేత,
సర్వదేవమయో గురుః"

"గురుని నన్నుగా నెఱుంగుము. వానినిఁ గొంచెపు దృష్టితోఁ జూడకుము. అతనిని మర్త్యునిగ భావింపకుము. అతఁడు సర్వదేవమయుఁడు" అని ఈ శ్లోకమునకు అర్థము.

కులగురునిఁ దప్ప వేఱొకగురుని సేవింపరాదు అను పద్ధతి కొన్ని మత సంఘములయందుఁ గలదు. ఇది మిగుల దురాచారము. భక్తాచార్యులు ఈ ఆచారమును నిషేధించుచు సద్గురుని లక్షణము ఈ క్రింద వివరించిన విధముగఁ జెప్పి యున్నారు.

గీ॥ బ్రాహ్మణుండైన నేమి ? శూద్రకులజాతుఁ
డైన నేమి ? తా సన్యాసి యైన నేమి ?
పరమ పురుషు నెఱింగిన పావనుండె
గురుఁడగును; కాఁడుపో కులగురుఁడు గురుఁడు.

యథార్థగురు నిర్ణయమందు బ్రాహ్మణుఁడు, సన్యాసి, శూద్రుఁడు అను వివక్షతతోఁ బనిలేదు. తనకుఁగల అప్రాకృత జ్ఞానముచేతనే గురుఁడు గురు స్థానమునకు అర్హుఁడగుచున్నాఁడు. గురుతత్త్వము అప్రాకృత తత్త్వము. గురువు గురువే. మనుష్యుఁడు మనుష్యుఁడే.

---

# విశ్వశాంతి



దేవుని రాజ్యము (నిత్యలోకము)ను భూలోకమునందు వెలయింపజేయుటకుఁ బ్రయత్నములు అప్పుడప్పుడు చేయఁబడుచునే ఉన్నవి. ఆప్రయత్నములలో అనేకవిధములు గలవు. విశ్వమునకు అంతటికిని శాంతిగలిగించుట అనునది ఆ ప్రయత్నములలో ఒకటిగఁ జెప్పఁబడుచున్నది.

శాంతిఅనునది సర్వోత్తమమగు విషయము. దానిని గోరనివారు ఉండనేఉండరు. కాని అది లభించినవారు మిగులఁ దక్కువమందియే ఉందురు. శాంతిసంధాయకులు ఆయాకాలములందు ఉద్భవించియే ఉన్నారు. ప్రపంచచరిత్రయందు అట్టివారిని గూర్చి వినుచునే ఉన్నాము. వారిరాక ఎప్పుడు అత్యవసరమని మనకుఁదోచుచుండునో ఆవేళకే వారు వత్తురు. వారికిఁగల అద్భుతమేధాశక్తియు, సౌహార్దమును, వారికి సులభముగ మహోన్నతపదవిని గలిగించుచున్నవి. కావున శాంతిని గోరినట్టిప్రజలు లక్షలకొలఁది వారిచుట్టుఁజేరి వారిచెప్పుచేతలలోఁదిరుగుచు, వారి ఆజ్ఞలను నెఱవేర్చుటకు సదా సంసిద్ధులైఉందురు. ప్రజల ఆమోదమును బడయుచు ఈ మహాపురుషులు అచిరకాలములోనే విశ్వశాంతికి ఆవశ్యకములని తాము ఊహించిన పరిస్థితులను ఏర్పఱుపఁ గలిగియుందురు.

కాని వారు ఆవిధముగ నెలకొల్పినశాంతి శాంతి అగునో లేదో అనువిషయము గూడఁ దమకుఁ బూర్తిగఁ దేలకముందే తాముమోసపోయితిమి అనువిషయము ప్రజలు తెలిసికొందురు. ఇపుడు తమకుఁగలిగినశాంతి ఇఁకను అతి శీఘ్రముగ లోకమందుఁ గలుగనున్న తీవ్రతరమగు అశాంతికే బీజరూపము అగుచున్నదని వారుగ్రహింతురు. ఈవిధముగ ఆ శాంతిసంధాయకులకు అప్పుడుగల పేరుప్రతిష్ఠలు ఒక్క-క్షణములోఁ దిరోహితములు అగుచున్నవి. వారు పదభ్రష్టు లగుచుండ వారి ఉన్నతస్థానమును మఱి కొందఱు ఆక్ర మింతురు. కొన్నాళ్లకు వీరికిఁగూడ అదేగతి పట్టుటయు, ఈవిధముగఁ గాలచక్రము తిరుగుచుండును.

కావున మానవోద్దిష్టమగు శాంతియొక్క లక్షణము సర్వత్ర యిదేవిధముగఁ బరిణమించుచుండును. అట్టి శాంతి బయటికిఁ జింతామణివలె సర్వదాయినిగఁ గనఁబడుటయో కాని దానివలని ఫలము అతిస్వల్పము. మారణయంత్రసమూహము చేతను, శాసనముల మూలముగను నెలకొల్పఁబడిన శాంతి నిష్ఫలమే అగుచున్నది. సాంఘికములును, నైతిక ములును అగు నిబంధనలుకూడ నిష్ప్రయోజనములే. న్యాయసూత్రములు, మారణయంత్రసమూహము, సాంఘిక శాసనములు, శాంతిప్రదములు కావు. ఒఱలోనున్న కత్తిని దాయకుండునట్లును, హృదయమందున్న ఆలోచనలు బయట

పడకుండునట్లును అవి చేయఁగలిగియుండిన ఉండవచ్చునుగాని అశాంతికి మూలకారణమును అవి నిర్మూలింపజాలవు. వైర స్వభావము తాత్కాలికముగ నిరోధింపఁబడినంతనే శాంతి జనింపనేరదు. హృదయజనితమగు ఒక దుశ్చింత తాత్కాలికముగ నిగ్రహింపఁ బడినంతనే అది ప్రేమ లక్షణము వహింపదు.

శత్రువుల బారినుండితన దేశమును గాపాడువారికి ఆయుధ సంగ్రహముచేతను, ప్రజాపాలనము సేయువారికి న్యాయశాసనములచేతను పశుబలముమాత్రమే వృద్ధిఅగుచున్నది. కాని ఆ ఆయుధములును, శాసనములును, అక్రమముగ వినియోగింపఁ బడకుండునట్లు ఎవ్వరును ఏమియును జేయఁజాలరు. చట్టములయొక్క దుర్వినియోగము గూర్చియు, నిరాయుధుల పై ఆయుధ ప్రయోగముగూర్చియు, మనము లోకములో దలచుగ వినుచునే ఉన్నారము. విధులను ఉల్లంఘించుటకు సంసిద్ధముగ నున్న ఆయుధపాణి బారినుండి ఏసంధినియమములు కాపాడఁగలవు?

కావున శాంతి శాంతి అని చెప్పుచుండుటయే కాని దానిని సంపాదించుట మాత్రము ఈ లోకమున మహత్తరమగు కష్టము. అది రాజకీయ జీవనమందును గనఁబడదు; సాంఘికజీవనమందును గనఁబడదు. శాంతి అనునది ఈ ప్రపంచమందు సులభముగ దొరకునట్టి వస్తువు కాదు.

అట్లయినచో మనుష్యుని గతియేమి? శాంతి సంపాదన మునకై మనుష్యుఁడు నోఁచుకొనలేదా? దేవుని రాజ్యము (నిత్యలోకము) భూలోకమందు వెలయుటకు అవకాశమేలేదా?

లేకేమి? అవకాశమున్నది. మనము శాంతిని సంపాదించగలము. అది ఇంతవఱకు మనకు ఏల లభించలేదని ఒకరు అడుగవచ్చును. దీనికి ఉత్తరమేమనిన, అది మనకు లభించుటకై మనముచేసిన ప్రయత్నములు సరియైనవి కావు. శాంతి అప్రాకృత తత్త్వమునకు సంబంధించినది. కావున, అప్రాకృతమార్గముచేతనే మనము దానిని అన్వేషింపవలెను. మనశరీరముగాని, మన మనస్సుకాని అప్రాకృత తత్త్వములు కావు. కావున అవి దేనిని శాంతి అని చెప్పునో అది శాంతి కాదు. ఆత్మతత్త్వము దేనిని శాంతి అనునో అదే నిజమగు శాంతి. ఆత్మతత్త్వము ప్రేమమయము గనుక అది ఒసఁగూర్చెడు శాంతియే శాంతి. ప్రేమమయమగు ఆత్మ దేనిని ద్వేషించునది కాదు గనుక అది యథార్థమగు శాంతినే కలిగించుచున్నది.

ఈ అప్రాకృతప్రేమ తత్త్వము గూర్చి ప్రచారము చేయుచున్న ధర్మవర్తనుల బోధలను ప్రజలు సమగ్రముగ గ్రహింపఁజాలరు. ఏమనఁ, ప్రతివిషయమును ప్రాకృత దృష్టితోడనే గ్రహించుటకు వారలు అలవాటుపడి

యుండుటచే ప్రేమతత్త్వ సంబంధములగు బోధలు తమసాంఘిక నైతిక విధులను తెలుచుచున్నవనియే వారి అభిప్రాయము. ఇట్టివారినిఁగూర్చి క్రీస్తుప్రభువు ఇట్లులనెను. "నేను ప్రపంచమునకు శాంతిని గూర్చుటకై వచ్చినవాఁడనని మీరు భావింపకుఁడు. నేను బుత్రునికిఁ దండ్రితో విరోధము కలిగించుటకును, కోమార్తెకుఁ దల్లితో విరోధము కలిగించుటకును, కోడలికి అత్తగారితో విరోధము కలిగించుటకును, వచ్చియున్నాను (St. Matthew X-35). దేహసంబంధమగు ప్రేమప్రేమకాదని దీని అర్థము. దైవభక్తిగల పుత్త్రినకు అభక్తుఁడగు తనతండ్రితో సహజముగఁ బ్రతిఘటన కలుగును. అట్లు, అతనినిఁ బ్రతిఘటించుట యందే పుత్రునికి శాంతి కలుగుచున్నది. నైతికసాంఘిక విధులను ఉల్లఘించుట భగవత్ప్రేమప్రచారము కొఱకైనచో అప్పుడు గూడ బరమ శాంతియేలభించుచున్నది భగవద్భక్తిసేయవలదని బలివారలుచున్న తనతండ్రియగు హిరణ్యకశిపుని బోధలను బ్రహ్లాదుఁడు ఉల్లంఘించుకాలమందుగూడ అతనికిఁ గలిగినది శాంతియే. కృష్ణుని ఆజ్ఞను అనుసరించి అర్జునుఁడు కురుక్షేత్రసంగ్రామమందుఁదనవారి నందఱిని జంపినప్పుడు కూడ అతనికిఁగలిగినది శాంతియే. సిలువమ్రానుపై గ్రీస్తుప్రభువు మర్మచ్ఛేదితుఁడగుచున్నప్పుడు, "తండ్రీ! వీరిని క్షమింపుము. వీరు ఇప్పుడుఏమి చేయుచున్నారో వీరికే తెలియకున్నది" అని చెప్పినపుడుకూడ

అతనికిఁ గలిగినది శాంతియే. అందులును సోదరప్రాయు లగుటచే ఎడమచెంపపైఁ గొట్టినవానికిఁ గుడిచెంపయిడిన వాఁడు పొందినదికూడ శాంతియే (St. Matthew V—39). మనము దేనిని శాంతి అందుమో అది కేవలము అశాంతియే కావచ్చును. దేనిని మనము అశాంతియందుమో, దానియందే మనకుఁ బరమశాంతి లక్షణములు కనఁబడ వచ్చును. నిజమగు శాంతిని నెలకొల్పు మార్గములు భగవంతునికే తెలియును. అతని మార్గములు మనకుఁ బరస్పర విరుద్ధములుగను, ధర్మవిరుద్ధములుగను దోచవచ్చును. కాని అవి భగవదిచ్ఛా పరికల్పితము లగుటచే వానివలన శాంతికలిగినే తీరును "కర్మణ్యకర్మ యః పశ్యే, దకర్మణి చ కర్మ యః. స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మ కృత్" అనునది గీతావాక్యము (గీ. 4—18).

దేహసంబంధము చేతను, రక్తసంబంధము చేతను మనకుఁ గలిగెడి ప్రేమానుబంధములను, స్నేహానుబంధములను నిరసించునట్టి ఒకశ్లోకరాజము శ్రీమద్భాగవత మందుఁ గలదు. దాని అనువాదము ఈక్రింద వివరింపఁ బడుచున్నది.

గీ. ప్రకృతిబంధరూప మరణ ♦ భయముఁ దొలఁగఁ
ద్రోయఁజాలని గురుఁడు గు ♦ రుండె ? తండ్రి
తండ్రియే ? తల్లి తల్లియే ? ♦ ధవుఁడు ధవుఁడె ?
బందుఁగుడు బంధువే ? వేల్పు ♦ పరఁగ వేల్పె ?

భగవద్ జ్ఞానములేనివారితో భగవన్మార్గాన్వేషకుల మగు మనకు సఖ్యము కుదురదు. అట్టివారితో మనకుఁగల లౌకిక సంబంధము క్షణికమును, నశ్వరమును మాత్రమే అగుచున్నది. కావున నాయెడ నిత్యమును, అవ్యయమును, అగు ప్రేమఁ జూపఁగల తండ్రిగాని, తల్లిగాని, బంధుగులు గాని నాకుఁ గలుగు టెట్లు ? ఇందునుగూర్చి బైబిలులో ఇట్లున్నది. "చూడుము నాతల్లిని, నాసోదరులను ! నిత్యలోకమునందున్న నాతండ్రియొక్క ఆజ్ఞలను పాలించువారే నాకుసోదరుఁడును, సోదరియు, దల్లియును" (St. Matthew XII-50).

కావున భగవద్విషయకమగు ప్రేమయే మనహృదయములను అన్యోన్యాకర్షకములుగఁ జేసి మనలను ఒకచోటఁ జేర్పఁగలుగునది. భగవత్ప్రేమ సంబంధము గలిగెనేని ఒక రాజ్యపుఁప్రజలకు వేఱొక రాజ్యపుఁ ప్రజలయెడలఁగల భిన్నాభిప్రాయములు తమంతటఁదామే మటుమాయ మగు చున్నవి. విశ్వశాంతి కలుగవలెననిన మనము విశ్వముతో సంబంధములేని అప్రాకృత జీవనముచేయ నభ్యసింపవలెను. ప్రపంచసుఖమే మనసుఖముగ భావించినచోఁ ప్రపంచాతీత లక్షణముగల మనఆత్మకు అందుమూలమున నిత్యశాంతి కలుగ నేరదు. నిత్యమగు ఆత్మసుఖము మనకు ఆదర్శప్రాయమును, అన్వేషణీయమగు విషయమును, అయినప్పుడు క్షణికములగు స్థానికసుఖములను ఆసించుటచే మనకుఁగలిగెడి

పరస్పర కలహములు తన్మూలముగఁ బటాపంచలగునని య
ఇంకను ఋజువింపగలదు ?

దేహమునకును, మనస్సునకును సహజముగ అతీతమగు ఆత్మతత్త్వము ప్రతివిషయమును పారసంబంధి విషయముగనే భావించుచుండును. కావున మనము ఇట్టి ఆత్మయొక్క ఉపదేశములను అనుసరించి జీవితములు గడపుదుమేని మనము విశ్వశాంతికొఱకు సక్రమమగు ప్రయత్నమొనర్చినవారమగుచున్నాము. విశ్వశాంతి ఇంతవఱకుఁ గలుగకుండుటకుఁ గారణమేమనిన, రాజనీతిజ్ఞులు ఇంతవఱకు శాస్త్రనిర్దిష్టములగు ఆత్మోపదేశములను లెక్కసేయకుండుటయైనను గావలయును. లేదా, వాని యందు నామమాత్ర విశ్వాసము గలిగి యుండుటయైనను గావలయును. రాజనీతిజ్ఞునకు దైవభక్తియే ప్రధానలక్షణము. దైవభక్తి విహీనమగు రాజనీతి అశాంతి బీజములనే ఎల్లెడల వెదఁజల్లుచుండును.

# యజ్ఞతత్త్వము.

యజ్ఞము అను పదమునకుగల సమగ్రమగు అర్థమును మన మిపుడు విచారింతము. వేదకాలమునకు సంబంధించిన కర్మకాండయందు నేయియు, అన్నము కలిపిన హవిస్సు, లేక, చరువును అగ్నియందు వేల్చుటకు యజ్ఞమని పేరు. కాని యజ్ఞశబ్దమునకు ఇది బహు సంకుచితార్థము. భక్తి కాండయందు యజ్ఞశబ్దమునకు సమగ్రమగు అర్థము చెప్ప బడినది. భక్తుడు ప్రేమవశుడై తనకు ప్రభువగు పరమ పురుషునకు ఏదైయైన సమర్పించుట యజ్ఞమని చెప్పబడినది. భగవంతుడు సమస్త యజ్ఞములను గ్రహించువాడు గనుక శాస్త్రములందు అతడు యజ్ఞేశ్వరుడని చెప్పబడుచున్నాడు.

భగవంతునియందు మనకుగల ప్రేమ యొక్క నైర్మల్య తారతమ్యము ననుసరించి యజ్ఞ స్వరూపము నిరూపింపబడు చున్నది. జీవ స్వధర్మమైన భగవద్దాస్యమే జీవుడు చేయవలసిన సర్వోత్తమ యజ్ఞమగుచున్నది. జీవుడు తానెపుడు భగవంతుని పాదారవిందములను ఉపగూహన మొనర్చుచున్నాడో అప్పుడు అతని సర్వస్వమును భగవ దర్పిత మగుచున్నది. కావున అప్పటినుండియు అతని జీవనము యజ్ఞమయ జీవనమే అగుచున్నది. బద్ధావస్థలో నున్న జీవుడు

తన భాగ్యవశముచే భగవంతునికి ఎప్పుడు ఆత్మ సమర్పణము చేయుచున్నాడో, అప్పుడు అతనికి యజ్ఞమయ జీవనము ప్రారంభ మగుచున్నది. ఆత్మసమర్పణములేని యజ్ఞము చిన్మయశోభారహితమై కర్మకాండకు సంబంధించిన హవ్య (హోమ) స్వరూపమునే పొందుచున్నది.

లోకమునందలి ప్రజలు భిన్నభిన్నచరమ ప్రయోజనములుగలవారుగ ఉన్నారు. కావున వారి దృక్పథముల ననుసరించి వారు చేసెడి, యజ్ఞములకు స్వరూపభేదములు ఏర్పడుచున్నవి. తన పుత్రునికై తల్లి తన ప్రాణములనైన నొసంగుచు పోవుచున్నది. తన దేశమునకై దేశవ్రతుడు ఉరికొయ్యను గూడ ఎక్కుచున్నాడు. తన నాయకుని ఆజ్ఞను నెఱవేర్చుటకై సైనికుడు వెనుదీయక మృత్యుముఖమందే చొరబడుచున్నాడు. ఇవన్నియు యజ్ఞములే అయినను ఆత్మ సమర్పణమొనర్చిన భగవత్ప్రేమమయుని జీవనము అనుత్తమ యజ్ఞస్వరూపమగుచున్నది. నిర్మలమును, నిష్కామకమును అగు ప్రేమను భగవంతునిపై నెఱపువాడు తన ఆత్మతోపాటు తన సర్వస్వమును భగవదర్పితముసేయువాడని వేఱే చెప్పవలసిన పనిలేదు.

భగవద్దాస్యమే జీవుని స్వధర్మమగుటచే భగవద్భక్తుని జీవనము ఆచరణమయమును, ఆదర్శప్రాయమును అగుచున్నది. అతడు భగవంతునిఁ గూర్చియే ఆలోచించు

చుండును. భగవంతునిఁ గూర్చియే సంభాషించుచుండును. భగవన్నివేదనము కొఱకే పచనమొనర్చును. భగవత్సేవకై బలము మఱలఁ గూర్చుకొనుటకొఱకే నిద్రించుచుండును. భగవంతుని కొఱకే అతఁడు సర్వకర్మలనొనర్చును. వేఁగోల? అతఁడు భగవంతునికొఱకే జీవించుచుండును. తానుజీవించి యుండుట భగవదిచ్ఛఅయినచోఁ దానుజీవించుటే కర్తవ్యముగ భావించును. తాను మరణించుటే భగవత్ప్రీతి కార్యమైనచోఁ దనకు అప్పుడు మరణము కర్తవ్యమని భావించును. తాను జీవించుటగాని, మరణించుటగాని భగవద్దాస్యమందు ఒక అంగముగ భగవదిచ్ఛచే సర్పడెనేని జీవునికి అప్పుడు జీవనావస్థయందు అభినివేశముగాని, మరణావస్థయందు భయముగాని, కలుగనేరదు. భగవద్భక్తుఁడు చచ్చియు బ్రదికియున్నవాఁడే; అభక్తుఁడు బ్రతికియుండియుఁ జచ్చినవాఁడే. అభక్తులు భోగలాలసులును, స్వార్థపరులును, అగుటచే, వారు తమ కొఱకే జీవింతురుగాని భగవంతుని కొఱకు జీవింపరు. కావున వారు జీవించియున్నను జచ్చినవారిలో లెక్కరే.

సాధుపుంగవుఁడగు పౌలు అను నతఁడు ఇట్లు చెప్పెను. "మాకు ఎటుచూచినను బాధలే కలుగుచున్నవి. కాని వానిచే మాకు వ్యసనము కలుగుటలేదు. మాకు ఎల్లప్పుడును విషమ పరిస్థితులే కలుగుచుండును. కాని వానిచే మాకు అధైర్యము

కలుగదు. మాకు ఎప్పటికి బోధించినను దండనమే కలుగు చున్నది. కానిమేము దైవోప హతులము మాత్రముకాము. మమ్ములను అందఱును బహిష్కృతులనవలెనే భావింతురు కాని మమ్ము వారు నశింపఁ జేయలేరు. క్రీస్తుప్రభుని యజ్ఞ మయ జీవితము మాశరీరములందు ఉద్భవింపవలెనను ఆసతో మేము ఆ ప్రభుని మరణచిహ్నములు శరీరమున ధరించి యున్నాము. ప్రభుని మరణము మాకు ఆదర్శమగుచుండ భోగమయ జీవితము మీకు ఆదర్శమగుచున్నది. మనము మనకొఱకు జీవింపకుండ మనకొఱకు ఎవఁడుమరణించి పున రుత్థానమునొందెనో వానికొఱకు జీవించవలెను."

ఆత్మసమర్పణ మొనర్చుటయందు మనహృదయములు భగవదనురాగ ప్రేరితములైనచో మన మొనర్చెడియజ్ఞములు విశేష మహత్త్వము కలిగిన వగుచున్నవి. భయముచేతగాని, కర్తవ్యబుద్ధిచేతగాని, ప్రేరేపింపఁబడిన యజ్ఞములు భగవదను రాగ రహితములగుటచే అవి సర్వాంగ సుందరములగు యజ్ఞ ములుకావు. విచారణకాలమందు దేవుని సింహాసనము నెదుట నిలువఁబడ వలసివచ్చునను భయముచేతఁ జేసెడి యజ్ఞము లును, మనకు నిత్యభోజనమిడుచున్న మనతండ్రి కొఱకుఁ గర్తవ్యబుద్ధితోఁ జేసెడి యజ్ఞములును నామమాత్ర యజ్ఞ ములే. ఆశాభయ కర్తవ్యబుద్ధులచేఁ బ్రేరేపింపఁబడక మన ఆత్మ స్వధర్మా చరణకాలమందు లౌక్యచింతా శూన్యముగ

నొనర్చు సర్వార్పణమే సర్వాంగసుందరమగు యజ్ఞము. కావుననే భగవద్భక్తుఁడు తన ప్రభువుకొఱకుఁ జేయఁగల సర్వోత్తమ యజ్ఞము ఏద్దియని శ్రీ గౌరసుందరుఁడు తన అంతరంగిక శిష్యుఁడగు శ్రీరామానందరాయలను ప్రశ్నించినపుడు దానికి ఉత్తరము గీతాశ్లోక రూపమున,

"శ్లో. యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోసి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ!
తత్కురుష్వ మదర్పణమ్." (గీ. 9-27)

అని చెప్పినను దానికి శ్రీ గౌర సుందరుఁడు అంగీకరించలేదు. "నీవొనర్చెడి కర్మలును, భోజనమును, యజ్ఞదాన తపస్సులును నాకే అర్పింపుము" అని ఈశ్లోకమునకు అర్థము. అతడు ఈ ఉత్తరమును అంగీకరింపక పోవుటకుఁ గారణము ఏమనిన, ఇట్టి యజ్ఞములందుఁ గర్తకుఁ ప్రాకృతాహంకారము విడువదు. ఏమన, ఇది శాస్త్రవాక్యమగుటచేఁ గర్తవ్య బుద్ధిచేతనే ఈ యజ్ఞముచేయఁబడుచున్నది. "నేను యజ్ఞకర్తను" అనునదే అహంకారము. ఏ యజ్ఞము స్థూల సూక్ష్మ దేహముల కార్యముగాక వానికి అతీతమగు ఆత్మ యొక్క చిత్కార్య సంబంధి అగుచున్నదో అదే సర్వోత్తము యజ్ఞమని శ్రీరామానందులుచెప్పినప్పుడే శ్రీ గౌరసుందరుఁడు సంతృప్తుఁడయ్యెను. జీవాత్మ యొనర్చెడి నిత్యలోకజీవనమందే

వాస్తవ యజ్ఞస్వరూపము ఉదయించుచున్నది. మనము అనుభవజ్ఞానముపై ఆధారపడక భగవత్స్వరూపమే యగుచున్న "దివ్యసువార్తా తేజము" (The light of the glorious gospel) ను గురుదేవుని అనుగ్రహముచే మనము గ్రహింపఁ గలుగుదుమేని, బైబిలెఁజెప్పిన యజ్ఞాచరణము ఈ ఐహిక జీవనమందుఁగూడ సాధ్యమగుచున్నది. "మనము మార్గముఁ జూపించునది విశ్వాసముగాని కనుదృష్టికాదు" (II Corin. V-7). చిన్మయ మార్గదర్శకుఁడగు గురువే మనకు విశ్వాసపాత్రుఁడు. ఆత్మతత్త్వమందే సదావిహరించెడి శ్రీ గురుని యాజ్ఞలను మనము పాలించినచో మన పారమార్థిక జీవనమును అతఁడు ఆమోదించిన విషయము మనకు అపుడు తేటపడఁగలదు. ఆత్మసమర్పణమే యజ్ఞలక్షణము. అది విప్రలంభ శృంగార చేష్టగ శ్రీరాధికయందు ద్యోతిత మగుచున్నది. శ్రీకృష్ణ విరహమును భరింపఁజాలక ఆమె వేయి పర్యాయము లైనను మరణింపఁగోరెను గాని, తన మరణముచే అతనికి శోకము కలుగు నేమో అని ఆమె అట్లు మరణించుటకు భయపడుచుండెను.

భగవంతుని సేవించుట యందు ఉత్సాహముగల భక్తుఁడు ఎట్టి కష్టములనైనను లెక్కగొనఁడు. "భగవంతుని సంతోషపఱచుటకై తన సర్వస్వమును ధారవోసి తన

ఆత్మనుగూడ సమర్పించినవాఁడు ఒకఁడున్నాఁడు సుమా" అని శాస్త్రానునందు చెప్పఁబడినది. క్రీస్తుప్రభువు ఇట్లనెను.

"ఏమనుష్యుఁడైన నావెంట రాఁదలఁచినచోఁ దాను ముందుగా ఆత్మసమర్పణ మొనర్చియు, సిలువ (Cross) ను ధరించియు, నన్ను అనుగమించవలెను. ఏమన. దనజీవితమును ఎవఁడు కాపాడుకొనునో వాఁడుదానిని గోల్పోయిన వాఁడు. ఎవడు తన జీవితమును నాకై గోల్పోవునో వాఁడు దానిని సంగ్రహించుకొన్నవాఁడే".

కావున ఎయ్యది లౌక్యదృష్టియందు ఆత్మసమర్పణ మనఁబడుచున్నదో అదే పరమార్థ దృష్టియందు సర్వాత్మత్వము అనఁబడుచున్నది. భక్తజీవనమందు ఈ సర్వాత్మత్వ లక్షణము పూర్తిగ వికసించి యుండును. ఈ సందర్భమున ఇచట గొందఱ భక్తుల జీవితములను విచారింతము.

క్రీస్తుప్రభువు సిలువ మ్రానుపై మర్మచ్ఛేదితుఁడగు చుండినపుడు తాను దేవునిఁ దలఁచి. "తండ్రీ! వారిని మన్నింపుము. ఏమన, వారు ఏమిచేయుచున్నారో వారికే తెలియకున్నది" అని చెప్పుచు అతనిని బ్రార్థించెను.

ఐదు సంవత్సరములు వయస్సుగల ప్రహ్లాదుని అతని తండ్రియగు హిరణ్యకశిపుఁడు భగవద్భక్తిని విడువుమని ఆజ్ఞాపించెను. ప్రహ్లాదుఁడు మిగులధైర్యముతో అతని ఆజ్ఞ

నుల్లంఘించుటచే మరణశిక్ష విధింపఁబడెను. అతనిని విషము త్రాఁగ నిర్బంధించిరి; కొండశిఖరముపై నుండి క్రిందికిఁ ద్రోచిరి; మదపుటేనుఁగుచేఁ ద్రొక్కించిరి; మెడకు బండఁగట్టినీటను ద్రోచిరి. ఈదండనముల నన్నిఁటిని సంతోషపూర్వకముగ అనుభవించుచుఁదనతండ్రిని గూర్చియే భగవంతునిఁ బ్రార్థించు చుండెడివాఁడు. కుమారునిఁ జంపఁజాలక చివరకు తండ్రి భగవన్నింద చేయసమకట్టినపుడు శ్రీనృసింహదేవుఁడై అతనిని భగవంతుఁడే సంహరించెను. అప్పుడు గూడఁ బ్రహ్లాదుఁడు తనతండ్రిని మన్నించుమనియే కాక అతనికిముక్తి పదవి నొసంగుమనికూడఁ బ్రార్థించెను.

హరిదాసు అను నొక భక్తుఁడు కులమునకు మహమ్మదీయుఁడు. బాల్యమునందే అతఁడు భక్తానుగ్రహముచే శ్రీగౌరసుందరునకు శిష్యుఁడయ్యెను. అదివిని ఒక మహమ్మదీయ గురువు అతనినిఁ బిలిపించి కృష్ణనామసంకీర్తనము విడువుమని అతనిని ఆజ్ఞాపించెను. అప్పుడతఁడు "నా శరీరము ముక్కలు ముక్కలుగ ఖండింపఁబడి నాప్రాణము పోయినను కృష్ణనామ సంకీర్తనము విడువను" అని చెప్పెను. అదివిని ఆగురువు దురాగ్రహచిత్తుఁడై హరిదాసును గొట్టిచంపుఁడని ఆజ్ఞాపించెను. ఇరువదిరెండు విపణిస్థలము (సంతపట్టు) లందు అతనినిఁ గొరడాతోఁ గొట్టిరి. ఆదండనము అనుభవించుచు హరిదాసు కృష్ణనామ సంకీర్తనము విడువక మీఁదుమిక్కిలి

తనను దండించుచున్న వారిని అనుగ్రహింపుమని కూడఁ గృష్ణుని ప్రార్థించెను. అతఁడు మృతినొందెనని, నీటిలోఁ గూడఁ బాఱవైచిరి. కాని అతడు ఎట్టి అపాయమును పొందకుండ సురక్షితముగ కృష్ణునఁ జేరెను.

వాసుదేవుఁడను ఒక భక్తుని జీవితము అత్యద్భుతమైనది. అతఁడు కూర్మాచల (శ్రీకూర్మక్షేత్ర)వాసి. శ్రీ గౌరసుందరుని శిష్యుఁడు. ఒకనాఁడు శ్రీ గౌరసుందరుఁడు తన భగవత్స్వరూపమును వ్యక్తపఱచి కావలసిన వరములను గోరుకొమ్మని తన శిష్యుల నాజ్ఞాపించెను. వాసుదేవుఁడు మాత్రము ఎట్టివరము గోరుటకైన ఇష్టపడలేదు. కోరుకొనక తీఱదని శ్రీ గౌరసుందరుఁడు అతనిని బలాత్కరించెను. అప్పుడతఁడు, "మహాప్రభూ! నాకు వరమును ఈయఁ దలచితివేని నేను గోరెడి వరము వినుము. పాపాత్ముల నందఱను వైకుంఠమునకుఁ బంపుము. నేను నరకమునందుండి వారల పాపములు నేను అనుభవించునట్లు అనుగ్రహింపు" మనెను. సర్వాత్మత్వమును గూర్చి యిట్టి ఉదాహరణములు ఎన్నియైన ఈయవచ్చును.

ఆచరణమయ భాగవత జీవనముగల ఒకానొక సాధు పుంగవునిచే ఆత్మసమర్పణము గూర్చి రచింపబడిన గేయమొకటి వంగభాషయందు గలదు. భగవంతునికి

ఆత్మసమర్పణమొనర్చిన వానిలక్షణములు అందు సమగ్రముగ వివరింపఁబడినవి. దాని ఆంధ్రానువాదము ఈక్రిందవ్రాయఁబడినది——

1. సర్వము నీపాద, ముల చెంత నర్పించి, పరమసుఖినైతినింకన్
దుఃఖమెటో పోయెను, చింతనాశనమాయెను, గాంతు నానందమేపంకన్.

2. నీపాదపద్మము సుకృతనిధానంబు, భయదుఃఖవినాశంబు
దానినక్కునఁజేర్చి విశ్రాంతినొందెద, విడిచెద భవభయంబు.

3. భోగవాంఛ విడనాడి నీ సంసార, సేవనమే చేతు నేను
కొలుచుచు నీకు సకలసుఖములఁగూర్చ్చ, పనికే సమర్పింతు నేను.

4. నీసేవ చేయుకాలమున నాకుఁగల్గు, దుఃఖమే పరమసుఖంబు
సేవా సుఖదుఃఖశ్రేణియే నా భాగ్య, మదియే అజ్ఞాన నాశంబు.

5. భవదీయ సేవానందమున మునిగిన నాకుగతదుఃఖతతి విస్మృతంబు.
నేను నీవాఁడను నీవు నావాఁడవు, నాకేల ఇతర ధనంబు.

6. భక్తవినోదుఁడ నీసేవమనసార, చేసి భవాబ్ధిఁ దరింతు,
నాది నీదే కదా? నీదు సంసారమ్ము నీ యిచ్ఛమై నిర్వహింతు.

# కృష్ణప్రేమ.



ప్రేమము, కామము అనుమాటలు సంస్కృతవాఙ్మయమునందలివి. ప్రపంచమందు ప్రేమ అనెడిమాట "కామము" అను అర్థము క్రిందనే ఉపయోగింపఁ బడుచున్నది. బాహ్యలక్షణము ననుసరించి ప్రేమయు, గామమును ఒకేవిధముగ ఉండుటచేఁ బ్రపంచదృష్టి గలవారు ఆరెండింటికిఁ గలభేదమును గమనింపజాలకున్నారు, కాని స్వర్గమునకును, నరకమునకును ఎంతటి భేదముగలదో, ప్రేమకును, కామమునకును అంతటి భేదము గలదు. ఏమన, ప్రేమము భగవంతునికి సంబంధించినది; కామము సంసారమునకు సంబంధించినది. ప్రేమకును, కామమునకును గలభేదము శ్రీచైతన్య చరితామృతమందు ఈక్రింద వివరించిన విధమున జక్కఁగ నిరూపింపఁ బడినది.

ఆ. తమప్రకృతిమ యేంద్రి ♦ యములకు జీవని
కరము తుష్టిసేత ♦ కామమయ్యె
కృష్ణచంద్రు చిన్మ ♦ యేంద్రియములకు సం
ప్రీతిఁ గొలుపు చేష్ట ♦ ప్రేమమయ్యె.

కావున బద్ధజీవుఁడు తనయింద్రియ సుఖములను గోరినప్పుడు అది కామము అనఁబడుచున్నది. కృష్ణేంద్రియతోషణ మొనర్చినప్పుడు అది ప్రేమ అనఁబడుచున్నది.

ఇట్టి భగవత్ప్రేమను ప్రచారము సేయునట్టి ధర్మాచారులు ఈ ప్రపంచమున ఆయా కాలములయందు అవతరించియే ఉన్నారు. కాని, వారల ప్రేమసందేశములు మనము పరిశీలించినప్పుడు వానియందు భిన్న దృక్పథములే కనఁబడుచున్నవి. ఇట్టి భేదములు కనఁబడుట సహజమే. ఏమన, ఆయా సందేశములు ఆయా ప్రజల యొక్క పారమార్థికాధికారమును అనుసరించియే వారి యందు ప్రచారితములైనవి. కావున ఒక మతమునకు సంబంధించిన ప్రజలు వేఱొక మతము వారితోఁ బోరాడుటకు ఎట్టి కారణము లేదు. కాని ఒక్కొక్కప్పుడు ఒకానొక వ్యక్తిగాని, ఒకానొక జాతిగాని తమకుఁ గలిగిన పారమార్థికాధికారము తమ మతవ్యవస్థ నతిక్రమించుటచే అదినిరర్థకము కాకుండునట్లు వేఱొక జాతికి సంబంధించిన మతము నవలంబించుట కూడ లోకమున గనుచున్నాము. ఆ యా ధర్మప్రచారకుల ప్రేమ సందేశములను మనము నిష్పక్షపాతముగఁ బరిశీలించినపుడు శ్రీ గౌరసుందరుని ప్రేమ సందేశమే సర్వోత్తమమైనదని మనకు స్పష్టమగును.

ప్రేమనిర్మలమైనదిగ ఉండవలయుననిన, దానికి విషయమగునదియు, ఆశ్రయమగునదియుఁ గూడఁ బరిశుద్ధములై ఉండవలెను. ఎట్లన, అగ్ని ధూమరహితముగ ఉండవలయుననినఁ గట్టెలు శ్రేష్ఠమైనవి కావలయునుగదా? మనము

భగవంతునిఁ బ్రేమింపవలయు ననువిషయము మనమందర మెఱుఁగినవిషయమే. కాని దేవుఁడెవఁడో, మనము ఎవరమో ముందుగాఁ దెలిసికొనవలసి యుండునుగదా? ఈ విషయమై ఆయా మతములవారు భిన్నభిన్నాభిప్రాయములే కలిగియున్నారు. మహమ్మదీయమతమందును, క్రైస్తవమత మందును భగవత్స్వరూపనిర్ణయము అంతస్పష్టముగఁ జేయఁ బడలేదని యింతకు ముందే మనము తెలిసికొంటిమి. ఆరెండు మతములవారును, భగవంతుఁడు సాకారపరమతత్త్వమని మాత్రము మనకుఁ జెప్పుచున్నారు. అంతకుమించి మఱేమియుఁ జెప్పలేదు. కాని భగవంతుఁడు సాకారుఁడను విశ్వాసము మనకుఁ గలిగినంత మాత్రమున మన హృదయములందుఁ బ్రేమ ఉదయించుట సాధ్యపడునా ?

బైబిలునందును, ఖొరాను నందును జెప్పఁబడిన దేవుఁడు తనదాసులకు ఐశ్వర్యస్వరూపుఁడుగనే దర్శనమిచ్చు చున్నాఁడు. సర్వశక్తిమంతుఁడగు అతఁడు ఎత్తగు ఒక సింహాసనమందుఁ గూర్చుండి న్యాయాధిపతివలె దుష్టశిక్షణము, శిష్టపాలనము చేయుచుండును. అతని ఆజ్ఞలను బాలించుటకు అతని పారిషదులు దీనత్వమును జూపుచు దూరముగ నిలువఁబడి భక్తిపూర్వకమగు భయముతో అతనినిఁ గొలుచుచుందురు. దేవుఁడు మనతండ్రి అని చెప్పినట్టి క్రైస్తవ మతమునందుఁగూడ దేవుని బిడ్డలకు భయమిళితమగు

సేవనమే చెప్పఁబడినది. "నీకుఁ బ్రభువగు దేవుని భయముతో సేవింపుము" అని బైబిలునందు జెప్పఁబడినది. (Deu. VI-13). "భగవంతునియెడ భయము కలిగి యుండుము. భగవంతుని గొందగోరుము" అని ఖొరానునందుఁ జెప్పఁబడినది. కావున, ఈ రెండు మతములందును దేవుని సేవించువారలకు భయరహితమగు ప్రేమ అంకురించుట కష్టము. వారు కృతజ్ఞతాపూర్వకముగ మాత్రము దేవుని సేవింతురు. కాఁబట్టి, ఇట్టి సేవనమందు ఏమాత్రమైన ప్రేమఉన్నచో అది సదా కోమలస్థితియందే ఉండును.

జీవస్వరూపమును నిర్ణయించుటయందుఁ గూడ మహమ్మదీయ క్రైస్తవ మతములు అను రెంటియందును గొంత అసంపూర్ణత్వము చూపట్టుచున్నది. మహమ్మదీయ మతమందు "రూహు" అను నదియును, క్రైస్తవ మతమందు "సోల్" అను నదియును, ఎంతటి పారమార్థికోన్నతి వహించినను వానికిఁ గల ప్రకృతి సంబంధము పూర్తిగఁ బోవునది కాదను విషయము ఇంతకు ముందే దెలిసి కొంటిమి. అప్రాకృతావస్థానమునకు అవి పోఁగలుగునను విషయము సందేహాముగనే ఉన్నది. సంసారమందుండి బద్ధజీవుఁ డొనరించెడి ప్రేమానుశీలనము ముమ్మాటికిని గామానుశీలనమే అగుచున్నది కాని అది ఎన్నటికిని భగవత్ప్రేమకు సంబంధించునది కాదు.

ప్రాపంచిక విషయములందు మనకుఁగల అభినివేశమే భగవత్ప్రేమానుశీలమునకు మనలను పూర్తిగ అనర్హులను జేయుచున్నదని అన్ని మతగ్రంథముల యందును జెప్పఁబడి యున్నది. బైబిలులో ఇట్లు చెప్పఁబడినది.

"ప్రపంచమును జూచికాని, ప్రపంచమునందలి వస్తువులను జూచికాని, నీవు మోహపడకుము. ప్రపంచమందు మోహము గలవానికిఁ దండ్రియందు ప్రేమఉండదు. (1 John II–15)

"ఏమన, ప్రపంచమునందలి ప్రతివిషయమును అనఁగా, శరీరసంబంధ మోహము, నేత్రసంబంధ మోహము, తనకుఁగల పదవిని దలఁచుకొని విఱ్ఱవీఁగుట, మున్నగునవి అన్నియును బ్రపంచమునకు సంబంధించినవే కాని తండ్రికి సంబంధించినవి కావు. ప్రపంచము నశ్వరమైనది. దాని సంబంధమగు మోహముకూడ అట్టిదే. కాని దేవునిసంకల్పము నెఱవేర్చువాఁడు మాత్రము శాశ్వతపదవి నొందును (I John II—16 & 17.).

"నన్నుమాని తనతండ్రినిగాని, తల్లినిగాని అధికముగఁ బ్రేమించువాఁడు నన్ను అనుసరించుటకు అర్హుఁడుకాఁడు. తనకుమారునిఁగాని కొమార్తెనుగాని అధికముగఁ బ్రేమించువాఁడు నన్ను అనుసరించుటకు అర్హుఁడుకాఁడు." (St. Matthew XI—37)."

పైనిఁజెప్పిన వాక్యములవలనఁ బ్రాపంచిక వస్తువుల యందు మనకుఁగల ప్రేమ భగవత్ప్రేమ కాదని మనకు స్పష్టముగఁ దెలియుచున్నది. కావున, అట్టికామము మన హృదయములయందు ఎంతవఱకు దాఁగి యుండునో, అంత వఱకు వానియందు భగవత్ప్రేమకు చోటు చిక్కదనియే మనము విశ్వసింపవలెను.

అట్లయినచోఁ బ్రపంచమందుండెడి ఎట్టి వస్తువును బ్రేమింపఁగూడదని అర్థమా ? కాదు. అటులెన్నఁడునుగాదు. క్రీస్తుప్రభువు ఎన్నఁడును ఇట్లు చెప్పలేదు. అతఁడును, ఇతర మతస్థాపకులును జెప్పిన దేమనిన, ఆత్మార్థమైకాని, భోగ బుద్ధితోఁగాని ప్రపంచవిషయములను బ్రేమింపఁ గూడదని. క్రీస్తు ప్రభువు మఱొకస్థలమందు ఇట్లు చెప్పెను—

"నిత్యలోకమందున్న నాతండ్రియొక్క సంకల్పమును ఎవఁడు నెఱవేర్చునో, అతఁడే నాకుసోదరుఁడును, సోదరియు, దల్లియును" (St. Matthew XII –50).

దీని అర్థమేమనిన, మనలను గన్నవాఁడు అను భావముతోఁ దండ్రిని బ్రేమించుట తప్పిదము. కాని అతనిని దేవుని సేవకునిగ భావించి ప్రేమించుటలో ఎట్టి తప్పిదము లేదు. ఇట్లే, ఆత్మార్థమై ధనము నార్జించుట తప్పిదము. కాని దేవుని వినియోగము కొఱకు ధనార్జనము సేయుటలో ఎట్టి తప్పిదము లేదు. భగవత్ప్రేమయందు సర్వమును ఈవిధముగ సమన్వ

యింపఁ బడుచున్నవి. భగవద్దాస్యరూపముగ మనము సేయు ప్రతికర్మయు, మనము అవలంబించు ప్రతివృత్తియు, భక్తి రూపమునే వహించుచున్నది. ప్రేమమార్గమున మనము భగవంతుని సమీపించుచున్న కొలఁది ప్రపంచ విషయములందు మనకుఁగల ఆసక్తి తగ్గిపోవుచుండును.

కాని యిట్టి దృక్పథమేర్పడుట, అనగా బ్రతివస్తువును హరిసంబంధి వస్తువుగ భావించుటయు, జడదృష్టి తొలఁగి ఎల్లయెడలఁ జిత్పదార్థమునే కనుచుండుటయు, బ్రకృతి సంబంధము వదలిన మహాపురుషులకే సాధ్యపడుచున్నది. ప్రకృతిసంబంధముగల "రూహు", "సోల్" అను తత్త్వములు భగవత్ప్రేమను దమతమ నిమ్నావస్థానములందే అనుశీలన మొనరించుటచే వారలకు అది సంపూర్ణ వికాసముతో సర్వాంగసుందరముగ లభింపఁ జాలదు.

కాని జీవాత్మ అని వేదమందు చెప్పబడిన "శుద్ధాత్మ" తత్త్వమునకు అట్టి అసంపూర్ణతా దోషము లేదు. శుద్ధ జీవుఁడు చిన్మయుఁడు. కనుక భగవత్ప్రేమానుశీలము చేయుటకు పూర్తిగ సమర్థుఁడగుచున్నాఁడు.

మానవుని పారమార్థికాధికారమునకు అనురూపముగనే అతనికి భగవత్ప్రేమ లభించుచున్నదని యింతకుముందే చెప్పఁబడినది. భగవత్ప్రేమ స్వతస్సిద్ధమును, నిత్యమును అగు తత్త్వము. మన అధికారమును అనుసరించి

అది మనకు లభించుచున్నది. మనము ఓపినంతవఱకే దానిని గ్రహించుచున్నాము. మనము ఎంతవఱకు అనుశీలన మొనరింపఁ గలమో, అంతవఱకే అది మనకు లభ్యమగు చున్నది. భగవత్ప్రేమకు సంబంధించిన సందేశములు మత ప్రచారకుల మూలముగనే మనకు లభ్యమగుచున్నవి.

వేదములందు భగవంతుఁడు మొదట మనకు వెలుఁగు నిచ్చెడు సూర్యునిగను, వర్షము నిచ్చెడి పర్జన్యునిగను, కార్యసిద్ధి నొసంగెడు గణపతిగను, సంపదనిచ్చెడు లక్ష్మిగను దర్శన మిచ్చుచున్నట్లు చెప్పఁబడినది. ఈ విధముగ భగ వంతుఁడు ఫలప్రదాతయే యగు చున్నాఁడు. అట్టి భగ వంతునిఁ బూజించు టనిన భగవదర్పితములగు ఆ యా ఫలములను బూజించుటే అగుచున్నది. ఇట్టి పూజనముచే మనకుఁ గలిగెడి ప్రేమ భగవంతునికి సంబంధించినది గాక భగవద్దత్తములగు ఫలములకు సంబంధించినదే అగుచున్నది. భగవంతుఁడు ఆయా ఫలములను, ఆ యా వరములను మన కొసంగినందులకు మూల్య రూపముగ మనము అతనికి అర్పించెడి ప్రేమ ప్రేమ కాదు; వాణిజ్యధర్మము. "యస్త్వాశిష ఆశాస్తే న సభృత్యః సవై వణిక్" అనునది ప్రహ్లాదుని వాక్యము. దీనికే కామమని పేరు. ఈ కామమే ప్రేమాను శీలనమునకు అవరోధము కలిగించునది.

తదుపరి ఒక్కఁడగు భగవంతుఁడే మనకు ఉపాస్య తత్త్వమును మనప్రేమకు విషయమును, అనుచు ఆవేదములందే జెప్పఁబడినది. భగవదధికార ప్రాప్తజీవులగు దేవదేవీగణమంతయు, అతని యందే లీనమగుచున్నారు. ఇట్టి భగవంతునియెడ మనకుఁ గలిగెడి ప్రేమయందు ఐదు అవస్థానములు గలవు. ఒక్కొక్క అవస్థానమునకు సంబంధించిన ప్రేమ ఇతరావస్థానములకు సంబంధించిన ప్రేమకంటె సహజముగ భిన్నముగ నుండును. ఈ అవస్థానములకు శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర రసములని పేరు. ఇందులో రెండున్న ఆ రసములందు భగవంతుఁడు నారాయణ స్వరూపముతోఁ బూజింపఁ బడుచున్నాఁడు, తక్కిన రెండున్న ఆ రసములందు భగవంతుఁడు కృష్ణ స్వరూపముతోఁ బూజింపఁ బడుచున్నాఁడు, ఇట్లనుటచే నారాయణుఁడు కృష్ణునికంటె భిన్నుఁడని అర్థముకాదు. సాక్షాద్భగవంతుఁడగు కృష్ణుని యొక్క ఐశ్వర్యస్వరూపమే నారాయణుఁడు. నారాయణునకు నాలుగు హస్తములు గలవు. అందొక దానియందు శంఖమును, ఒకదానియందు చక్రమును, ఒకదాని యందు గదయు, ఒకదానియందుఁ బద్మమును ధరించుచున్నాడు. సర్వజ్ఞత్వము, సర్వవ్యాపకత్వము, సర్వేశ్వరత్వము మున్నగు ఈశ్వర లక్షణములన్నియును, అతనికిఁ గలవు. ఆ ఐశ్వర్య స్వరూపము నెదుట దైన్యభావముతో

నిలువఁబడి అతని సేవకుఁడు తగినంత దూరమునం దుండియే భయభక్తులతో అతనిని సేవించుచు, అతని ఆజ్ఞలను జాగరూకతతోఁ బాలించుచు, అతఁడు ఏమి యనుగ్రహించిన నద్దానినే కృతజ్ఞతా పూర్వకముగ స్వీకరించుచుండును. ఈరసములందు భగవంతుఁడు నిరవద్యమానవస్వరూపుఁడును జగన్మోహన కైశోర విగ్రహుఁడును, మందహాస సుందర వదనారవిందుఁడును అగు కృష్ణునిరూపము వహించి ఒకచేతి యందు వేత్రమును, రెండవచేతియందు మురళిని, గంతమందు వనమాలను ధరించి, తనభక్తులకుఁ బ్రత్యక్షమగుచున్నాఁడు. అతని ఐశ్వర్య స్వరూపము ఈ విధముగఁ గైశోరమాధుర్య స్వరూపముచే మఱుఁగుపడుచున్నది. అందువలన భక్తునకు ఇపుడు భగవత్స్వరూపదర్శనముచే అపారమును, అప్రతిహతమును అగు ప్రేమోదయమే కలుగుచున్నది కాని భయసంభ్రమములు కలుగనేరవు.

శ్రీమన్నారాయణమూర్తికి సంబంధించిన ప్రేమానుశీలనమునకు అనువగు అవస్థానమునకు వైకుంఠమనియు, శ్రీకృష్ణ ప్రేమానుశీలనమునకు అనువగు అవస్థానమునకు గోలోకమనియు పేళ్లు. కావున ఇందులో మొదటి ప్రేమానుశీలనము నారాయణ పూజనమనియు, రెండవది కృష్ణభజనమనియుఁ జెప్పఁబడుచున్నది.

పైనిఁజెప్పిన ఐదు విధములగు ప్రేమరస సోపానములును ఈ క్రింద వివరింపఁబడినవి.

నారాయణపూజనము —

1. శాంతరసము—ఈ రసమునందు భక్తుఁడు శాస్త్రనిర్దిష్టమగు భగవత్సేవనము కర్తవ్యబుద్ధితోఁ జేయుటయో కాని అతనికి నారాయణమూర్తియందు సహజప్రేమ కాని, లోకవిషయములయందు లంపటత్వము కాని ఉండదు. భక్తుఁడు భగవంతునియెడలను, సంసారమునెడలను జూపెడు ఒక విధమగు ఉపేక్షాభావమే ఈరసమునకు లక్షణము. సనకుఁడు, సనాతనుఁడు మున్నగు ఋషులు ఈ రసమునకు సంబంధించిన భక్తులు.

2. దాస్యరసము—ఈ రసమునందు భక్తుఁడు దాసభావముతో భగవంతుని సేవించును. మిగుల దీనభావముతో అతఁడు భగవంతుని యెదుట సాఁగిలి మ్రొక్కును. భగవంతుని యెడఁ దనకుఁగల అనురాగమును సూచించుచు, భగవదాజ్ఞలను నెఱవేర్చుటకు అతఁడు సదా ఉద్యుక్తుఁడై యుండును. అతనికి భగవంతునియందు ఇపుడుగల ఆసక్తియే ప్రేమాంకురరూపము వహించుచున్నది. ఇదే ప్రేమోదయమునందలి మొదటి సోపానము. గరుత్మంతుఁడు, హనుమంతుఁడు సేయు భజనము ఈ రసమునకు సంబంధించినది.

3. సఖ్యరసము—ఈ రసమునందు భక్తుఁడు భగవంతుని స్నేహభావముతో సేవనమొనర్చును. ఈ సఖ్యరసము గౌరవసఖ్యమనియు, విస్రంభసఖ్యమనియు రెండువిధములు. గౌరవసఖ్యముతో నారాయణ పూజనము పరిసమాప్తి నొందుచున్నది. భక్తుఁడు స్నేహభావముతో భగవంతుని సేవించుచున్నను ఆస్నేహము గౌరవమిశ్రమగుటయే ఈ రసముయొక్క లక్షణము.

కృష్ణభజనము— విస్రంభసఖ్యరసమే కృష్ణభజనమందు ప్రథమసోపానమని చెప్పఁబడుచున్నది. ఈ రసమునందు భక్తుఁడు భగవంతునితోఁ దనను సమానునిగ భావించుకొనును. భగవంతుఁడుతనకంటె అధికుఁడనుభావము అప్పుడుండనే ఉండదు. అతఁడు భగవంతునితో ఆడుకొనుచుండును. భగవంతుఁడును,దానునుగలసిపండుకొందురు. భగవంతునివిడిచి అతఁడుండఁజాలఁడు. వారిరువురును ఆటలాడుకొనుచుఁదమలో గెలిచినవారిని ఓడిపోయినవారు తమభుజములపై నెక్కించుకొని మోయవలయునని పందెము వేయుదురు. కృష్ణుఁడు ఓడినప్పుడు గెలుపొందిన తన భక్తుని తన భుజములపై మోయవలసియే ఉండును. శ్రీదాముఁడును, సుదాముఁడును, ఈరసమునకు సంబంధించిన భక్తులు.

4. వాత్సల్యరసము—ఈ రసమునందు భగవంతుఁడు పుత్రభావముతో సేవింపఁబడుచున్నాఁడు. భగవంతునికిభక్తుఁ

డిపుడు తండ్రియగుటచే భక్తునియొక్క వాత్సల్యమునకును, లాలనపాలనములకును భగవంతుఁడు పాత్రుఁడగుచున్నాఁడు. పైనిఁజెప్పిన రసములయందువలె ఈ రసమునందు భగవత్సేవనము విషయమై భక్తుఁడు కొంచెమైన అశ్రద్ధవహించుటకు అవకాశములేదు. భగవంతుఁడు ఇపుడు బాలుఁడై ఆటపాటలతోఁ గాలముగడపుచుండ అతఁడు ఏవేళకు ఏదికావలయుననునో ఏవేళకు ఏవిపత్తు అతనికి సంభవించునో అనుచు అతనియందే సదా తలిదండ్రులు దృష్టికలిగియుందురు. ఆఁకలి అనినపుడు అన్నమిడుటయు, సొమ్ములు కావలెనన్నపుడు సొమ్ములిడుటయు, అనారోగ్యముగ నున్నపుడు ఔషధమొసఁగుటయు, నిద్రవచ్చుచున్నదని చెప్పినపుడు పరుండఁబెట్టుటయు, పరుండియున్నంతకాలము అతనికిఁ గావలియుండుటయు వారలకు అపుడు నిత్యధర్మము లగుచున్నవి. అపుడు వారితలఁపులన్నియుఁ దమ బిడ్డనుగూర్చియే. వారిచేతలన్నియుఁ దమ బిడ్డకొఱకే. తమ బిడ్డ సుఖముగానున్నప్పుడుగూడ వానికి ఏ అపాయమువచ్చునో అని భయపడుచుందురు. కనుఱెప్ప వేసినంత కాలముగూడ అతఁడు వారికిఁ కనఁబడకుండినచో అతఁడు ఏమయ్యెనో అని బెంగబెట్టుకొనుచుందురు. తప్పుచేసినప్పుడు అతనిపైఁ గోపగింతురు. అతనిని భయపెట్టుదురు. కాని తమ తర్జన భర్జనములచే బిడ్డఁడు మిగుల జడిసెననుచు అప్పుడే మఱల అతనిని ఒడిలోఁ గూర్చుండబెట్టుకొని ముద్దా

నుదురు. ఈ విధముగ భగవంతునికి పాలకుఁడగుచున్న భక్తుని సేవనము వాత్సల్యమయమగుచున్నది. నందయశోదల భక్తి ఈ రసమునకు సంబంధించినది.

5. మధురరసము—ఈ రసమునందు ప్రేమతత్త్వము యొక్క పరాకాష్ఠసూచింపఁబడుచున్నది. భక్తుఁడు భగవంతుని కిపుడు పరిగ్రహమగుచున్నాఁడు.

ఈ మహాద్భుతరసమునందు ఏ నిర్మలదాంపత్య ప్రేమ ద్యోతితమగుచున్నదో, దాని విపరీత ప్రతిఫలన (Perverted reflection) మాత్రమే యీ లోకమునకు సంబంధించిన దాంపత్య ప్రేమ యని మనము తెలిసికొనవలెను. భక్తుఁడు ఇపుడు స్త్రీ భావమునే వహించును. శాంత దాస్యరసముల యందు సుస్పష్టముగను, సఖ్యరసవాత్సల్య రసములయందు అస్పష్టముగను గనఁబడునట్టి భక్తునికి భగవంతుని యెడఁగల భయసంభ్రమములు ఈ రసమునందు మచ్చునకైనఁ గాన రావు. భక్తుఁడును, భగవంతుఁడును ఇప్పుడు ఒక్కటే అగుచున్నారు. భక్తుఁడిప్పుడు ఆఁడుదియే అగుటచే ఆమె తన సర్వస్వమును, తన శరీరమునుగూడఁ దన ప్రాణేశ్వరునికే అర్పించుచున్నది. ఆమె తన ప్రాణేశ్వరుని కొఱకే జీవించుచుండును. తన ప్రాణేశ్వరునికొఱకే తాను ప్రాణము విడుచుటకు సంసిద్ధురాలై యుండును. తన ప్రాణేశ్వరునకు సుఖమొనఁ గూర్చుటకొఱకు ఆమె చేయనిపనిగాని, ప్రయత్నముగాని,

ఉండదు. తనప్రాణేశ్వరుని కష్టసుఖములు ఇప్పుడు పూర్తిగఁ దనవే అగుచున్నవి. తన ప్రాణేశ్వరునకు ఎయ్యది భోగమొసఁగూర్చునో అట్టిభోగమును అతనికిఁ గల్పించు పనితప్ప వేఱొక పనియో ఆమెచేయదు. తనప్రాణేశ్వరుఁడు తృప్తినొందినఁ దాను తృప్తినొందును. తన ప్రాణేశ్వరుఁడు ఆనందించినఁ దాను ఆనందించును. తాను సొమ్ములు ధరించుట తన జీవితేశ్వరునకు ఆనందదాయకమైనచో వానిని ఆమె తప్పకధరించును. తాను మరణించుట తన జీవితేశ్వరునకు ఆనందదాయకమైనచో ఆమె మరణించియే తీఱును. ఇట్టి స్వార్థరహితమును, ఆత్మ సమర్పణరూపమును, అగు ప్రేమయే ఈ రసమునకు సంబంధించినప్రేమ. శ్రీ రాధికయు, యితర గోపికలును యీ రసమునకు సంబంధించిన భక్తురాండ్రు. కావుననే ఈరసము 'గోపీప్రేమ' మనఁబడుచున్నది. గోపీప్రేమ రసము అతిరమణీయముగ శ్రీ చైతన్య చరితామృతమందుఁ గ్రింద వివరించిన రీతిని వర్ణింపఁబడినది—

గీ. ప్రాణనాథుని సుఖమె మా ♦ పట్టుఁగొమ్మ
కాన మనవెత మనము లె ♦ క్కఁగొనఁ జనదు
అతని సంతోష పఱచు టే ♦ అగును మనకు
జీవితాశయ రూపమా ♦ చేష్టితంబు.

గీ. మనకు వెతగూర్చు పనియె ఆ ♦ తనికిఁ బరమ
సౌఖ్య మొనఁగూర్చు నట్టి చే ♦ ష్టయగు నేని
అట్టి వెత వెత కాదు వో ♦ అయ్యది మన
భాగ్యవశమునఁ గలిగిన ♦ పరమ సుఖము.

వ్రజగోపికలను బృందావనమందు విడిచి కృష్ణుఁడు మథురావాసమునకై పోయినప్పుడు కృష్ణవిరహముచే వారలకు అపరిమితదుఃఖము కలిగెను. అప్పుడు శ్రీరాధిక మీఁద నుదాహరించిన విధముగఁ జెప్పి వారిని ఊరార్చెను. ఆమె యభిప్రాయమేమనిన, దమ్మును విడిచిపెట్టుటే తమ విభునకు ఆనందదాయకమగు విషయమైనప్పుడు అట్టి ఎడఁబాటుచేఁ దమకు మరణము సంభవించినను దానిని దాము సంతోషపూర్వకముగ స్వీకరింపవలయుననియే. గోపికలు తమ ప్రాణములను విడిచియైనఁ గృష్ణుని సౌఖ్యమునే అరయుచుందురు.

పైనిఁజెప్పిన ప్రేమ తత్త్వసోపానములు ఈ లోకమునకు సంబంధించినవి కావు. ఈ లోకమునందుఁ గననగు ప్రభుదాస సంబంధమును, సఖ్య సంబంధమును, మాతాపుత్రి సంబంధమును, సతీపతి సంబంధమును, అగు ప్రేమభావములు భగవత్ప్రేమయొక్క విపరీత ప్రతిఫలన మాత్రములే. ఐహిక ప్రేమయందు స్వార్థపరత్వము సదా ఇమిడియే ఉండును. మన పుత్రుని మనము ప్రేమించుట మన సౌఖ్యముకొఱకే గాని వాని సౌఖ్యము కొఱకు అంతగా కాదు. ఈ విధముగనే భార్య భర్తను ప్రేమించుట భర్తయొక్క భోగము కొఱకే కాదు. ఇట్టి ప్రేమభావము లన్నిఁటియందును ఉభయులకును ఇంద్రియసంతర్పణము చేకుఱుచున్నది. వీనియందు స్వార్థము లేకుండుటకు అవకాశమే లేదు.

గోపీప్రేమయందుఁగల విశేష మాహాత్మ్యమును ప్రకటించునట్టి ఒక కథ ఒక పురాణమునందు గలదు. ఒకనాఁడు నారదుఁడు కృష్ణుని కడకు వచ్చి, "కృష్ణా! నీయెడల రుక్మిణికిఁగల ప్రేమ అధికమా? రాధికకుఁగల ప్రేమ అధికమా?" అని యడిగెను. అదివిని కృష్ణుఁడు రాధికకుఁ దనయెడలఁ గలప్రేమ సముద్రము వంటిదనియు, రుక్మిణి జూపుప్రేమ చవిటి పఱ్ఱైవంటి దనియు, వెంటనే బదులు చెప్పెను. నారదుఁడు అది విని ఆ విషయము తనకు నిదర్శన పూర్వకముగఁ జూపుమని ప్రార్థించెను. అప్పుడు కృష్ణుఁడు ఒక యుక్తిపన్ని నారదునితో ఇట్లనెను. "నారదా! నీవు ఇప్పుడే రాధిక చెంతకును, రుక్మిణి చెంతకును బోయి, నాకు ఆకస్మికముగ జబ్బు చేసెననియు, దమ పాదప్రక్షాళనోదకము నేను ద్రాఁగిన గాని నా జబ్బు కుదురదనియు, గావున వెంటనే ఆ జలము పంపవలెననియు, వారిరువురితోఁ జెప్పుము." నారదుఁడు తక్షణమే బయలుదేఱి మొదట రుక్మిణియొద్దకుఁ బోయి కృష్ణుఁడు చెప్పిన విధముగ ఆమె పాదప్రక్షాళనోదక మడిగెను. అది వినినంతనే రుక్మిణి నివ్వెఱపడి తనచేతఁ గృష్ణుఁడు ఎంతటి అపచారము చేయింపఁ దలఁచినాఁడనుచు లజ్జావనత వదనయై నారదునితో మాఱుమాటయిన ఆడకుండ అచ్చటనుండి లేచిపోయెను. తర్వాత నారదుఁడు రాధిక యొద్దకుఁబోయి అట్లే అడుగఁగా ఆమె విని మిగుల సంభ్ర

మముతోఁ దన పాదప్రక్షాళనోదకము అతనికే ఇచ్చి కృష్ణు నకు ఎట్టి అపాయమును రాకుండుటకై తాను వెంటనే అతని దర్శనమునకుఁ బోవలయునని అతనిని ఆజ్ఞాపించెను. అప్పుడు కృష్ణుఁడు తనయొద్దకు మరల వచ్చిన నారదమునితో తన ఆజ్ఞ రుక్మిణికి రుచింపనందున, అదియొక పాపకార్యముగ ఆమె భావించెననియు, రాధిక మాత్రము భగవదాజ్ఞ యెట్టి దైనను దానిని బరిపాలించుటే వ్రతముగఁ గలదగుటచేఁ దన ఆజ్ఞను బాలించె ననియు, అట్టి అనుచితమగు ఆజ్ఞను బాలించుటచేఁ దాను నిత్య నరకావాసము ఆమెకుఁగలిగించి నను ఆమె లెక్కఁగొనక దానిని సంతోష పూర్వకముగ స్వీకరించుననియు జెప్పెను.

శ్రీగౌరసుందరుఁడు అవతరింపక పూర్వము ఈ గోపీ ప్రేమతత్త్వము శాస్త్రగతముగనే ఉండెనుగాని ఆచర ణములోలేదు. అతఁడు తత్ప్రేమానుశీలన మొనర్చి యిత రులు దానిని అనుశీలన మొనర్చుటకుఁ దాను మార్గదర్శకుఁ డయ్యెను. శ్రీగౌరసుందరుని అనుగ్రహముచేతనే గోపీప్రేమ అనిన ఎట్టిదో మనకుఁ దెలియుచున్నది. ఈ విధముగ శ్రీగౌర సుందరుఁడు లోకమునకుఁజేసిన ఉపకారము మహోపకారమే అగుచున్నది. కాని యిది మహోపకారమని తెలిసికొనుస్థితి అయినను మనకు యింతవఱకు లభించెనో లేదో అను విషయము సందేహాస్పదముగనే ఉన్నది.

---

# కలిపురుషుని ఆత్మకథ.

[మూలము సంగపేర చలిత భాషలో రచితమైనది.]



నాపేరు కలిపురుషుడంటారు. నన్నెరగనివారు మన దేశంలో ఎవరూలేరు. అయోగ్యుల కందరికీ నేను పెద్ద స్నేహితుణ్ణే అయినా యోగ్యులుకూడా నాగొప్పతనం కొంత గ్రహించారు. ఇప్పుడు నాసంగతి కొంచెం మీతో మనవి చేసుకోవలసిఉంది. పూర్వకాలంలో పరీక్షిన్మహారాజుగారు మన ఇండియాదేశమును ఏలుతూఉన్నప్పుడు ధర్మదేవత డొక్కపగిలేటట్టుగా నేను నా బూట్సుకాలుతో తన్నడం వారు స్వయంగా చూచి వారి రాజ్యంలోనుంచి నన్నవతలికి సాగనంపుటకు ప్రయత్నించారు. కాని, నేను వారి నట్టే బతిమాలుకొన్నపైని, వారు నాపై కనికరించి వారి రాజ్యంలో నాలుగు స్థలాలలో మట్టుకు నేనుండడాని కనుజ్ఞ యిచ్చారు. అందులో మొదటిది జూదం, రెండవది త్రాగుడు, మూడోది ఆడది, నాలుగోదేమో పరహింస. * వారు నాకిచ్చిన యీ స్థలాలు నాకు మంచి నివాసయోగ్యమైన స్థలాలని తెలుసుకొన్నాను; గాని నేను వీటిలో ఏదో ఒక స్థలంలో ఉంటే తక్కిన మూడున్నూ ఖాళీగా ఉంటవే అని నాకు చాలా దుఃఖంవచ్చి నేను మళ్ళీ మహారాజుగారి దర్శనం

---

* శ్లో॥ అభ్యర్థిత స్తదా తస్మై స్థానాని కలయేదదౌ
ద్యూతంపానం స్త్రియః సూనా యత్రాధర్మశ్చతుర్విధః.

చేసి వారి పాదాలు పట్టుకొని "మహారాజా! తమరు నాకు దయచేయించిన నాలుగు స్థలాలలో నేను ఒకే కాలమందు ఉండలేను. పోనీ, వాటిలో కొన్నిటిని ఖాళీగా విడచిపెడదామంటే మనస్సొప్పకుండా ఉంది. కాబట్టి యీ నాలుగు స్థలాల మహత్త్వంగలది ఒక్కటే స్థలం నాకనుగ్రహించాలి" అని వారిని వేడుకొన్నాను. అప్పుడు వారికి నాయందు చాలాదయ పుట్టి జేబులోనుంచి ఒక బంగారు నవరసు (సవరను, లేక, పెద్దకాసు) తీసి నాకుచూపించి "ఓయీ కలీ! నీవుకోరిన స్థలమిదిగో, వెంటనే ప్రవేశించు" మని చెప్పి దానిని నాచేతిలో వేశారు. ఈ నవరసు నాచేతిలో పడేసరికి దానిలోనుంచి అనృతం, మదం, కామం, క్రోధం, వైరం, అనే పంచరత్నాలు బయలుదేరాయి. ♦ చీట్లపేక, చదరంగం, పాచికలాట, "యత్రవర్తంతి తత్రతిష్ఠామి." అనగా, ఇవన్నీ ఎక్కడ సాగుతూఉంటవో అక్కడ నే నవతరించి, నా భక్తుల నను గ్రహిస్తూ ఉంటాను. విదేశాలనుంచి దిగుమతిచేయబడిన గుఱ్ఱపుపందేలు, లాటరీలుకూడా నావసతిస్థలాలే. ఈరెండింటిలోమాత్రం కోటీశ్వర్లుకూడా కాలుగోసుకొని కాపరండుంటారు. బంగారమే నాహాజూరాశీసని ముందే నేను మనవిచేసుకున్నాను. నలుడు, పుష్కరుడు, ధర్మరాజు, దుర్యోధనుడు, శకునిమామ, మొదలైనరాజులున్నూ, ఢిల్లీ

శ్లో॥ పునశ్చయాచమానాయ జాతరూప మదాత్ప్రభుః
తతోఽనృతం, మదం, కామం, రజో, వైరంచ పంచమం.

చక్రవర్తులున్నూ, నావసతి స్థలాలన్నిటిలో ముఖ్యంగా నా మొదటివసతిలో చాలాకాలం కాపరంచేశారు; ఒకరికొంప తీశారు; తమకొంపకూడా తీసుకున్నారు. ఇప్పటికీనా మొదటి వసతి అయిన జూదం, ఊరికి దూరంగాఉండే కొన్ని కొన్ని యిళ్ళలోనూ, చాలాషాపులలోనూ, క్లబ్బులూ, హోటేళ్లూ, మొదలైన పరమపవిత్ర స్థానాలలోనూ అవిచ్ఛిన్నముగా సాగుతూనేఉంది.

ఇక నారెండో వసతి గురించి మనవి చేస్తూన్నాను. అనగా తాగుడుగురించి. ఇది యిప్పుడు రకరకాలుగా బయలుదేరింది. ఇందులో ముఖ్యమైనరకం పానీయరూపమే. ఇదే నాప్రియవసతి. తక్కినవసతులు పత్రీ, పొగాకు మొదలైనవి. పత్రిఅనేది, నిషాఅలవాటుచేత బొత్తుగా మతిచెడిపోయి, ఉన్నచోట ఉండకుండా, తిన్నచోట తినకుండా, తిరుగులాడే సాధూ-బైరాగులని పేరుబెట్టుకొన్న దేశదిమ్మరులసొమ్ము. ఈ నిర్భాగ్యులు నాకు దాసానుదాసులై ఈ నావసతి స్థలాన్ని తమప్రాణం పోతూన్నావిడువలేక, ఇది తమ వైరాగ్యానికి ముఖ్యసాధనమనిన్నీ, తమభక్తికి కల్పవృక్షంలాటి దనిన్నీ, చెప్పుకొని ఆనందిస్తూ ఉంటారు. కాని నిజమైన సాధువులు నా సంగతి వెంటనే గ్రహించి తమపొలిమేరకైనా నన్ను రానివ్వరు. ఈ నావసతిని తంత్రశాస్త్రులు ఏలాగు వర్ణిస్తున్నారో మనవిచేస్తున్నాను వినండి. "తమలపాకూ, పోకచెక్క,

పొగాకూ, గంజాయి, సారాయి మొదలైనవి మనిషికి పరమార్థ దృష్టి ఎన్నటికీ పుట్టనివ్వవు. ఇవి సేవిస్తూఉన్న కొద్దీ ఇంకా సేవించాలనే బుద్ధికలుగుతూనే ఉంటుంది. పూర్తిగా సేవించినప్పుడు భరించరాని కామోద్రేకం కలుగుతుంది. తాంబూలం వేసుకోవడంవల్ల మనస్థిమితం ఉండదు. పొగాకు సేవించడంవల్ల సోమరితనమూ, ఉన్న తెలివి ఊడిపోవడమూ, దేవుడంటే తలనొప్పీ, మొదలైనవి కలిగితీరుతవి. గంజాయికి మనిషియొక్క తెలివి తేటలను నిర్మూలంచేసే మహాశక్తి ఉంది. నల్లమందు, భంగు మొదలైన విషావస్తువులను సేవించేవాడు రెండుకాళ్ళ మనిషి అయినా, నాలుగుకాళ్ళ పశువుకంటె ఏమాత్రమూ తక్కువవాడుకాడు. బహిర్ముఖులైన జీవులకు ఎన్నటికీ దైవచింత కలగకుండా ఉండేటందుకు కలిపురుషుడే వీటిని నిర్మించాడు."

నా రెండో వసతి కథ పూర్తిఅయింది. ఇక నా మూడో వసతిఅయిన ఆడదాన్నిగురించి మనవి చేస్తున్నాను. ఆడదంటే ఏతన్మాత్రమైన వస్తువు కాదు. లోకాన్నంతటినీ ఆకర్షించే మహాశక్తి దానికుంది. నాస్వాధీనంలో ఉండే వ్యసనాల నన్నిటినీ ఒక్కచోటచేర్చి, వాటితో స్త్రీవ్యక్తిని తయారు చేశాడుబ్రహ్మ. ఈస్త్రీ పురుషునియొక్క పదకొండింద్రియములకున్నూ పూర్తిగా పనికలిగిస్తూ ఉంటుంది. విధివిహితంగా వివాహమాడి తమ ధర్మపత్నులతో శాస్త్రసమ్మతమైన జీవనంచేస్తూఉన్న మహనీయుల చెంతకు నేనుపోలేనుగాని

స్త్రీలోలులుమాత్రం నాస్వాధీనంలోనే వుంటారు. ఇంద్రియాల కెప్పుడూ సంతర్పణచేస్తూఉండే గృహస్థులు తమ స్త్రీలోలత్వాన్ని సమర్థించుకోవడానికి ఏవోకొన్ని అబద్ధాలు కల్పించి చెప్పుతునే ఉంటారు. వేశ్యలకొంపలూ, నాటకశాలలూ నాకు ప్రియమైన వసతిగృహాలు. నా అనుచరులందరితోగూడా నేను వాటిలో కాపరంచేస్తూఉంటాను. మాదకవస్తువులను సేవించడంవల్ల, కామోద్రేకం భరించలేని సాధూబైరాగులైన లెక్కలేని కౌపీన ధారులు పైని జెప్పిన రెండు వసతి స్థలాలలో నున్నూ కాలుగోసుకొని కాపరం చేస్తూ ఉంటారు. వారు ఆ స్థలాలనున్నూ, అందులోఉండే ఆడపడుచుల నున్నూ విడువలేక వేశ్యల కొంపలకు వెళ్ళడం తమ మతధర్మం గనుక తమకు తప్పనిసరి అని సమర్థిస్తారు. నాకు గులాములైన మరికొందరు వేశ్యలకొంపలకు తాము వెళ్ళకపోతేవాళ్లు తిండిలేక చస్తారనిన్నీ, అందుచేత తమకు పాపంవస్తుందనిన్నీ చెప్పి, వాళ్ళకొంపలను మరి విడవరు. మఱికొందరు సమదర్శనులైన పండితులు శుష్కవేదాంతం ప్రారంభించి అన్నిటి యందూ సమబుద్ధి ఉండాలని గీతాచార్యుడు చెప్పే ఉన్నాడు గనుక, వేశ్యలనేకాక ప్రపంచములో ఏ వస్తువును కూడా తృణీకరించడానికి వీలులేదనిన్నీ, ఏ మట్టితో దుర్గామందిరం కట్టేరో ఆ మట్టితోనే వేశ్యామందిరం కూడా కట్టేరనిన్నీ, చెప్పి, తాము వేశ్యామందిరానికి వెళ్ళినప్పుడు

ఎవరున్నా ఆక్షేపణ చేయగూడదని వాదిస్తారు. మరికొందరు రామానందరాయలు, చండీదాసు, విద్యాపతి అనే వాళ్ల పేళ్ళు చెప్పి వాళ్లవలెనే తమకుగూడా వేశ్యాసంబంధం పరమార్థసాధన మేలకాకూడదని వాదిస్తారు. మరికొందరు పరమ రసాస్వాదన కొఱకు ఆడవాండ్లను పోగుచేసి రసకీర్తనలు వారిచేత పాడిస్తారు. మరికొందరు అద్వైత, నిత్యానంద, శ్రీ వాస ప్రభువుల పేళ్లుచెప్పి తాం మేలవారివలె నలుగురాడవాండ్లను గట్టుకోకూడదని వాదిస్తారు.

ఇక నా నాలుగోవసతి స్థలంగురించి చెప్పవలసిఉంది. దీనిని పరహింసే అనండి, జీవహింసే అనండి, నా కేమీ అభ్యంతరంలేదు. దీనిని సమస్తమైన వారున్నూ సమాన ప్రతిపత్తితో గౌరవిస్తూఉన్నారు. దీనికిలోబడి నప్పుడే రాజులకూ, రాజులకూ కలహంపుట్టడమున్నూ వారు ఒకరినొకరు చంపుకోడమున్నూ తటస్థిస్తూఉన్నది. మాంసంరుచి మరిగిన వారు ఈ నావసతిని విడువనే విడువరు. నవనాగరికతా శిరోమణులు క్లబ్బులు వగైరాలలో అందరితోపాటు మాంసాహారం తినడం చేతనే నలుగురిలో తమ గౌరవంకాస్త నిలబడుతూఉన్నది. తిలకమూ, మాలికలూ ధరించే బ్రాహ్మణనామకులు కూడా దీనికి కకుర్తిపడేవారే. మత్స్యావతారాలను, వరహావతారాలను, కడుపారా గౌరవించడమే తమ మతధర్మమని వారు వాదిస్తారు. మాంసము తింటేనే కాని

శరీరానికి బలమేలాగు వస్తుందని వారడుగుతారు. కాళీపూజ చేసేవారికికూడా నా ఈవసతిమీద చాలాప్రీతి. తాముతమ తల్లి పేరుచెప్పి రకరకాలు మాంసాలు ఆరగిస్తారు. ఈ కపట వర్తనమంతా సాధుపురుషులు సులభంగా తెలుసుకొంటారు గాని, నాచేత చిక్కిఉన్న చచ్చుపీనుగులకు తెలివి తెల్లారి పోవడంవల్ల వారేమిన్నీ తెలుసుకోజాలరు.

పైని జెప్పిన నాలుగు వసతులకేంగాని నాఅయిదో వసతే చాలాదివ్యమైనది. ధనవంతుల యిళ్లంటే నాకు చాలా యిష్టం. అచ్చట నేను ప్రవేశించి, "నిత్యకళ్యాణం పచ్చతోరణం" గా ఎప్పుడూ కాపురం చేస్తూఉంటాను. పరీక్షిన్మహారాజుగారి ఆశీర్వచనంబట్టి పైనిజెప్పిన నాలుగున్నూ డబ్బునాశ్రయించుకొనే ఉంటవిగనుక ధనికుల యిండ్లలోఉండే, నేను సమస్తం సాధిస్తూ ఉంటాను. కాని సాధుపురుషులపేరు చెప్పితే మాత్రం నాకుభయం. వారి నాశ్రయించిన వారి దగ్గరకుకూడా నేను పోలేను. పరీక్షిన్మహారాజుగారి పేరంటే నాకెంతభయమో మీకు తెలుసునుగదా? ఇదేవిధంగా అంబరీషుడు, ప్రహ్లాదుడు ఏలే రాజ్యముల పొలిమేరకు కూడా నేను వెళ్ళలేను. ఇప్పుడు పెద్దపెద్ద పట్నాలలో నాకు దివ్యమైన వసతులేర్పడ్డాయి. కాని ఆచుట్టుపట్లనే భగవత్ప్రార్థన సమాజాలులేచి అందులో ఉండే గురుశిష్యులున్నూ వారిగాలి తగిలినవారున్నూ తమ పవిత్ర జీవనాలచే ఇతరులను

కూడా పవిత్రంచేస్తూ నన్నూ పట్నాలలోనుంచి సాగనంపడానికి కంకణాలు కట్టుకొని కూర్చున్నారు. నేనుగాని, నాఅను చరులుగాని దూరంలో కనబడినప్పటికీ మమ్మలిని నిలవ నియ్యకుండా తరుము తున్నారు. నేను వారివద్దకు పోలేను. నా వసతిస్థలాలు వారు కన్నెత్తిచూడరు. మీదిమిక్కిలి నా సంగతి అందరికీ చెప్పి నామొగమెక్కడా చెల్లకుండా చేసేశారు. కాబట్టి యిప్పుడు నా దినము లేమీ బాగులేవు.

కాని నేను మాత్రం ఊరుకోలేదు. నా శిష్యులద్వారా వారి నడవడి గురించి వారిమీద అపవాదాలు కల్పించి నేనుకూడా వారికి నలుగురిలో మొగం చెల్లకుండా చేస్తున్నాను. తమకు దేవుడి వాక్యాలు ప్రమాణాలంటూ వారు నా శిష్యులతో, "మీరు చాలా తెలివైన వారు. మీ తెలివి మావద్ద ఉన్నా మేము దాన్ని ఉపయోగించలేము, మేము నిజంగా తెలివి తక్కువ వాళ్ళమే. మమ్మలిని దేవుడు ఆలాగు చేశాడు" * అని మొండిబడి చెప్తూ తారు. ప్రేమచూపడమే కాని వారికి కోపినా కోపంలేదే. ఇదో పాపం కూడా నేనున్నూ, నా శిష్యులున్నూ నడుములు విరిగేటట్లూ మోయవలసి వచ్చింది.

---

* If any man among you seemeth to be wise in this world, let him become a fool that he may be wise. For, the wisdom of this world is foolishness with God (Bible).

*Corinthians III — 18 & 19*

ఇంతవరకూ నాసంగతిన్నీ, ఏవిలాసముతో నాకు జాబులువ్రాస్తే నాకుతప్పకుండా అందుతవో ఆస్థలాల సంగతిన్నీ, క్లుప్తంగా మనవిచేశాను. ఇప్పుడు నాప్రభావం గురించి కొంచెము చెప్పాలని ఉంది. పెద్దపెద్దవారంతా నన్ను మెచ్చుకొని ఎటువంటి యోగ్యతాపత్రాలు ఇచ్చారో మీకునేను చెప్పితే నమ్మకం ఉండదు. ఒకటిరెండైనా మీ కళ్లతోచూడాలి. ఇదిగో ఒకహిందూస్థానీకవి నన్ను మెచ్చుకొని చెప్పినపాట—

"సాచకహేతో, మారేలాతా, ఝూటా జగత భలాయి
గోరస గలిగలి ఫిరే, సురాబైఠ బికాయి
చోర్కు ఛోడే. సాధుకుబాంధే, పథికకుల గావే ఫాసీ
ధన్యకలియుగ। తేరి తమాషా, దుఃఖలాగే అవుర్ హాసీ

"ఓహో కలియుగంగారూ! ఛెబాష్ ఛెబాష్! ఏమిటండీ మీతమాషాలు! అవితలచుకొంటే ఒకప్పుడు దుఃఖమొస్తుంది; ఒకప్పుడు నవ్వొస్తుందినాకు. ఏమంటే మీ హయాంలో నిజంచెప్పేవారికి దుడ్డుదెబ్బలు, అబద్ధాన్నే లోకమంతా మెచ్చుకొంటారు. పాలూ, పెరుగూ, ఇంటింటికి పోయి అమ్మినా కొనేవారులేరు. షాపులోకూర్చుండి అమ్మినా సారాయికి గొప్ప చలామణి. దొంగలకాటవిడుపు. నిర్దోషులకు ఖైదు. దారిబోయేవారికి ఉరికొయ్యా."

ఈ కవిగారే మరొకస్థలంలో నన్ను ఇంకోరకంగా వర్ణించారు.

"గయ్యాదూదకు కుత్తాపావే, ఉసాక్కబచడా భూకా,
స్యాలేకు ఉత్తమ ఖిలావే, బాపకె షావేగూఖా
ఘరకి బౌర్‌ప్రీతి నపావే, చిత్తచురావే ధాసీ
ధన్యకలియుగ! తేరి తమాషా, దుఃఖులాగే అన్నుర్ హాసీ"

"ఓహో కలియుగంగారూ! మీరెంత వారండీ! మీప్రజ్ఞావిశేషాలు నేనెంతని మెచ్చుకోనేదండీ! మీతమాషాలు చూస్తే నాకొకప్పుడు నవ్వొస్తుంది; ఒక్కొక్కప్పుడు ఏడుపొస్తుంది. యేమంటే మీహయాంలో దూడలికితల్లిపాలు లేవు. కుక్కలికి ఆవుపాలు. కన్నతండ్రికి కడుపునూడ్చి బావమఱదులకు పరమాన్నం. ఇంట్లోపెళ్ళాలు ఏడుస్తూవుంటే పట్నం వేశ్యలతో పరియాచకం".

చూశారుగదా నాప్రభావం? నాప్రభావం జోరుగా ఉండేరోజులలో చాలామంది అసుర సంపత్తువారు లోకంలో అవతరించి భక్తిమార్గాన్ని పాడుచేశారు. అప్పుడు దేవుడికి కూడా వెట్టపుట్టింది. అప్పుడు తాను ఈరాక్షసుల నందరినీ మోహపెట్టడానికిన్నీ, జయించడానికిన్నీ, ప్రపంచం అంతా మిథ్యఅనే మతమొకటి లోకంలో ప్రచారం చేయించినాడు. ఆప్రచారంలో నేనుకూడా చాలా సాయంచేసి ఆఒక్క మతాన్నే అనేక రూపాలతో ప్రపంచమంతా వ్యాపింప

చేశాను. నాప్రభావానికి లోబడి బ్రాహ్మణకులంలో పుట్టిన వారు తాము ఉత్తమ కులస్థులమని గర్వించి యితరకులస్థులను పీడించడానికి మొదలుపెట్టేరు. ఇంతటితో ఆగక వాళ్ళపైని వైరమున్నూ, మాత్సర్యమున్నూ వహించి వాళ్ళలో యోగ్యులైన వారిని తమలో చేర్చుకోవడం మానేశారు. నాప్రభావంచేతనే ప్రజలు భగవంతుని కొలవడం మానేశి దేవతల్ని పట్టుకొని దేవులాట ప్రారంభించారు. సాక్షాత్తూ నిత్యలోకంనుంచి దిగబడిన సాధుపురుషులు వచ్చి హితం చెప్పినా ప్రజలు నాకు గులాములై ఉన్నందున వారిమాటలు వారు వినిపించుకోవడంలేదు. జీవుడు నాచేతిలో చిక్కకుండా ఉండడానికి శాస్త్రకారులు అనేక ఉపాయాలు వ్రాశారు. కాని ఆఉపాయాలు నాదగ్గర ఏమీ పనికిరాలేదు. జీవుడు నాచేతిలో పడకుండా చేయడానికి శాస్త్రాలలో నిగూఢంగా చెప్పబడిన అమోఘమైన ఔషధరాజం ఒకటి లేకపోలేదు. కొంతకాలం క్రిందట ఈ ఔషధాన్నే భగవంతుడు స్వయంగా భూలోకమం దవతరించి యింటింటికీ వెళ్ళి పంచిపెట్టేడు. ఆ ఔషధాన్ని భగవన్నామమం అంటారు. నేనుకూడా ఊరుకోకుండా బాగా ఆలోచించి నాసహచరులూ, నేనూ కలిసి నకలుమందులు తయారుచేసి మాకు దొరికిన వారికందరికీ పంచిపెట్టేము. మహామేధా సంపన్నులైన పెద్దతలకాయ

లందరూ దేవుడిచ్చినమందు అనతెలపా రేసి నేను తయారు చేసిన నకలు మందులనే వాడడం ప్రారంభించారు.

ఎవరైనా పెద్ద తలకాయలవారు దేవు డిచ్చిన మందు పొరపాటుచేత పుచ్చుకొన్నా, నేనున్నా, నాప్రతినిధులున్నా వెంటనే వాళ్ళవద్దకు పోయి వారా ఔషధాన్ని ఆత్మ శ్రేయస్సుకొఱకు ఉపయోగించకుండా చేసి, వాంతిభేది, మహామారి, స్ఫోటకం మొదలైన రోగాలు రాకుండా చేయడానికి ఉపయోగించవచ్చునని ముఖ్యముగా సలహాలు చెప్పుతూ ఉంటాము. ముఖ్యంగా పెద్దపెద్ద పండితులు మా మాటలే వింటారుగాని ప్రజల కొరకు కవతరించిన దేవుని మాటలు వినరు. ఆ అవతారపురుషుడు తాను పంచిపెట్టిన నామౌషధాన్ని వినయం, సహనం, గర్వరాహిత్యం, సర్వజన సన్మానబుద్ధిఅనే నాలుగూ కలిసిన అనుపానంతో పుచ్చుకొని* ఆడదీ, డబ్బూ, ప్రతిష్ఠా అనే మూడు అపథ్యాహారాలని వర్జించమని నొక్కినొక్కి చెప్పేడు పాపం. కాని కొందరికి అనుపానమే కుదిరిందికాదు. కొందరు పథ్యం చేయలేక పోయేరు. కాబట్టి మందుగుణ మిచ్చిందికాదు. ఆసమయం కనిపెట్టి నేను వెంటనేవారి వద్దకు పోయి, "ఔషధం అమ్ము కొండి, బోలెడు డబ్బువస్తుంది"అని సలహా చెప్పేను. నామాట

---

* తృణాదపి సునీచేన, తరోరపి సహిష్ణునా
అమానినా మానదేన, కీర్తనీయ స్సదాహరిః.

ప్రకారం వాళ్లు నాఔషధాన్ని అమ్మడం మొదలు పెట్టేరు. కొన్నవాళ్లకందరికీ పథ్యంచేయక పోయినా మందు గుణమిస్తుందని చెప్పడం ప్రారంభించారు; అప్పటినుంచీ ఆమందు సీసాలు లెక్కలేకుండా చెల్లుతూ వచ్చినవి. కాని వాళ్ళ మాటలు నమ్ముకొని ఔషధసేవ చేసినవారు నా వలలో చిక్కుకొంటున్నామని మాత్రం తెలుసుకోలేకుండా ఉన్నారు. ఇంకా నేను కొత్తకొత్తవలలను తయారుచేయించి రకరకాల మనుష్యుల్ని రకరకాల వలల్లో పట్టి తెప్పించి నా పార్టీని బలపర్చుకొందామని చూస్తున్నాను.

నాప్రభ వెలుగుతూ ఉంటే దేవుడెక్కడ ? గురువెక్కడ?

నేను ఎంత కలిపురుష్ణిఅయినా నాఅద్భుత శక్తులను నేను ఆట్టే వర్ణించడం నాకే బాగున్నట్టు కనబడలేదు. కాబట్టి సెలవు పుచ్చుకొంటాను. ఓ! లేదులేదు. మీరు నన్ను సాగనంపేవఱకూ మీవద్దనే ఉంటాను.

శ్లో. ఇదం శరీరం పరిణామపేశలం
పతత్యవశ్యం శతసంధిజర్జరం
కి మౌషధైః క్లిశ్యసి మూఢ! దుర్మతే!
నిరామయం కృష్ణరసాయనం పిబ.

ఓమ్ తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

# అర్థసూచిక.

1 అంశవైభవము (పుట 8)—భగవంతుని పూర్ణాంశవిలాసము, Full subjective portion.

2 అచింత్య భేదాభేద తత్త్వము (4) చూడు. పీఠిక పుట. 3.

3 అద్వయజ్ఞాన తత్త్వము (1) చూడు. పీఠిక పుట 2.

4 అధ్యక్షజజ్ఞానము (63) ఇంద్రియముల మూలమున గలిగెడి జ్ఞానము. as opposed to. అధోక్షజ జ్ఞానము.

5 అనుప్రవేశము (113) లోనికి జొరబడుట.

6 అనుభవజ్ఞానము (24) లౌకిక విషయానుభవమునకు సంబంధించిన జ్ఞానము.

7 అప్రాకృతనామరూప విశిష్టుడు (2)–ప్రకృతి సంబంధము ఇంచుకయు లేని నామరూపములతో నొప్పువాడు.

8 అభినివేశము (169)–పట్టు విడువకుండుట, Leech - like clinging.

9 అవినాభావ సంబంధము (102)–ఒకదాని నొకటి విడువకయుండుట, inextricable interrelation.

10 అసంప్రజ్ఞాత సమాధి (58)–ఎట్టి చిత్తవృత్తియు లేని స్థితి.

11 ఆత్మశేషభూతులు (131)–తనకు ఉపకరించువారు.

12 ఆత్మసమర్పణము (7)–ఆత్మస్వరూపుడగు తనను గా భగవంతుని కర్పించుకొనుట.

13 ఆత్మోపలబ్ధి (26)–మఱచిన తన రూపమును మఱల బడయుట, లేక తెలిసికొనుట.

14 ఆశ్రయము (178)–ఆధారమగునది, Support.

15 ఈశ్వరవాదులు (1) చూ. పీఠిక. పుట 3.

16 ఏకవాక్యత (18)–ఒక్కమాటయే అగుట, Reconciliation.

17 ఐక్యానుసంధానము (1)-ఒక్కటియే అనుటను భావించుట.

18 ఐశ్వర్య స్వరూపుఁడు (179)-భయముతోఁగూడిన భక్తితోఁ గొలువఁదగిన స్వరూపము గలవాఁడు, Form full of majesty and grandeur.

19 ఐహిక భోగాన్వేషణము (110)-ప్రపంచభోగములకై వెదకులాడుట.

20 కర్మవిముఖప్రేమ (91)-భగవంతుని ప్రేమించుటే జీవాత్మయొక్క ప్రధాన వ్యాపారము.

21 కార్యకారణశృంఖల (100)-"ఇది కార్యము, దీని కిది కారణము" అను మొదలగు గొలుసు, Chain of causes and effects.

22 కైశోరమాధుర్య స్వరూపము (186)-చిఱుతప్రాయముతోఁ గూడిన మనోహర రూపము, Juvenile form of mellowed sweetness.

23 గణేశ, శివ, శక్తి, సూర్య, విష్ణువులు (2)-ధర్మమును గూర్చి దేవత సూర్యుఁడు; అర్థమునుగూర్చి దేవత గణేశుఁడు; కామమును గూర్చి దేవత శక్తి; మోక్షమునుగూర్చి దేవత శివుఁడు; భక్తిని గూర్చి దేవత విష్ణువు.

24 గౌరవ సఖ్యము (188)-గౌరవ మిశ్రితమగు సఖ్యము. కృష్ణునియెడ పాండవులకుఁగల స్నేహభావము దీని కుదాహరణము.

25 జ్ఞాత జ్ఞాతృజ్ఞేయములను త్రిపుటి (4)-తెలివి, తెలిసికొనువాఁడు, తెలియఁదగినదియు నను మూఁడు.

26 జ్ఞానము సారభూతము (91)-భగవంతునిఁ దెలిసికొనుటయే జీవాత్మ యొక్క తాత్త్వికస్థితి.

27 చరమ ప్రయోజనము (58)-కట్టకడపటి కృత్యము, Ultimate purpose.

28 చిత్తైకాగ్రత (1)-చిత్తము (వాసనారూపమగు మనస్సు) ను ఒకదాని యందు నిలుపుట, Concentration.

29 చిత్ప్రకాశము (8)-భగవంతుని తనుకాంతి, Effulgence aspect of God head.

30 చిన్మయ విగ్రహుఁడు (1)-రక్తమాంసమయము కాని నిత్య (చిత్) తత్త్వమే రూపముగా గలవాఁడు, Having a spiritual body.

31 జలతత్త్వము, ఆత్మతత్త్వముల సమ్మేళనము (25)-ఆత్మతత్త్వమున కంటియున్న ప్రకృతిదోషము నశించుటకు జ్ఞానోదక (Baptismal water) మని చెప్పఁబడు జలతత్త్వముయొక్క సంబంధము దానికిఁ గలుగుట.

32 తన తత్త్వమరూపములగు చితాకర్షములు (111)-తన వస్తుతత్త్వము నకు అనుగుణములగు ఆత్మవ్యాపారములు.

33 తర్కమయ వేదాంతులు, తర్కాతీత వేదాంతులు (4)-చూ. పీఠిక. పుట 3, 4.

34 దృశ్యవర్గ విచారము (2)-చర్మనేత్రమునకుఁ గనఁబడెడి దృష్టియందలి పదార్థములను బరిశీలించుట.

35 దైవోపహతులము (170)-దేవుని దండనకుఁ బాత్రులైన వారము.

36 ధర్మబోధప్రచారము (126)-మతమును బోధించుట, వ్యాపింపఁ జేయుట.

37 ధర్మాధికారి (131)-స్వధర్మము నాచరింపఁ జేసెడివాఁడు.

38 నామరూపగుణ లీలాపరికర వైశిష్ట్యము (60)-ప్రకృతి సంబంధములు కాని నామము, రూపము, గుణములు, లీలలు, పరిజనము మున్నగు నవి, Spiritual name, form, Attributes, Pastimes & Paraphernalia.

39 నిత్యలోకారోహణ దినము (34)-నిత్యలోకమును జేరుకొన్న దినము, Ascension Day.

40 నిత్యస్వరూప ధర్మాచరణము (7)—నిత్య (భగవత్సేవా)రూపముగు తన ధర్మము నాచరించుట.

41 నిత్యసిద్ధరూపము (23)—నిత్యమును, స్వతస్సిద్ధమును అగు ఆకారము.

42 నిర్గుణుఁడు (4)—ప్రకృతి సంబంధములగు గుణములు లేనివాఁడు.

43 నేతి నేతి ప్రక్రియ (64)—"ఇది కాదిది కా"దను ప్రణాళిక, Process of negation.

44 పరమరసాస్వాదనము (200)—భగవంతునికి సంబంధించిన ఉత్కృష్టరసమును జవిఁగొనుట.

45 పరోత్కృష్ట (94)—ఉత్కృష్టస్థితి; పరమోత్కృష్ట, Acme.

46 పరోక్షవస్తుజ్ఞానము (62)—ఇంద్రియములకు గోచరముకాని తెలివి, అనఁగా ఆత్మజ్ఞానము.

47 ప్రకృతి సీమయందు యథాదృష్టములుగ నెలకొల్పుట (60)—తాము (సహజ సమాధియందు) జూచిన విధమునఁ బ్రకృతి సంబంధములగు విగ్రహాదులయందు నిలుపుట.

48 ప్రత్యక్షవస్తుజ్ఞానము (62)—ఇంద్రియములకు గోచరమగు తెలివి.

49 ప్రత్యధిదేవతలు (58)—అవయవభూతములగు దేవతలు.

50 ప్రతీత స్వరూపులు (2)—భగవంతునికి అవయవములవంటివారు; దేవతలు.

51 పారమార్థిక క్షేమము (42)—ఆత్మసంబంధియగు శ్రేయస్సు, Spiritual welfare.

52 పౌరోహిత్యకర్తృత (108)—వేలుపాటు.

53 ప్రేమానుశీలనము (180)—ప్రేమను అనుసరించెడి స్వభావము, Cultivation of love.

54 పౌత్తళికతకును, శ్రీవిగ్రహారాధనమునకును గల భేదమేమి (20)—చూ. పుట 80.

55 బురాక్ (6)- దీనినే వాడుకలో "బులాకి పట్టి" అందురు. ఇది గాడిదకంటె యెత్తగునది; కంచరగాడిదకంటె చిన్నది. దీని కాళ్లు గుఱ్ఱపు కాళ్లు; డెక్కలు గుఱ్ఱపుడెక్కలు; మెడకుఁ గ్రింది భాగముకూడ గుఱ్ఱపురూపమే. దీని మెడ నెమలి మెడ; ముఖము మనుష్య స్త్రీముఖము; తోఁక నెమలితోఁక; ఱెక్కలు నెమలి ఱెక్కలు.

56 బ్రహ్మవాదులు (1)-చూ. పీఠిక, పుట 3.

57 భగవదధికార ప్రాప్తజీవులు (185)-భగవంతునిచే అధికారపదవిని పొందిన జీవులు (బ్రహ్మాదులు) Gods with delegated powers.

58 భగవన్మార్గాన్వేషకులు (165)-భగవంతునిఁ జేరుటకు అనువగు త్రోవను వెదకువారు.

59 భాగవత ధర్మము (4)-పరమపురుషారాధన రూపమగు ధర్మము (మతము).

60 భిన్నదృక్పథములు (18)-వేఱువేఱుగఁ గన్పట్టు త్రోవలు, Different aspects.

61 మాయ, ప్రకృతి (2)-భగవంతుని బహిరంగశక్తి, external potency of God.

62 మేదశ్ఛేదము (108)-క్రొవ్వును కరిగించెడిది; ఒకని యభిప్రాయము వేఱొకనికిఁ బొందకుండుట, Nerve-racking.

63 యౌగపద్యము (3)-రెండు ఏకకాలమునందు సంభవించుట, Simultaniety

64 వ్యతిరేకచింత (2)-తాను ఆత్మపదార్థమయ్యును, అనాత్మనుండి వేఱుపడుటచే "నేను అనాత్మకాను" అనెడి యెడతెగని చింత. ఈ చింతయందు అనాత్మ (ప్రకృతి) సదా స్మరింపఁబడుచునేయున్నది.

65 వృత్తివ్యాప్యము (58)-చిత్తవృత్తిచే వ్యాపింపఁబడినది.

66 వాస్తవచిన్మయ విగ్రహుఁడు (7)–సత్యమగు చైతన్య స్వరూపుఁడు.

67 వాస్తవ వస్తువు (5)–సత్యపదార్థము.

68 విచార జలితము (2)–ఆత్మ (Spirit) యెద్దియో, అనాత్మ (Matter) యెద్దియో పరిశీలించుటచేఁ దేలినది.

69 విప్రలంబ శృంగారచేష్ట (172)–ప్రియురాలికిని, ప్రియునకును ఎడఁబాటు వలనఁ గలిగెడి విలాసవ్యాపారము.

70 విశ్వసమ్మత మతము (4)–ఎల్లరచే నొప్పుకొనఁదగిన మతము.

71 విషయము (178)–గోచరమగునది, Target.

72 విస్రంభ సఖ్యము (188)–స్వేచ్ఛామయమగు సఖ్యము. శ్రీకృష్ణుని యెడ గోపబాలకులకు గల స్నేహభావము దీని కుదాహరణము.

73 శక్తిసంచారము (139)–తనకుఁగల సామర్థ్యమును శిష్యులకుఁగలిగించుట.

74 శాఖామతము (4)–అవాంతరభేదముగల మతము, Sectarian religion.

75 శిక్షాప్రణాళిక (18)–మతోపదేశ సరణి, Method of (religious) instruction.

76 సంప్రజ్ఞాత సమాధి (58)–చిత్తవృత్తితోఁ గూడుకొన్న సమాధి.

77 సగుణోపాసకులు (4)–గుణపూజ చేయువారు; సగుణబ్రహ్మము నుపాసించువారు.

78 సచ్చిదానంద లక్షణము (1)–చూ. పీఠిక. పుట 2.

79 సమంజసతా లాభము (3)–లెస్సయగు నునికిని బొందుట, Harmonisation.

80 సర్వంకషము (3)–సమగ్రము, All – embracing.

81 సర్వాంశి (5)–ఎల్ల అంశములు గలవాఁడు, One who comprehends or embraces all parts.

82 సర్వాత్మత్వము (173)–సమస్తమును దనను గా దలఁచుట.

83 స్వధర్మపద్ధతి (99)-భగవత్సేవారూపమగు సరణి.

84 స్వయంబ్రహ్మ (3)-తానే బ్రహ్మమనువాఁడు.

85 స్వస్వరూపానుసంధానము (58)-తనయొక్క వాస్తవస్థితిని తెలిసికొనుట.

86 సాక్షాద్వ్యాపారము (8)-ప్రత్యక్షముగఁ గలసి మెలసి మెలఁగుట, Direct dealing.

87 స్థానిక సుఖములు (115)-తన యిల్లు వాకిలి మొదలగువాని వలనఁ గలిగెడి సుఖములు.

88 స్వాత్మతత్త్వానుసంధానము (58)-తనయొక్క వాస్తవస్థితిని తెలిసికొనుట.

89 సూక్ష్మతాపరాకాష్ఠ (89)-అత్యంత సూక్ష్మత్వమును బొందుట.

